# చతుర

సంపుటి : 6    మే : 1983    సంచిక : 4

## ఈ నెల సమగ్ర నవల

లాయర్‌గా ప్రాక్టీస్ ప్రారంభించి కఠోరమైన కార్యదీక్ష, తెలివితేటలు, మాటకారితనం, అందచందాలతో ఓటమి ఎరగని న్యాయవాదినిగా నిలబడిన ఆమె దగ్గరకు నగల షోకేస్ లాంటి అందమైన క్లయంట్ వచ్చి తప్పిపోయిన తన భర్తను వెతికిపెట్టమని అర్థించింది. సరేనని అన్వేషణ ప్రారంభించీ ప్రారంభించకుండానే ఆ క్లయంట్‌నే హంతకురాలిగా తేల్చి బోనులో నిలబెట్టారు పోలీసులు. ఆ క్లయంట్




చెప్పిన అసత్యాల్ని ఛేదించే భారం కూడా ఆమె నెత్తినే పడింది. మరి ఆమె అసలు నేరస్తుల్ని కనుగొనగలిగిందా? క్లయంట్ అబద్ధాలాడి కేసును జటిలంచేయాల్సిన పరిస్థితి ఎలా ఏర్పడింది? కోర్టులో ప్రత్యర్థుల వాదాన్ని పటాపంచలు చేసి తన క్లయంట్‌ను కాపాడగలిగిందా? ఆ ప్రయత్నంలో ఆమె ఎదుర్కొన్న కష్టనష్టాలేమిటి?

## రాండార్‌గై

చిత్రీకరించిన లేడీలాయర్ జీవితం, ఆమె చుట్టూ పరిభ్రమించే ప్రేమ, మోసం, పగ, ద్వేషం, మోహం వంటి మానవ స్వభావాల వైచిత్రికి దర్పణం 'ఛాయ' ఈ నెల చతుర సమగ్ర నవల.

# చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ — 500 004.

## రచయితలకు ఆహ్వానం

**ఇతివృత్తంలో, రచనా సంవిధానంలో నూతనత్వం చూపగల రచయితలకు 'చతుర'లో నెల నెలా నవలల పోటీయే! ప్రచురించే ప్రతి నవలకూ రు. 1500, అత్యుత్తమ నవలకు రు. 2000 పారితోషికంగా అందజేసే నవనవలా వేదిక 'చతుర'.**

* నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 — 112 పేజీల నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు 'చతుర'లో అచ్చులో 60 - 70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించ వలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపించగలరు.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షం లోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రా గానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

ముఖచిత్రం : ఎస్. శివన్నారాయణ

రెండవకవరు : ఎల్. ఆర్. గ్రోవర్

మూడవకవరు : బ్రహ్మదేవ్

# అన్నదాత

## వ్యవసాయదారుల
## సచిత్ర మాసపత్రిక

* పచ్చని పైరు విప్లవానికి...
* పాడి పరిశ్రమాభివృద్ధికి...
* గ్రామసీమల సౌభాగ్యానికి...

మార్గదర్శి

సాలు చందా రూ 24లు మాత్రమే
పోస్టేజి ఉచితం!
విడి ప్రతి రూ 2/-లు

వివరాలకు:-
మేనేజరు, అన్నదాత ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాదు-500 004
ఫోన్: 223422

# విచిత్ర ప్రపంచం

## రొమాంటిక్ ట్రీ

"గ్రూమ్స్ ట్రీ
తౌడవ్‌కడ్
డి. 24,
వి. యుటిన్
ఈస్ట్ జర్మనీ"

అన్న అడ్రస్‌కి ఉత్తరం రాసి పోస్ట్ చేస్తే అది తిన్నగా వెళ్ళి అక్కడున్న ఓ పెద్ద చెట్టు తొర్రలో పడుతుంది. పోస్టమన్ రోజుకి రెండు మూడు సార్లు గుప్పెళ్ళ కొద్దీ ఉత్తరాలు అందులో వేసి పోతుంటాడు.

ఈ చెట్టేమీ అనామిక కాదు. అధికార ముద్ర ఉన్నది. అతిపురాతనమైన ఈ చెట్టు రోజుకి ఎంతలేదన్నా దాదాపు 800 ఉత్తరాలకు తక్కువ అందుకోదు.

చాలామంది యువతీ యువకులు, ముఖ్యంగా అమ్మాయిలు ప్రేమలేఖల కోసం ఈ చెట్టు దగ్గర పడిగాపులు పడి ఉంటారు. ఎవరి ఉత్తరం ఎవరైనా చదవచ్చు. కాకపోతే మీది కాని ఉత్తరాన్ని అందులోనే వదిలెయ్యాలి. ఈ పద్ధతి 1891లో మొదలై ఇప్పటికీ నిర్విఘ్నంగా కొనసాగుతూనే ఉంది. ఈ ఉత్తరాల ద్వారా అమ్మాయిలు బాయ్ ఫ్రెండ్స్‌ను వెతుక్కుంటారు. చాలామంది ప్రేమికులు ఈ చెట్టుద్వారా ప్రేమలేఖల్ని ఎక్స్‌చేంజ్ చేసుకుంటారు. పెళ్ళి చేసుకుందామనుకునేవారిక్కూడా ఈ చెట్టు సాయం చేస్తుంది. ఊరికే సరదాగా కాలక్షేపం కోసం తనని ఉపయోగించుకునే వారిని కూడా ఈ చెట్టేమీ అడ్డు పెట్టదు.

ఈ చెట్టుకిపుడు 600 ఏళ్ళు. ప్రేమికులు, ఉత్తరాలు మార్చుకునే వాచ







మొదట్లో దీన్ని 'లవర్స్ ట్రీ' అని పిల్చేవారు. 1891లోనే మొట్టమొదటి సారిగా ఓ జంటకు ప్రేమ వివాహం చేసి వధూవరుల్ని ఆశీర్వదించిందీ చెట్టు.

1938లో ఓ పదహారేళ్ళ అల్లరి అమ్మాయి తమాషాకోసం ముద్దుముద్దుగా మురిపాలు పోతూ ఓ ప్రేమలేఖ రాసి దాంట్లో పడేసి ఆ తర్వాత ఆ సంగతి మర్చిపోయింది. ఆ ఉత్తరం అందుకున్న ఓ కొంటె కుర్రాడు దాన్ని సీరియస్‌గా తీసుకుని ఆమెతో కలం స్నేహం నడిపాడు. అయిదేళ్ళపాటు సాగిన కలం స్నేహం కలల్లోకి దారితీసి ప్రణయంగా మారి వాళ్ళిద్దర్నీ ఓ ఇంటివాళ్ళని చేసి మళ్ళీ చెట్టు దగ్గరికి చేరిపోయింది. అలా మొదలయిందీ కథ.

మనదేశంలో కూడా అలాంటి చెట్టు ఒకటుంటే ఈ సాంఘిక, వరకట్న దురాచారాల బాధ తప్పవచ్చునేమో!

## సంతాపం

పూర్వం దేశాన్ని పాలించే రాజు మరణిస్తే సహజంగా ప్రజలు తమ ప్రియతమ నాయకుణ్ని కోల్పోయినందుకు బాధపడేవారు. ఆతర్వాత సింహాసనాధిష్టుడైన కొత్త రాజుపాలనకు అలవాటు పడిపోయేవారు.

రాజులుపోయి మంత్రులు వచ్చిన మన ప్రజాస్వామ్యంలో ప్రతిష్టాకరమైన పదవిలో ఉన్న ఏ బడా, ఛోటా మంత్రి మరణించినా సంతాపదినాల ప్రకటన; కార్యాలయాలు, విద్యాసంస్థల మూసివేత; రేడియో, టీవీలలో సంతాప సందేశాల మోత; ఎక్కడైతే మంత్రి భౌతిక కాయాన్ని ఖననం లేక దహనం చేస్తారో అక్కడికి హుటాహుటిన పన్లన్నీ మానుకొని ప్రముఖులంతా తరలివెళ్లటం మనకు పరిపాటి అయిన సంగతే.

కానీ ఆయిల్ దేశంగా అన్ని విధాలా అభివృద్ధి సాధించిన సౌదీఅరేబియా రాజు ఖలీద్ ఇటీవల హఠాత్తుగా మరణించినపుడు, అక్కడ జరిగిన విషయాలు వింటే మనం ఎంత వెనుకబడి ఉన్నామో! అర్థమౌతుంది.

అతని పరిపాలనలో ప్రజలంతా మంచినే చవిచూశారు. అయినా జాతీయ పతాకాన్ని అవనతం చేయలేదు. అధి

కారులు, అనధికారులు సంతాప సందేశాలిస్తూ కాలాన్ని ఒక్క నిమిషం కూడా వృధాచేయలేదు. మొత్తం కార్యక్రమాన్ని నిశ్శబ్దంగా, క్లుప్తంగా ముగించేశారు. సౌదీ అరేబియా దూరదర్శిని రాజు మరణ వివరాలను, జీవిత విశేషాలను సంగ్రహంగా



అందించింది. రియాద్‌లోని సమ్మర్ పాలెస్‌లో విశ్రాంతి తీసుకుంటున్నపుడు హఠాత్తుగా వచ్చిన గుండెపోటుతో రాజు ఖలీద్ మరణించినట్లు టీవీలో ప్రకటన చేశారు.

తర్వాత మామూలు బట్టతో కప్పి ఉంచిన ఖలీద్ భౌతికకాయాన్ని ఎయిర్‌ఫోర్స్ విమానంలో ఖనన స్థలానికి చేర్చడం, మెల్లిగా విమానంలోంచి దింపడం, దింపిన తర్వాత మతాచారం ప్రకారం చేయవలసిన తంతు ముగించిన వెంటనే ఖననం చేయడం చూపించారు. ఎటువంటి ఏడుపులు, పెడబొబ్బలు లేకుండా గుమిగూడిన కొద్దిపాటి గుంపు మౌనంగా అశ్రు తర్పణ వదిలింది.

రాష్ట్రంలో ఎటువంటి సంతాపదినాలు పాటించబడలేదు. పని ఏమాత్రం కుంటుపడలేదు. రేడియో, టీవీ సంతాపాలు, విషాద కార్యక్రమాలు లేవు.

'ఇదే మా పద్ధతి. స్వచ్ఛమైన ఇస్లాం మత పద్ధతి ప్రకారం మేం జీవిస్తాం. రాజైనా, సాధారణ పౌరుడైనా సరే జీవన్మరణాలు అందరికీ ఒకటే'నని వ్యాఖ్యానించాడొక సౌదీ పౌరుడు.

# పెంపకం సరదాలు

'ఏ తల్లి నినుగన్నా మేము నిను అమ్మా నాన్నా అయ్యామురా బంగారు తండ్రీ' అనుకుంటూ పెంపుడు పిల్లుల కళ్ళల్లో తమ ప్రతిబింబం చూసుకుని మురిసిపోయే తల్లిదండ్రుల మాటేమోగాని పిల్లలున్నా లేకపోయినా ప్రాణ సమానంగా పెంపుడు జంతువుల్ని ముద్దు చేసేవారు చాలామంది వున్నారు.

అసలు పెంచుకోవాలన్న ఉద్దేశం ఉండాలిగాని ఎలకనుంచి ఏనుగుదాకా దేన్నయినా పెంచుకోవచ్చు. ప్రముఖుల పెంపుడు సరదాలు పలురీతులు. ప్రఖ్యాత రచయిత ఆస్కార్‌వైల్డ్ దగ్గర ముద్దుల




మూటగట్టి రెండు పెంపుడు ఉడతలుండేవి. రాసుకునేటపుడు అవి భుజాల మీదపాకినా,జుట్టుపీకినా పిసరంత కూడా విసుక్కోకుండా మధ్యమధ్య వాటినిమురిపెంగా నిమురుతూ తనపని తను చేసుకునేవాడు.

రష్యన్ రచయిత టర్జనెవ్ దగ్గరలేని జాతికుక్క లేదు. వాళ్ళింటికెళ్ళేవాళ్ళు



కాలుతీసి కాలుపెట్టడానికి హడలిచచ్చేవారు ఏ కాలు ఏ కుక్కమీద పడుతుందో నన్న భయంలో. ఇంటినిండా కుయ్‌కుయ్‌మనే కుక్కలుంటే అతిథులకు ప్రాణసంకటమే మరి. మీర్జాగాలిబ్ కళా హృదయానికి తగ్గట్టు అతని వద్ద అసంఖ్యాకంగా నెమళ్ళు వుండేవి. రోజులో రెండుసార్లయినా వాటిని చూడకుండా వుండలేకపోయేవాడు. చైనా కవి లూసన్, ఇటలీ రచయిత మొరావియు ఇద్దరూ పావురాళ్ళని పెంచేవాడు. వాటికోసం ప్రత్యేకంగా గూళ్ళు కట్టించి అతి జాగ్రత్తగా చూసుకునేవాడు.

విక్టర్ హ్యూగోది తమాషా మనస్తత్వం. ఇతని దగ్గర గొర్రెలు, హంసలు రెండూ వుండేవి. వాటిని స్వంత పిల్లలకంటే ఎక్కువ ప్రీతితో సాకేవాడు. జర్మనీ నాటక రచయిత బ్రెక్ట్ రకరకాల సీతాకోకచిలుకల్ని సేకరించి పెట్టుకునేవాడు. వాటిని గాజు గదుల్లో బంధించి పుప్పొడి జల్లి అవి తింటుంటే చూసి ఆనందించడం అతనికి చాలా ఇష్టమైన దృశ్యం.

ఎథీపియో చక్రవర్తి హెయిలీ సెలస్సీకి సింహం అంటే భయంగానీ సింహం పిల్లల్ని పెంచుకోవడం అంటే మహా సరదా! అతని దగ్గర ఎపుడూ పందకు పైగా పెంపుడు సింహం పిల్లలుండేవి. అలాగే కంబోడియా యువరాజు నోర్డం స్వంతంగా ఓ జూని పెట్టుకుని దాన్ని ఏనుగు పిల్లలతో నింపేశాడు. మిత్రుల్ని, బంధువుల్ని పనిగట్టుకుని జూ దగ్గరికి తీసికెళ్ళి 'బుజ్జిముండలు చూడండి...ఎంత గునగునా తిరుగుతున్నాయో' అని చెప్పి తెగ మురిసిపోయేవాడు.

లెనిన్‌కి పిల్లల్లేరన్న సంగతి చాలా మందికి తెలీదు. క్రెమ్లిన్‌పాలెస్‌లో ఒంటరిగా వుండే లెనిన్‌కి తన నాలుగు పెంపుడు పిల్లులే మంచి కాలక్షేపంగావుండేవి.

బైరన్ కవికి గుర్రపుస్వారీ అంటే ప్రాణం. తన పెంపుడుగుర్రాల సకిలింపు విని పులకించిపోయి ఆ అనుభూతితో అతనెన్నో కవితలల్లాడు. హెమ్మింగ్వేతన

# ప్రియ తోడుగా ఉంటే చాలు...
# మరింత సంతృప్తి!




బ్రేక్‌ఫాస్ట్ తీసుకొనేవేళ పక్కన 'ప్రియ' ఉంటే ప్రతి ఉదయం రుచులమయం. అదే 'ప్రియ' అకర్షణలోని రహస్యం. నోరూరించే పలురకాల పచ్చళ్ళలో మీకు కావలసింది ఎన్నుకోండి.

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ 300, 650 గ్రాముల సీసాల్లో దొరుకుతాయి.

* మామిడికాయ * నిమ్మకాయ * టొమాటో
* అల్లం * గోంగూర * ఉసిరికాయ * చింతకాయ
* పండు మిరపకాయ * వంకాయ
తీపిరకాలు : * మామిడికాయ * అల్లం

**ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ**

ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI
MARKETING
PRIVATE LIMITED
Eenadu Compound
Hyderabad - 500 004

జీవితకాలంలో సగం సమయాన్ని చేపలు పట్టడానికి వినియోగించేవాడు. మత్స్య గంధం అంటే ముక్కుపుటాలెగరేసేవాడు. మనకి తెలీకుండా ఇంకెంతమంది పెంపుడు జంతువుల ప్రముఖులున్నారో!

## పరారీ

కంటికెదురుగా, కళ్లు చెదిరేలా డబ్బుంటే డబ్బువిలువ తెలిసిన ఎవరికయినా కన్ను కుడుతుంది. కానీ డబ్బు చేజిక్కించుకుని, పోలీసుల కళ్లల్లో కారంగొట్టి కనిపించకుండా తప్పించుకుపోయే ధైర్యం నూటికో కోటికో ఒక్కడికే వుంటుంది.

దుబాయ్ నేషనల్ ట్రావెల్ ఏజన్సీలో, దుబాయ్ ప్రభుత్వం తరఫున ఐదేళ్లుగా పనిచేస్తున్న సీతారామ్ అనే భారతీయుడు ఉన్నట్టుండి ఓ రోజున హఠాత్తుగా మాయమయిపోయాడు. కొడితే ఏనుగు కుంభస్థలాన్నే కొట్టమన్నట్లు పోతూ పోతూ రెండున్నర కోట్ల రూపాయలు కూడా పట్టుకుపోయాడు.

దుబాయ్ పోలీసుల దిమ్మ తిరిగిపోయింది. వెంటనే సత్వరచర్యలు తీసుకుని సీతారాం సమాచారాన్ని భారతీయ పోలీసు విభాగానికి తెలియజేశారు. ఈ లోపల సతీసమేతుడైనసీతారాం బొంబాయి విమానాశ్రయంలో దిగి క్షేమంగా అక్కడి జనాల్లో కలిసిపోయాడు. పోలీసులు మద్రాసు, బొంబాయి, కలకత్తా నగరాల్లో వున్న సీతారాం బంధువుల ఇళ్ళమీద నిఘావేసి ఉంచినా ఫలితం కనబడలేదు.

ఓరోజు అనుకోకుండా శాంతకుమారి అనే ఒకావిడ రేషన్‌కార్డు కోసం బొంబాయి మారుమూల ప్రాంతంనుంచి దరఖాస్తు పెట్టుకుందన్న సమాచారం అందిన పోలీసులు హుటాహుటిన ఆవిడ దగ్గరకు వెళ్ళి ఇంటర్వ్యూ మొదలెట్టారు. వాళ్ళ ప్రశ్నల పరంపరకి తట్టుకోలేక ఆవిడకి గుండెనొప్పి వచ్చింది. ఇంతకీ తెలిందేమిటంటే ఆవిడ తమిళనాడులోని పలన్యాన్ కొట్టయ్ గ్రామంనించి కొత్తగా బొంబాయి వచ్చిందని!

పోలీసులు కొత్త పథకాలు వెతకసాగారు. సీతారాం కొడుకు పూనాలోని ఓ హయ్యర్ సెకండరీ బోర్డింగ్ స్కూల్లో చదువుతున్నాడని తెలిసి సివిల్ డ్రెస్‌లో ఆ దార్లన్నింటిమీదా కాపువేశారు. పిల్లాణ్ణి చూడ్డానికి తల్లి శాంతకుమారిగాని, తండ్రి సీతారాంగాని ఎవరో ఒకరు రావచ్చని వారి నమ్మకం. పోలీసుల దురదృష్టమేమోగాని సీతారాం కొడుకు సంజయ్‌ని చూడ్డానికి ఎవరూ రాలేదు.

నీలగిరి కొండల్లో సీతారాం తిరుగుతున్నాడన్న గాలివార్తను పట్టుకుని కొండల్ని, కోనల్ని గాలించిపారేశారు. ఫలితం శూన్యం. అలాగే సీతారాం ఓ రబ్బర్ ఎస్టేట్ కొన్నాడన్న వార్తకూడా నీలివార్తగా మారిపోయింది.

మంచివాడు, నమ్మకస్థుడు, నిజాయితీపరుడు, కష్టపడి పనిచేసే సీతారాం అంత పని చేశాడంటే దుబాయ్ ప్రభుత్వానికి నమ్మశక్యంకానంత దిగ్భ్రమ కలిగింది. ఇంకా అతనికోసం పోలీసులు గాలిస్తూనే వున్నారు.

వినడానికి గొప్ప సస్పెన్స్ థ్రిల్లర్ గానే వున్నా సీతారాం పట్టుబడితేమాత్రం వెంటనే అతన్ని దుబాయ్ పంపేస్తారు. అక్కడ ప్రజలందరి సమక్షంలో, బహిరంగ ప్రదేశంలో ఒక్కవేటుతో అతని కుడిచెయ్యి నరికేసి అతగాణ్ని జైల్లో పారేస్తారు. అదీ అక్కడి న్యాయం. *




**నా** ఆఫీసులోకి దారితీసే మేడ మెట్లమీద ఎదురుగా గోడకు తగిలించిఉన్న ఇత్తడి బోర్డును ఒకసారి పరిశీలనగా చూశాను. 'సాగరీరావుబి.ఎ.బి.ఎల్.అడ్వొకేట్'అని ఇంగ్లీషులో చెక్కిఉన్న నా పేరు చూడ గానే నా చెవుల్లోంచి విజయగర్వం కాస్త పొడుచుకువస్తున్నట్టు అనిపించింది. నా చెవులు కాస్త పొడవుగా ఉంటాయి. నిజా నికి నా తలనుంచి కాళ్ళదాక అవయవా లన్నీ మామూలు పరిమాణాలను మించి నవే. అంటే-పొడవైనవీ లేదా పెద్దవైనవీ నన్నమాట.

నేను గర్వపడడానికి చాలా కారణా లున్నాయి. నా భర్తను కాదనుకొని ఢిల్లీ నుంచి వచ్చి ఇక్కడ లాయర్‌గా ప్రాక్టీస్ ప్రారంభించిన నాటినుంచి ఇప్పటిదాకా నేను ఎన్నో విజయాలు సాధిం చాను. కఠోరమైన కార్యదీక్ష, తెలివి తేట లను సక్రమంగా ఉపయోగించుకోవడం, మాటకారితనం, వీటికితోడు నా అంద చందాలు.. అన్నీ కలిసిఇన్నేళ్ళలో నన్ను ఓటమిఎరుగనిన్యాయవాదిగా నిలబెట్టాయి. సహజ వాదనాశక్తి, సాక్షులను క్రాస్ ఎగ్జామిన్ చేసే నేర్పు, స్త్రీ పురుషులను చక్కగా అంచనావెయ్యగల సామర్థ్యం నాకుబాగా సాయపడ్డాయి.నేను తీసుకున్న కేసులకు సంబంధించిన పరిశోధనలు కూడా చాలావరకు నేనే చేస్తుంటాను. అలాగని నాకుమనపోలీసులమీద నమ్మకం లేదని కాదు. పోలీసుల్లోనూ ఎందరో నిపుణులున్నా వారి పద్ధతులు వేరు. నా దారి వేరు.

మేడమెట్లమీద ఎవరో పెద్దగా తుమ్మడంతో నా ఆలోచనల తీగె తెగిపోయింది. గోడమీదినుంచి నన్ను మురిపిస్తున్న నా నేమ్‌ప్లేట్‌ను తదేకంగా చూస్తున్న నా ఏకాగ్రత చెదిరిపోయింది. ఒక్కసారిగా గబగబా నాలుగుమెట్లు పైకిఉరికి నా వెనక తుమ్మిన మనిషిని చూశాను. నా అందం ముందునుంచీ, వెనుకనుంచీ కూడా ఆకర్ష ణీయంగా ఉంటుందని మగవాళ్ళేకాక ఆడ వాళ్లు కూడా చెప్పుకోడం పరిపాటి! ఈ ఆకర్షణకూడా నాకునావృత్తిలోఒకరకంగా తోడ్పడి నా పనిబరువును తగ్గిస్తుంటుంది.

నా ఆఫీసు వాకిట నిలిచి వాకిలికి బిగిం చిన అందమైన తెల్లటి తెలుపూ-గులాబీ రంగు పసుపూ కలగలిసిన గోడకు తగి లించిన బోర్డు ఒకసారి చూశాను. ఆ బోర్డు మీద 'సాగరీరావు అండ్ నిరూపామూర్తి అడ్వొకేట్స్' అని రాయించాను. కింద చిన్న అక్షరాల్లో ఆఫీస్ టైమింగ్సున్నాయి. ఆదివారంశెలవనికూడా ఉంటుందందులో.

బహుశా లాయర్లఆఫీసులకు ఇటువంటి బోర్డులు తగిలించడం అణకువకు గుర్తు కాకపోవచ్చు. కానీ నాకూ, అణకువకూ చాలాదూరం. అబ్బాయిలకు, అమ్మాయి లకు మధ్య తేడావుందని తెలియవచ్చిన నాటినుంచీ నేను సదరు అణకువ,వినయం, విధేయత వంటి పనికిమాలిన మాటలకు 'టాటా' చెప్పేశాను.

చాలా ఏళ్ళక్రితం నా భర్తగా చలా మణీ అయ్యే ఆ ఆర్మీఆఫీసర్‌చాలా ఘోర మయిన మాట అన్నాడు. నా పొట్టి జాకెట్టుకూ,బొడ్డుకిందికిఉండేచీరకూమధ్య గల భాగాన్ని చూస్తూ "సాగరీ! నాకు భారతీయవనితల సౌశీల్యంమీద నమ్మకం లేదు"అని అందరినీ ఏకగాటినకట్టి ఆయన అలా దుమ్మెత్తిపొయ్యడం నాకు నచ్చ లేదు. నేను అడ్డు చెప్పబోయేసరికి నన్ను బుజ్జగించే ప్రయత్నంలోనాభుజం తడుతూ "సౌశీల్యం మీద గౌరవమున్న స్త్రీ తన




నడుమును నగ్నంగా చూపించకూడదు. అలా చూపించడం మాడెస్టీ కాదు" అన్నాడు.

మాడెస్టీ లేదా విధేయత అనే మాటలకు అర్థం అది. ఏది ఏమయినా నాకూ, వినయ విధేయతలకూ చాలా దూరం!

నా పార్ట్నర్ నిరూపామూర్తి కూడా నాలాంటిదే. ఆమె మా చీఫ్ క్లర్క్ హరిహరన్‌కు ఏవో సూచనలు జారీచేస్తున్నది. నేను నా కోసం ప్రత్యేకించిన ఆఫీస్‌గదిలోకి వెడుతూ ఆమెను చూసి చెయ్యి ఊపాను. నా గది కాస్త పెద్దదే. నిరూప గది నా గది పక్కనేవుంది. అది కాస్త చిన్నది. అక్కడ ఆమె డబ్బు, ఉత్తరాలు, ఫైళ్లు మొదలయిన వ్యవహారాలను చూస్తుంటుంది.

నిరూపకు, నాకు ఎన్నో పోలికలు ఉన్నాయి. మా ఇద్దరి గుణగణాలు, ఆచార వ్యవహారాలు, దృక్పథాలు... తక్కిన అలవాట్లు దాదాపు ఒక్కరకంగానే ఉంటాయి. కాకపోతే ఆమె నాకన్నా బాగా చిన్నది. అసలు మా పరిచయంకూడా ఒక కామన్ ఫ్రెండ్ ద్వారా అయింది. పరిచయం అయ్యాక నా జూనియర్‌గా చేరి అంచెలంచెలుగా నా పార్ట్నర్ అయింది. నాకు ఒక మంచి స్నేహితురాల్నిచ్చిన ఆ మిత్రుడు ఇప్పుడు లేడు.

ఏర్‌కండిషనర్ నెమ్మదిగా శబ్దంచేస్తుండగా స్ట్రాంగ్ కాఫీ చప్పరిస్తూ కూర్చున్నాను. ఇవాల్టికి ఇది మొదటికప్పు. ఉదయం లేవగానే టీ తాగుతాను. ఆ తరువాత బ్రేక్‌ఫాస్ట్. అదృష్టవశాత్తు అనవసరంగా బరువెక్కకపోవడం అనే సౌకర్యం ఉందికనుక నేను బాగానే భోంచేస్తుంటాను.

కాఫీ బాగుంది. లేత గోధుమవన్నెలో ఉన్న ఆ కాఫీరంగు నా ఒంటిరంగుతో పోటీపడుతున్నది. నా దృష్టి బల్లమీద ఉన్న నోట్ మీదికి మళ్లింది. అందులో నేను ఇవాళ వాదించవలసిన కేసుల వివరాలు, కలుసుకోవలసిన క్లయింట్ల వివరాలు,ఇతర ఎంగేజ్‌మెంట్లు రాసిఉన్నాయి. నా సెక్రటరీ గ్లోరియా ప్రతిరోజూ అలా రాసిపెడుతూ వుంటుంది. ఆమె రాస్తే చూడచక్కగా ఉంటుంది. గ్లోరియా పొడవుగా సన్నగా ఉంటుంది. ఆమె ఆంగ్లో ఇండియన్. వయసు ఇరవై ఏడు. ఆరేళ్ళనుంచి నాతోనే పనిచేస్తున్నది. శ్రద్ధగా చక్కగా పనిచేస్తుంది. కాకపోతే గుర్రం ముఖంలాగా ఉండే ఆ అమ్మాయి ముఖం చూసి ఏ మగవాడూ వెంట పడడు. అందుకే శ్రద్ధగా పనిచేస్తుందేమో.

తలుపు మీద నెమ్మదిగా కొట్టి గ్లో నా గదిలోకి తోసుకు వచ్చింది. 'గుడ్ మార్నింగ్' అన్నది గ్లో. నేను తల పంకించి, కాఫీ తాగుతూ ఆమెను కూచోమని సైగ చేశాను. నా బల్లకు అవతల ఉన్న కుర్చీలో కూచుని తన సన్నని కుడి కాలిమీద అంతే సన్నని ఎడమకాలు వేసుకుని–ఎడమచేత నోట్‌బుక్ పట్టుకుని, కుడిచేత పెన్సిల్ ఉంచుకుని సిద్ధంగా కూచుంది.

"మీ కోసం ఒక క్లయంట్ కాచుక్కూచున్నారు మిసెస్‌రావ్... చాలా అర్జెంటుట!" అంది.

నా భర్తా, నేనూ చట్టం ప్రకారం విడిపోయినా ఈ 'మిసెస్' అనేమాట నాకు వృత్తిరీత్యా సాయపడుతూనే ఉంది.

"నాకోసం క్లయంటా – ఇంత పెందరాళే? నీవు రాసిన ఈ నోట్‌లో ఆ సంగతి లేదనుకుంటానే?" అన్నాను.

"అవును ముందుగా అపాయింట్

మెంట్ ఫిక్స్ చేసుకోలేదు" అన్నది గ్లో.

"ఓహో! సరే! ఆయనను నిరూపను కలుసుకోమను. నేను బిజీగా ఉన్నాను. ఒక బెయిల్ అప్లికేషన్ తయారు చేసి త్వరగా తెమలాలి!"

"ఆ క్లయింట్ ఆయన కాదు... ఆవిడ!"

నేను కొద్ది క్షణాలు తటపటాయించి కాఫీ తాగడం పూర్తి చేసేను.

"ఆవిడా?"

అవునన్నట్లు తల ఊగించింది గ్లో. ఆమె పెదవులు నవ్వడానికా అన్నట్టు విచ్చుకుంటున్నాయి.

"గ్లో! ఇందులో నవ్వడానికేముందీ?"

"ఆవిడ చూడ ముచ్చటగా ఉంది. పట్టుచీర కట్టుకుని, ఒంటినిండా నగలు పెట్టుకుని మరీ వచ్చింది. అందానికి తగ్గ ఆస్తి కూడా ఉన్నట్టుంది ఆవిడకు"

గ్లోరియాకు అద్భుతమైన పరిశీలనా శక్తి ఉంది. క్లయింట్ల గురించి ఆమె చెప్పే విషయాలు చాలా ఉపయోగకరంగా ఉంటాయి. ఒకసారి వాళ్లింట్లో జరిగిన ఒక పార్టీలో ఆమెను అడిగాను. అప్పటికే చాలా హుషారుగా ఉండడం మూలంగా గ్లో నిజం చెప్పేసింది. గుర్రప్పందాలకు వెళ్లేటప్పుడు ఆమె తండ్రి ఉపయోగించే బైనాక్యులర్స్‌ను ఆమె చిన్నపిల్లగా ఉన్నప్పుడే ఉపయోగించేదట! తమ ఎదురింట్లోఉండే అందమైన సినిమా తార ఇంట్లో జరిగే తతంగమంతా జాగ్రత్తగా పరిశీలించేదట! పరిశీలనా శక్తి ఎక్కువ చేసుకోవాలనుకునే ఆడపిల్లలకు గొప్ప శిక్షణే అది!

"మిసెస్‌రావ్! ఆవిడ బాగా నెర్వస్‌గా ఉంది...నోట్లో..."

"ఏమిటి?"

"చేతనున్న బంగారం కలాన్ని నోట్లో ఉంచుకుని కొరుకుతున్నది"

"అలాగా! కాని నేను చాలా బిజీగా ఉన్నానే. ఆ బెయిల్ అప్లికేషన్ పూర్తి చెయ్యాలి. ఆమెను నిరూప దగ్గరికి పంపించు"

"లాభం లేదండీ! నేనీ ఎత్తు ముందే వేశాను. కాని, ఆమె మిమ్మల్ని తప్ప మరెవర్నీ చూడనని మొరాయించింది"

"సరే! మరిక తప్పేదేముంది? వీలుంటే ఆమెను కాసేపు వెయిట్ చెయ్యమను. ఈ లోగా నేను.. "

"ఆమె వెయిట్ చేసేలా కనబడ్డం లేదు! అసలు ఆమెకు వెయిట్ చేసే అలవాటే ఉన్నట్టులేదు. నేనింకా కాస్సేపు ఇక్కడే ఉంటే ఆమె సరాసరి ఈ గదిలోకే జొరబడినా ఆశ్చర్యపడనక్కర లేదు'' అన్నది గ్లో నవ్వుతూ.

ఆ అభిప్రాయం సరైనదేనని వెంటనే తేలిపోయింది. నా గది తలుపు మీద గట్టిగా చప్పుడూ, ఆ వెంబడే తలుపును వేగంగా తెరిచి అంతకన్నా వేగంగా గదిలోకి దూసుకు వచ్చిన ఆమె అచ్చం ఓ నగల స్టాండ్‌లాగే కనిపించింది నా కళ్ళకి.

"హలో! మీ కోసమే కాచుకున్నాను. నేవచ్చి చాలా సేపయింది'' అంది ఆమె చప్పుడయ్యేలా కుర్చీ లాక్కుని – నా మర్యాదల కోసం ఎదురు చూడ్డం లేదన్నట్టు చటుక్కున కూచుంటూ. నేను ఆమెను గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోయాను. గ్లో పరిస్థితి కూడా అలాగే ఉంది.

"మీరెవరు? ఇంత పొద్దున్నే ఇంత అర్జెంటుగా నన్నెందుకు చూడాలను కున్నారో తెలుసుకోవచ్చా? నేను సాధారణంగా ముందుగా అపాయింట్‌మెంట్

లేకుండా ఎవరినీ కలుసుకోను" అన్నాను.

"నాకు ఆ విషయం తెలుసు! అయితే అపాయింట్ మెంట్ తీసుకుని వచ్చేంత వ్యవధి లేకపోయింది."

"అంత అర్జెంటా?"

"అవును. నాకు ఇది అర్జంటే. మీరు ఆ మాత్రం అర్థం చేసుకోలేనివారేంకాదనీ నాకు తెలుసు" అన్నది ఆమె మూతి ముడుస్తూ. ఆమె లిప్‌స్టిక్ వేసుకోలేదని గమనించాను.

"అది సరే! ఇంతకూ మీ రెవరో చెప్పనేలేదు" అన్నాను.

"ఆ వివరాలన్నీ చెబుతాను. మిమ్మల్ని ఒంటరిగా - కలుసుకోవాలనుకున్నానని ముందే చెప్పాను" అన్నది ఆమె గ్లోవైపు అనుమానంగా చూస్తూ.

అది గ్రహించి గ్లో చిరునవ్వునవ్వి లేచి నిలబడింది. తన నోట్ బుక్, పెన్సిల్ తీసుకుని నా ముందు కూచున్న సదరు బంగారునగల షాపును తేరిపార జూచి నెమ్మదిగా గదిలోంచి నిష్క్రమించింది.

ఈలోగా నేను రివాల్వింగ్ చేర్‌లో వెనక్కువాలి నా కొత్తక్లయింట్ చెప్పేది వినడానికి సిద్ధమయ్యాను. పనిలో పనిగా నా కాలు టేబుల్ కింది భాగానఉన్న ఒక బటన్‌ను నొక్కింది. కాళ్లు ఉంచుకునే చెక్కకింద అమర్చిన టేప్ రికార్డర్ ఆ క్షణంనుండి పనిచేయనారంభించింది. నా గదిలో టోక్యోనుంచి తెచ్చిన మైక్రోఫోన్‌లు అమర్చిపెట్టాను. పూలకుండీల్లో పుస్తకాలలా కనిపించే నకిలీ అట్టల్లోనూ, నా బల్లకిందా ఆ మైకులు అమర్చాను. అలా నా క్లయింట్లతో జరిపే సంభాషణ లన్నీ రికార్డ్‌చేస్తూ ఉండటంవల్ల తర్వాత నా పని సుఖంగానూ ఉంటుంది - కొన్ని సందర్భాలలో సురక్షితంగానూ ఉంటుంది.

"ఆ అమ్మాయి మీ అసిస్టెంట్ గదూ! ఆమెకు కొంచెం క్యూరియాసిటీ ఎక్కువనుకుంటాను. ఇలాటివాళ్ళను నేను వెంటనే కనుక్కోగలనులెండి" అందామె.

"ఇలా చూడండి! మీరు ఈ గదితలుపు తోసుకుని బలవంతంగా నా గదిలోకి జొరబడింది నాతో పనిచేస్తున్నవాళ్ళ గురించి మాట్లాడంకోసమేఅయితే, మిమ్మల్ని వెళ్ళిపొమ్మని చెప్పాల్సి ఉంటుంది" అన్నాను కాస్త గట్టిగా.

"అంటే! మీకు చీటికిమాటికీ కోపం వస్తుందన్నమాట"

"ఈ చిల్లరగొడవలు మానేసి వ్యవహారం మాట్లాడండి. నేను చాలా బిజీగా ఉన్నాను. నా టైమ్ ఇలా వేస్టు చేసుకోలేను"

"నా సంగతి అంతే! ఇంతకూ మీ కన్సల్టేషన్ ఫీజు ఎంత?"

"నేనేదీ వినలేదు. మీ కేసు తీసుకోగలనో లేదో నిర్ణయించాలేదు. ఆ మాటకొస్తే అసలు మీ పేరుకూడా నాకు తెలియదు" అన్నాను అసహనంగా.

"నాకు ముందుగా డబ్బు చెల్లించడం అలవాటులెండి!"

"అలా అయితే-ఓం ప్రథమంగా వెయ్యిరూపాయలు..."

"అంతేనా?" అని ఆమె మళ్ళీ మూతి ముడిచింది. తనచేతిలోఉన్న నల్లటి తోలు పర్స్ తెరిచి అందులోంచి పదివందరూపాయల నోట్లుతీసి నా ముందుపెట్టింది.

"ఇక వినండి. నా పేరు ఛాయాదేవి. నాకు మీ సాయంకావాలి..." అంటూ మొదలుపెట్టింది ఆమె.

• • •

ఛాయాదేవి అప్పుడప్పుడే ముప్ఫయ్యో పడిలో అడుగుపెట్టినట్లుంది. చందనం

 

రంగు,చక్కటి ఆకారం, సన్నని నడుము ఎత్తయిన వక్షస్థలం ఆమె అందాన్ని చాటిచెబుతున్నాయి. తన అందాన్ని ఎక్కువచేసి చూపించేలా గులాబీ, పచ్చ రంగులో చారలున్న చీర కట్టుకుంది ఆమె. ఆ చారలమీద ముదురు పసుపు రంగు ఆకులు అక్కడక్కడా పరుచుకుని ఉన్నాయి. ఈ కలర్ కాంబినేషన్ నాకు నచ్చకపోయినా ఆ చీరా, దాంతోపాటు ఆమె తొడుక్కున్న పసుపు రంగు జాకెట్టూ ఆమెకు బాగానే నప్పాయన్న సంగతి మాత్రం ఒప్పుకోవాలి.

ఆమె కుడిముక్కుపుటాన వజ్రం పొదిగిన ముక్కుపుడక ఉంది. కనుబొమల కింద ముక్కు మొదట రెండు గుర్తులున్నాయి. 'బహుశా ఆమె కళ్ళద్దాలు ధరిస్తూ ఉండాలి' అనుకున్నాను. కానీ, ఆ క్షణాన ఆమె కళ్ళద్దాలు వేసుకోలేదు- బహుశా నన్ను ఇంప్రెస్ చెయ్యడం కోసమేమో!

ఛాయాదేవి ఆపాదమస్తకం నగలు దిగవేసుకు వచ్చిందన్న మాట నిజమే! వజ్రాల కమ్మలు, మెరిసిపోతున్న నెక్లస్, బాగా పేనిన తాడులాగా దిట్టంగా ఉన్న ఒక గొలుసు, ఒక్కో చేతికీ ఆరేసిగాజులు, మొత్తంమీద నాలుగు ఉంగరాలు.




నేను అమీర్‌పేటలో ఒక నర్సరీ స్కూల్ నడుపుతున్నాను. బడి బాగానే నడుస్తున్నది. నేనూ, మా అన్నయ్యా కలిసి నడుపుతున్నాం"

"మీ అన్నయ్యా?"

"ఆ! స్వయానా నా అన్నయ్య..." అంటూ మొదటిసారిగా తన పలువరస కనిపించేలా నవ్వింది.

"ఛాయా! మీరు క్వాలిఫైడ్ టీచరా?"

కాదన్నట్టు తల తిప్పింది ఆమె.

"మీ అన్నయ్య?"

"ఆయనా అంతే!"

"మరి మీరు బడి నడపాలని ఎందుకు అనుకున్నారు?"

"అదో వ్యాపారం. డబ్బున్నవాళ్ళ పిల్లలకు చదువు అమ్ముతుంటాం. మా బాబాయి ఆరోజుల్లో పెద్ద టీచర్‌గా పేరు గడించాడు. ఆయన్ను చూసి మాకు బడి నడపాలన్న ఉద్దేశం కలిగింది"

"వంశపారంపర్యంగా వస్తున్న వ్యాపారమన్నమాట..."

ఛాయాదేవి మళ్ళీ నవ్వింది.

"వ్యక్తిగతమైన ప్రశ్న ఒకటి అడగాలనుకుంటున్నాను. ఏమీ అనుకోకండి. మీ ఒంటి మీది నగలన్నీ మీ బడి ద్వారా గడించినవేనా?" అని ఈసారి నేను నవ్వాను.

"ఇక్కడున్న వారందరికీ క్యూరియాసిటీ ఎక్కువ అనుకుంటాను. బడివల్ల మాకు అంత ఆదాయం రాదు. ఆ వచ్చేది మా నిత్యావసరాలకు మాత్రం పనికి వస్తుంది"

"మా అంటే...?"

"నేను, మా అన్నయ్య, ఇంకా..."

"ఇంకా?"

"ఇక్కడికి నా స్వీయచరిత్ర వివరించడానికి రాలేదు. నేనొక పెద్ద సమస్యలో

ఇరుక్కున్నాను"

"చెప్పండి"

"నా భర్త గురించి...

"మీ భర్త గురించా?"

"అవును. నా భర్తగురించే!"

"ఆయనకేమయింది?"

"ఆయన కనబడటంలేదు"

ఒక్క క్షణంపాటు నేను గుడ్లప్పగించి ఆమెను చూస్తూ ఉండిపోయాను. ఆమె తన ఎడమచేతిలోని బంగారు వన్నె కలాన్ని నోట్లో పెట్టుకుని కొరుకుతున్నది.

"కనబడటం లేదా? చెప్పండి. వివరాలన్నీ చెప్పండి"

"నా భర్త పేరు శాంతారాం. ఆయనే మా బడి మేనేజర్. నేను ప్రిన్స్‌పాల్‌ని. మా అన్నయ్య గోపాల్ అడ్మినిస్ట్రేటివ్ డైరెక్టర్. మా పదవుల పేర్లు గొప్పగా వినిపించవచ్చు. అవన్నీ మా అన్నయ్య పెట్టినవి. ఆయనకు ఇలాటివి సరదా..."

"మీ భర్త గురించి చెప్పండి" అన్నాను - నా చేతి గడియారంవైపు చూస్తూ.

"నా భర్త కనబడటం లేదు. వారం రోజులయింది. బహుశా ఏదన్నా వ్యాపార



విషయంగా వెళ్ళారేమో అనుకున్నాను"

"మీకు చెప్పకుండానే?"

"మేడమ్! ఈ దేశంలోని కొందరు మొగుళ్ల అంతే! నా భర్తా అంతే. అయితే మామూలుగా ఆయన వెళ్ళిన మూడు రోజులకల్లా తిరిగి వచ్చేవారు. ఈసారే.."

"డబ్బుగానీ, నగలుగానీ ఏమైనా తీసుకుపోయారా ఆయన?"

"లేదు లేదు. డబ్బా...అదీ మా అన్నయ్య చూసుకుంటాడు. మా ఆయన కాస్త స్వేచ్ఛాప్రియులు. ఆయనకు ఇలాం టివి తట్టవు"

"సరే! మీరు పోలీసులకెందుకు తెలియజెయ్యలేదు? నేను తప్పిపోయిన వాళ్ళను వెతికి తెచ్చి పెట్టే సంస్థ నడపడం లేదే!"

"నాకు మీగురించి అంతా తెలుసు మిసెస్‌రావ్! నేను పోలీసులకు తెలియ జెయ్యకపోవడానికి ఎన్నో కారణా లుండబట్టే మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చాను"

"నేను మీ కేసు తీసుకోవడమంటే బాగా ఖర్చవుతుంది" అన్నాను.

"ఓ! నేను ఇందాకే మీకు డబ్బు ఇచ్చే శాను కదా! ఇంకా ఇవ్వాల్సి ఉంటే తర్వాత ఇస్తాను!"

"తర్వాత అంటే?"

"ఈ మాటల గారడీ అపుతారా కాసేపు. నాకు మీ సాయం కావాలి"

"ఒక్క క్షణం ఆగండి. మీరే మంటున్నారో నాకు తెలియడంలేదు" అన్నాను.

"ఆయన అలవాటు ప్రకారం రెండు రోజులు గడిచినా తిరిగి రాకపోయేసరికి నాకు ఏం చెయ్యాలో తోచలేదు. ఆందో ళన పడి ఆయన కోసం వాకబు చెయ్యడం మొదటపెట్టాను. మా బడిలో పనిచేస్తున్న టీచర్ ఒకామె నాకో క్లూ ఇచ్చింది"

"ఏమిటది?"

"ఆ టీచరు పేరు సారా!నా భర్త మరొక స్త్రీతో కలిసి రైల్వేస్టేషన్‌కి వెడుతుండగా ఆమె చూసిందట. అయితే ఆ స్త్రీ ఎవరో తనకు తెలియదని చెప్పింది..."

"అలాగా"

"నేను దిగ్భ్రాంతి చెందాను. ఏం చెయ్యాలో...ఏం చెప్పాలో నాకు పాలు పోలేదు. ఇంతలో మా అన్నయ్య ఆందో ళనకొద్దీ పిచ్చిగా అక్కడా ఇక్కడా వెతకడం ప్రారంభించాడు. ఫలితం సున్న. ఇన్నేళ్ళ తర్వాత నా భర్త మరొక ఆడ దానితో కలిసి వెళ్ళారన్న విషయాన్ని నేను నమ్మలేకుండా ఉన్నాను..." అంటూ ఆమె పెద్దగా నిట్టూర్చి మళ్ళీ కలం నోట్లో పెట్టుకుని కొరకడం ప్రారంభించింది.

"నాకేం అంతు చిక్కడం లేదు. ఇందులో నేనేం చెయ్యాలో తెలియడమూ లేదు. నేను ఇంద్రజాలం చెయ్యలేను. నా పని కోర్టులో వాదించడం! మీరు పోలీసు లకు రిపోర్ట్ చెయ్యడం మంచిదని నా సలహా"

"మిసెస్ రావ్! నాకు ఇలాంటి సల హాలు అక్కరలేదు. నాకు కావలసింది మీ 'ప్రొఫెషనల్' సలహా" అంది.

నేను గుడ్లప్పగించి ఆమెను చూడడం, ఆమె కలం నోట పెట్టుకుని కొరకడం- మామూలు ప్రకారం మరి కొంతసేపు కొనసాగింది.

"ఇంతకూ మీ భర్త ఎలా ఉంటారు? ఆయన ఫొటో ఏదన్నా ఉందా?" అని అడిగాను.

ఆమె ఉందన్నట్టు తల ఆడించి





పర్సులోంచి పాస్‌పోర్ట్ సైజ్ ఫొటో ఒకటి తీసి ఇచ్చింది.

కాసేపు ఆ ఫొటోను తదేకంగా చూశాను. ఫొటోలో మనిషి చూడ్డానికి బాగానే ఉన్నాడు. కాకపోతే కొంచెం మిట్టపళ్లు. కనుబొమలు గుబురుగా ఉన్నాయి. జుట్టు మధ్యపాపిడి తీసి వెనక్కు దువ్వుకున్నాడు.

"ఈ ఫొటో ఎప్పుడు తీశారు?"

"మూడేళ్ళ క్రితం ఆయన సింగపూర్ వెళ్లినప్పుడు. ఇప్పుడు ఆయనకు జుట్టు బాగా రాలిపోయి దాదాపు బట్టతల వచ్చింది"

"అలా అయితే ఈ ఫొటోవల్ల పెద్దగా ఉపయోగమేమీ ఉండదు. అయినా నా దగ్గర ఉంచుకుంటాను" అని దాన్ని ఒక ఫైలు మీద ఉంచాను. "ఇక ఇప్పుడు చెయ్యగలిగిందేమీ కనిపించడం లేదు నాకు. యథాలాపంగా వచ్చినట్టు వచ్చి మీ స్కూల్‌ను చూసి వస్తాను. మీ కార్డుంటే కార్డు గానీ లేకుంటే అడ్రెస్ గానీ ఇచ్చిపొండి. మీరిచ్చిన చెక్కుకు రసీదు మావాళ్లు తర్వాత పంపిస్తారు" అన్నాను.

రెండు రంగుల్లో అందంగా అచ్చువేసిన కార్డు తీసి నా ముందుంచిన నోట్లమీద ఉంచింది ఆమె.

"మీరెప్పుడొస్తారు?" అనడిగింది.

"ఎప్పుడయినా వస్తాను. అలా రావడమే మనకు మంచిది"

"అంటే - బహుశా బడిలో పని చేస్తున్నవాళ్ళెవరికయినా తెలిసి ఉంటుందనా మీ ఉద్దేశం?"

"అబ్బే! అదేం కాదు. నాకు ఇప్పటిదాకా ఏమీ అంతు చిక్కలేదు. మీ బడికి రావడం కూడా ఏదన్నా చేసి నా ఫీస్ గడించడం కోసం...సరేనా? మీరు వెళ్లేముందు మీ ఒంటి మీది ఆ బంగారం గురించి..."

"మీ క్యూరియాసిటీ ఇంకా తగ్గలేదన్న మాట! అయితే వినండి. ఈ నగలన్నీ నాకు మా అమ్మ ఇచ్చినవి. అంటే వంశపారంపర్యంగా వచ్చినవన్న మాట! ఇక మీరు సంతృప్తి చెందినట్టేనా?" అంది ఆమె. ఆ మాట అంటూ - లేచి నిలబడి, చిరునవ్వు నవ్వి తల ఒకమారు ఎగరవేసి నా గదిలోంచి బయటకు నడిచింది.

ఆమె అటు కదలగానే నేను కుడి కాలి బొటనవేలితో టేప్‌రికార్డర్ స్విచ్ నొక్కి ఆఫ్ చేశాను. ఇంటర్‌కమ్ రిసీవర్ తీసుకుని నా పార్ట్‌నర్ కనెక్షన్ నొక్కి ఆమెకు కాస్త తెరిపి దొరకగానే నా గదికి రమ్మన్నాను. ఆ తర్వాత కుర్చీలో వెనక్కు వాలి ఛాయాదేవి గురించీ, ఆమె బడి గురించీ, ఆమె అన్నయ్య గురించీ, తప్పిపోయిన ఆమె భర్త గురించీ-అన్నిటి కన్నా ముఖ్యంగా ఆమె బంగారం గురించీ ఆలోచించడం ప్రారంభించాను.

పది నిమిషాలు గడిచాక నిరూప గదిలోకి వచ్చి గోడవారగా ఉన్న సోఫాలో కూచుంది. నా గదిలో ఆమెకు నచ్చిన ఆసనం అదే. నా టేబుల్ ముందు కూచోవడం ఆమెకు గిట్టదు. నిరూప నాలాగా భారీ మనిషి కాదు. బక్కపలుచగా, కొంచెం చామనఛాయగా ఉంటుంది. అందంగా, పొందికగా ఉండే తన పెదవులకు ఆమె ముదురు ఎరుపు రంగు లిప్‌స్టిక్ వేసుకోవడం మాత్రం బాగుండదేమో కాని ఎందువల్లో ఆమెకు ఆ రంగు వేసుకోవడం ఇష్టం. అందువల్ల తనకు చాలా లాభించిందని ఆమె నమ్మకం!

ఆమె లేత నీలిరంగు చీర, తెలుపు -

నీలం కలగలిసిన జాకెట్టు తొడుక్కుంది.

ఛాయాదేవి గురించి నా అభిప్రాయాలు క్లుప్తంగా చెప్పి, టేప్ వినిపించాను ఆమెకు. నిరూప నాకన్నా ఒక పిసరు ఎక్కువగానే గందరగోళంలో పడిపోయింది.

"తలా లేదు! తోకా లేదు! వెధవ గొడవ" అన్నది నిరూప. మాటకారితనం ఆమెగురించి చెప్పుకోవలసిన విశేషాలలో ఒకటి. అడపాదడపా ఆమె మాటలు సున్నితమైన చెవులను బాధిస్తూ ఉంటాయి!

"మరీ వెధవ గొడవ నిరూపా"!

"ఆ సారా అనే ఆవిడకు ఈమెకు చెప్పిందానికన్నా ఎక్కువే తెలిసుంటుంది. ఆ సారాతో మాటాడితే ఏదన్నా ప్రయోజనం ఉంటుందేమో!''

"సరే! ఆ నర్సరీకి ఫోన్‌చేసి, సారా అడ్రెస్ కనుక్కో! నువ్వు ఆమె పాత

స్నేహితురాలని చెప్పు. కావాలంటే నువ్వు మీఅత్తయ్య ఆమెను చూడాల్సి ఉందని చెప్పు. ఏదో కథ కల్పించు..."

"కర్మకాలి ఆమే మాట్లాడితే?"

"లైన్ కట్ చేసి మరో ఎత్తు ఆలోచించు"

నిరూప గదిలోంచి వెళ్ళి అయిదు నిమిషాల్లో తిరిగి వచ్చింది. సోఫాలో కూచుని నా వైపు ఒక నవ్వు విసిరింది. కుడిచేయి పిడికిలి బిగించి, బొటనవేలు ఎత్తిపట్టి నిటారుగా కూచుని—తాను సాధించానన్నట్టు చూసింది.

"పట్టేశాను ఫోన్‌లో. ఎవడో కీచు గొంతువాడు దొరికాడు. నేను ఆ అమ్మడి తల్లికి స్నేహితురాల్నని చెప్పాను. వెంటనే నమ్మేశాడు. అబద్ధమాడినా సరే—ఆడవాళ్లు తమతో మాట్లాడుతున్నారన్న సంతోషంతో నమ్మేస్తుంటారు కొందరు పురుషపుంగవులు!"

"నువ్వుచెబితేతప్ప నాకు తెలియవులే ఇలాంటి విషయాలు"

"ఓకే! ఆమె అడ్రస్-83 సౌత్ క్రాస్ రోడ్, రాజానగర్. రాజానగర్ బొలారం రైల్వేస్టేషన్‌నుంచి ఒక మైలుంటుంచట.."

నేను మెచ్చుకోలుగా నవ్వి మా ఇద్దరికీ కాఫీ కోసమని బెల్లు నొక్కాను. నాకు కాఫీ అంటే చాలా ఇష్టం. రోజుకు కనీసం పది కప్పుల కాఫీ తాగుతాను. కాఫీ గుండెకు మంచిదికాదట. మరి కాఫీ లేందే నా గుండె పనిచెయ్యనంటుంది అప్పుడప్పుడూ!

* * *

రాజానగర్‌లోని సౌత్ క్రాస్ రోడ్ చేరాను. ఈ పది – పదిహేనేళ్ల కాలంలో నగరం చుట్టూ అస్తవ్యస్తంగా మొలకెత్తిన ఇళ్ళకు తగిన ప్రతినిధులుగానే కనిపించాయి. అక్కడి ఇళ్లు చిన్నవిగా ఉండి, చుట్టూ కంచెగానీ, ప్రహరీ గోడగానీ లేకుండా బోసిగా నిలుచుని ఉన్నాయి. ఏనభైమూడోనంబరుది కూడా అటువంటి ఇల్లే! రోడ్డు చివరగా ఉంది అది. ఆ ఇంటికి అవతల రాతి మిట్టలు, ఆ మిట్టల వెంబడి కాస్త వెనగ్గా చిన్న గుట్టలు కనిపించాయి. నేను నా కారు దూరంగా ఆపి, సూర్యుడు అస్తమించేదాకా ఆగాను.

ఇలాంటి చోట్ల ఉండే ఇళ్లాళ్లు చిన్న అలికిడి అయినా ఉత్సాహం చంపుకోలేక వాకిట్లోకి వచ్చి అదేపనిగా చూస్తూ ఉంటారు. నేను కారులో వెడితే ఈ బెడద మరీ ఎక్కువ! పైగా నేను వెడితే మగవాళ్లు కూడా చూస్తారాయె!

పిల్లిలాగా వెళ్లి 83వ నెంబరు ఇంటి తలుపు నెమ్మదిగా తట్టాను. అప్పటికే బాగా చీకటిపడింది. వీధి దీపాలు కూడా చెదురుమదురుగా అక్కడొకటీ ఇక్కడొకటీ వెలుగుతున్నాయి. కాసేపు చూసి ఈమారు కొంచెం గట్టిగా తలుపు తట్టాను. కొద్దినిమిషాల తర్వాత ఇంటి లోపల నీరసంగా ఒక లైటు వెలిగింది. ఇంటి ముందున్న వసారాలో నిలబడిన నాకు అక్కడి కిటికీలోంచి లోపలున్న కుర్చీలు, స్టీల్ కప్‌బోర్డ్, ఒక మూల బల్ల మీద ఇస్త్రీ చెయ్యడానికి ఉంచిన ఆడవాళ్ల బట్టలు కొన్నీ కలగాపులగంగా కనిపించాయి.

తలుపు తెరుచుకుని బయటకు వచ్చిన ఆ యువతి నన్ను పరీక్షగా చూస్తూ నిలబడింది.

"సారా అంటే మీరేగదా?"

ఆమె తలపంకించింది.

ఆమె కారునలుపు. బొట్టు పెట్టుకోలేదు; పువ్వులు ముడవనూ లేదు. ఇంట్లో ఉన్న





ప్పుడు మాత్రం కట్టుకొనేందుకు పనికి వచ్చే చౌక రకం నూలుచీర కట్టుకుని, తెల్ల రవిక తొడుక్కుని ఉంది. కానీ ఒకసారి ఆమెను చూస్తే మళ్లీ చూడాలనిపిస్తుంది. కొట్టవచ్చేటట్లుంది ఆమె అందం. సన్నని నడుముమీదికి పడుతున్న నాగుపాము లాంటి ఆమె జడను నేను కాసేపు అలాగే చూస్తూ ఉండిపోయాను!

"గుడ్ ఈవెనింగ్! నేను లాయర్ని. నా మేనకోడలికి పాఠాలు చెప్పడానికి పంతులమ్మ కావాలి. నా ఫ్రెండ్ ఒకామె మీ గురించి చెప్పారు..."

"అలాగా! రండి. లోపలికి రండి. ఇలా కూచోండి. ప్లీజ్... మీ పేరేమిటో చెప్ప లేదు!" అదనంగా నాలుగుడబ్బులు చేసు కోవచ్చునన్న ఆనందంతో కాబోలు సారా చిరునవ్వు నవ్వింది.

"మిసెస్ రావ్"

"మీరు నన్ను వెతుక్కుంటూ వచ్చి నందుకు థాంక్స్! మీ మేనకోడలు ఏ క్లాసు చదువుతున్నది?"

"మూడో తరగతి. అది తెలివయిందే! కాని కాస్త సోమరి. అది పాఠాలు బాగా చదవాలంటే దానికి మీ వంటి మంచి టీచర్ అవసరమనిపించింది. ఇంతకీ మీరేదన్నా బడిలో పనిచేస్తున్నారా? లేక ఫ్రీగానే ఉన్నారా?" అన్నాను చుట్టూ పరిశీలనగా చూస్తూ.

సారా నాకు ఛాయాదేవి బడి గురించి చెప్పింది.

"ఓహో అక్కడా? అదేదో 'పాష్' బడి అనుకుంటానే! మా ఫ్రెండ్ చెబితే విన్నాను. ఆ తర్వాత దాన్ని నడిపే అతన్ని కలుసుకున్నాను"

"అతనా...? మీరు విన్నది సరికాదు"

"అదేమిటండీ!"

"చెబుతాను. ఈలోగా మీకు తాగడానికి ఏదన్నా తీసుకొస్తాను"

"అంత శ్రమ వద్దిపుడు"

"పర్వాలేదండీ! అంతదూరంనుంచి వచ్చారుగదా! మీరేదన్నా తీసుకోవాలి. అదీకాక మా ఇంటికి మీరు రావడం ఇదే మొదటిసారి!" అని ఆమె ఆ పక్కనున్న గదిలోకి వెళ్లిపోయింది. నా పరిసరాలను పరీక్షగా చూశాను. ఆ ఇంట్లో పురుషు లున్న గుర్తులేవీ కనిపించలేదు. మగవాళ్లు తొడుక్కునే బట్టలుగానీ, బూట్లుగానీ ఆఖరికి కాల్చిపారేసిన సిగరెట్టు పీకలుగానీ కనిపించనేలేదు.

సారా ఒక గ్లాసులో నారింజరంగు ద్రవమేదో పట్టుకుని వచ్చింది. ఆమె నాకు గ్లాసు అందిస్తుండగా ఆమెను మళ్లీ చూశాను.ఆమె ఒంటి బింకాలూ, పొంకాలూ నాకు అసూయ కలిగించిన మాట నిజం.

"మరి మీరు ఎప్పటినుండి ట్యూషన్ ప్రారంభించగలరు? రేపు ఫస్టునుంచి..." అన్నాను. ఫస్టుకు మరో పదిరోజులున్న దన్న విషయం మరిచిపోకుండా.

"అలాగే మేడమ్! థాంక్స్!" అన్నది ఆమె.

"నెలకు వందరూపాయలిద్దామను కుంటున్నాను. సరిపోతుందా?"

"థాంక్యూ మేడమ్ థాంక్యూ!" సారా ఆనందంతో పొంగిపోతూ చెప్పింది.

"నేను వచ్చేవారం ఇటు వచ్చి మిమ్మల్ని ఇంటికి తీసుకువెళతాను..."

"థాంక్ యూ"

"అన్నట్టు మీ బడి నడుపుతున్నతని పేరు శాంతారాం గదూ" అన్నాను.

"కాదండీ! అతను మా బడి నడపడం లేదు" అంది సారా.

"అతని భార్య పేరు... అదేదో దేవి

గదూ! నాకు సరిగా గుర్తు రావడం లేదిప్పుడు"

"ఛాయాదేవి"

"అలాంటిదే ఏదో అనుకుంటాను ఆ పేరు."

"మా బడిని ఛాయాదేవి నడుపు తున్నది. ఆ నీచురాలికి మొగుడంటూ



ఎవడూ లేడు. శాంతారాం ఎవరికీ మొగుడు కాడు – ముఖ్యంగా ఆ పాపిష్ఠిదాని మొగుడు అసలే కాదు" అన్నది సారా.

• • •

ఆ ఉదయం అందంగా ఉన్నట్టు అనిపించింది. నిద్ర లేవగానే ఆ అందాన్ని ఆస్వాదిస్తూ పక్కమీదే కూచుని టీ తాగాను. అప్పుడే వచ్చిన రెండు దిన పత్రికలను తిరగేశాను. నేను అదేపనిగా చదువుతుంటానని చెప్పినా అతిశయోక్తి లేదు. మనదేశంలో వెలువడే ప్రధాన పత్రికలూ, అవికాక కొన్ని విదేశ పత్రికలూ, పుస్తకాలూ కొనడం, చదవడం నా



హాబీ: నేరాల విచారణకు సంబంధించిన పుస్తకాలూ, గగుర్పొడిచే నవలలూ చదవడం నాకు చాలా ఇష్టం.

తిలకానికి పక్కమీదికే బ్రేక్‌ఫాస్ట్ అందించమని చెప్పాను. తిలకం నాకు ఇష్టసఖి...పనిమనిషి...వంటలక్క అన్నీ. ఆమెను ముద్దుగా తిల్లీ అని పిలుస్తుంటాను నేను. ఉల్లిపాయలు వేసిన రవకిచడీ దానికి తోడుగా కొబ్బరిచట్నీ, ఆవకాయ, చీస్‌ముక్కలు పట్టుకొచ్చింది తిల్లీ. నేతితో చేసి వెండి పళ్ళెంలో పట్టుకొచ్చిన ఆ కిచడీ ఎంతో బాగుంది. నాకెందుకో వెండి ప్రాతలు వాడడమంటే సరదా.

కిచడీ తింటూ నేను ఛాయాదేవి గురించీ, సారా గురించీ ఆలోచించసాగాను. 'ఛాయాదేవి అతను తన భర్త అంటూ అబద్ధమెందుకు చెప్పింది? మరైతే శాంతారాం ఆమె స్నేహితుడా? అతను ఎందుకు పారిపోయాడు? ఈ ముగ్గులోకి సారా ఎలా వచ్చింది? ఎన్ని ప్రశ్నలో ... ఒక్క జవాబూ తట్టలేదు నాకు.

ఇంతలో నేను తలంటుపోసుకోవడానికి నూనె కాచి పెట్టినట్టు చెప్పింది తిల్లీ. మంచం దిగి నైట్‌డ్రెస్ విప్పుకుంటూ వార్డ్‌రోబ్‌కు అమర్చిన నిలువుటద్దంలోకి చూశాను. నా ప్రతిబింబాన్ని చూసి నాలో సన్నటి గర్వమేదో కలిగింది. వయసు ఇంకా నా మీద తన ప్రభావం చూపడం లేదని ఒక్క పిసరు ఆనందమూ కలిగింది.

అరగంటలో నేను తలంటుకుని స్నానం చేసి, ఒళ్ళు తుడుచుకుని, జుట్టు ఆర్చుకుని, ముడివేసుకుని, అలంకరించుకుని ఒంటికి ఫెర్‌ఫ్యూమ్ చల్లుకుని,బట్టలు తొడుక్కొని సిద్ధమయ్యాను. లేతపచ్చరంగు పంట్లాం, నేత చొక్కా వేసుకొన్నాను. అవి నా చర్మపు రెండో పొరల్లా ఒంటిని అంటుకుని ఉన్నాయి.

రెండు పడకగదులతో అన్ని సౌకర్యాలూ, హంగులూ ఉన్న ఈ నా ఇంటిలో ప్రతి ఇటుకా నేను శ్రమపడి సమకూర్చుకున్నదే!

స్టడీరూమ్‌లో మంచం మీద కాళ్లు చాచుకు కూచుని, ఛాయాదేవి గురించి ఆలోచించసాగాను. నా క్లయంట్ నన్ను మోసగించడం అన్నది సంతోషం కలిగించే విషయం కాదుకదా! ఆఫీసుకు రావడం లేదనీ, కొత్త క్లయంట్ గురించి చెయ్యవలసిన పనులు చాలా ఉన్నాయనీ గ్లోరియాకు ఫోన్ చేసి చెప్పాను. 'నిరూప వచ్చిందా' అని అడిగితే రాలేదన్నది గ్లో. మామూలుగా అయితే నిరూప ఎనిమిదిన్నరకు ఆఫీసుకు వచ్చేస్తుంది.




పదకొండు గంటల ప్రాంతంలో పట్టు చీర, జాకెట్టు ధరించి జుట్టును ఒక ముడి వేసి బిగించి కారులో బయలుదేరాను. డబ్బున్న ఇల్లాళ్ళు ఎలా కనిపిస్తారో అలా కనిపించేలా అలంకరించుకున్నాను. దారిలో నా ఆలోచనలు రకరకాలుగా ముగ్గులు వేశాయి. నా క్లయంట్స్, నా కేసులు, నా స్నేహితులు, నాకు ఇష్టమైన సినిమాలు, నా మంచిరోజులు, నా భర్తతో గడిపిన గడ్డు రోజులు–ఇలా ఎన్నెన్నో

ఆలోచనల అలలు నాలో చెలరేగాయి. చివరగా ఛాయాదేవి, ఆమె తన భర్తగా చెప్పుకునే మాయమైన శాంతారాం, ఆమె నగలు...నా ఆలోచనల్లో ముసురుతూ ఉండగా అమీర్‌పేట చేరుకున్నాను.

దేవీ విద్యాలయం ఆవరణ బాగా పెద్దదే. ఆ ఆవరణలో నాలుగు కాటేజీలు ఉన్నాయి. మధ్య ఉన్న కట్టడంలో ఆఫీసు, టీచర్ల గదులు ఉన్నాయి. మొత్తం మీద డబ్బు తెచ్చిపెట్టిన హంగులు ఆ ఆవరణలోని ప్రతి అంగుళానా కనిపించింది. ఆ బడికి ఆదాయం బాగా ఉండడంలో ఆశ్చర్యం లేదనిపించింది.

అందమైన ఒక వేప చెట్టు కింద కారు ఆపి ఆఫీసు వైపు నడిచాను. శనివారం కావడంతో క్లాసులు ఖాళీగా ఉన్నాయి. గాలి చెట్లకొమ్మల్లోంచి దూసుకుపోతూ అల్లరిగా శబ్దాలు చేస్తున్నది. అంతకుమించి అక్కడ మరేచప్పుడూ వినబడడం లేదు.

ఛాయాదేవిగానీ, ఆమె అన్నయ్యగానీ స్కూల్లో లేరని తెలిసింది! సారా కూడా లేదు. అయినా ఆమెను ఇప్పుడప్పుడే కలుసుకోవడం నాకూ ఇష్టంలేదు. ఆఫీసులో లోతుగా ఉన్న కళ్ళ మీద లావుపాటి అద్దాల కళ్ళజోడు ధరించిన ఓ ముసలాయన దగ్గరకి వెళ్లాను. ఆయనకు అల్లిబిల్లిగా పెరిగిన గడ్డం కూడా ఉంది.

"నా పేరు గోవర్ధనం. మీకేం కావాలండీ? మా చీఫ్‌లేరు" అన్నాడు అతను — నాకో స్టీలు కుర్చీ చూపి కూచోమంటూ.

నేను కూచుని ఆయనను నెమ్మదిగా సంభాషణలోకి దించాను. నేను శాంతారాం స్నేహితురాలినని చెప్పాను. ఆ మాట విని ఆయన నన్ను చూసి ఒకరకంగా నవ్వి మరేమీ అడక్కుండా ఆ విషయాన్ని అంతటితో వదిలిపెట్టేశాడు.

అంతలో పక్క బల్లమీద ఉన్న ఫోన్ మోగింది. ముసలాయన లేచి వెళ్ళి ఫోన్ అందుకున్నాడు. నేను ఎటోచూస్తున్నట్టు అభినయిస్తూ ఆ ఫోన్‌లో ముసలాయన చెబుతున్న విషయాల మీద ఒక చెవివేసి ఉంచాను. అవతలవేపునుంచి మాటాడుతున్న వారెవరో అంతుచిక్కలేదు. గోవర్ధనం తల ఆడిస్తూ 'ఎస్ సార్' 'అలాగే సార్' అని పదేపదే గొణుగుతున్నాడు.

"శాంతారాం కోసం ఎవరో అమ్మగారు వచ్చారండీ! ఆయనగారి స్నేహితులట! పేరు తెలియదండీ! లేదండీ...నేను అడగలేదు. సారీ సార్!... సరే సార్... ఆమెకు నేను చెబుతాను సార్!" అని ఫోన్ పెట్టేశాడు. పెట్టేశాక ఆయన ముఖంలో ఆనందరేఖ లీలగా కనిపించింది.

"మేడమ్! శాంతారాంగారు వారం రోజులు సెలవు పెట్టారట. ఇప్పుడే తెలిసింది. ఏదయినా కబురుంటే చెప్పండి. మీ పేరు, అడ్రెసు రాసిచ్చి పొండి" అని తన కుర్చీలో కూలబడ్డాడు.

"అంత ముఖ్యమైన విషయమేం కాదు. నేను ఆ తర్వాత వస్తా" అని నెమ్మదిగా లేచి కారు వైపు నడవసాగాను.

నేను రాగానే సమస్కారం చేసిన ఖాకీ బట్టలు తొడుక్కున్న ముసలి బంట్రోతు మళ్ళీ కాళ్ళీడ్చుకుంటూ నా వైపు వచ్చాడు. 'బహుశా చిల్లర డబ్బుల కోసమేమో' అనుకున్నాను.

అతను కారులోకి చూస్తూ 'సలాం అమ్మగారూ' అన్నాడు. నేను కార్లో కూచుని, కిటికీ అద్దాలు కిందికి దించి

పర్స్‌లోంచి పది రూపాయల నోటు ఒకటి తీసి వేళ్ల మధ్య పట్టుకున్నాను.

అతని కళ్ళు ఒక్కసారిగా విప్పారాయి.

"ఇలా చూడు! నేను నా స్నేహితుడి




కోసం వచ్చాను. అతను ఇక్కడ లేడట"

"ఎవరండీ అమ్మగారూ?" అన్నాడు అతను రహస్యంగా నా చేతిలోని నోటును తదేకంగా చూస్తూ.

"శాంతారాం"

"ఆయన ఇంట్లో ఉండచ్చునమ్మా!

ఆయన మాటిమాటికీ సెలవు పెడ్తూ ఉంటాడు''

"అతను ఎక్కడుంటాడో తెలుసా నీకు?"

"తెలుసండమ్మా" అన్నాడు అతను.

"తెలిస్తే నాకు చెప్పు. వీలుంటే నేను అతణ్ని అక్కడ కలుసుకుంటాను"

"అమ్మగారూ! నేను ఆ వివరాలు చెప్పకూడదు. మరి నేనూ ఎవరికీ చెప్ప లేదు. మా మేనేజర్‌గారికి స్నేహితుల మని చెబుతున్నారు గనుకా, పెద్దమను షులుగా కనిపిస్తున్నారు కాబట్టి..."

"మంచిది...మరి అతను..."

"అమ్మగారూ! మీకు సూర్యా సినిమా హాల్ తెలుసా?"

"ఎక్కడ?"

"అశోక్‌నగర్‌లో"

నేను తెలుసన్నట్టు తల ఊగించాను.

"అక్కడినుంచి పడమరగా వెడితే సూర్యా కనిపిస్తుంది.

దానికి ఎదురుగా ఒక సన్న బాట కని పిస్తుంది. ఆ బాటలోకి తిరిగి కొంచెం దిగువగా వెళ్ళి పుష్పనగర్ ఎక్కడో అడి గితే ఎవరయినా చెబుతారు. అక్కడే ఆయన ఉన్నాడు. ప్లాట్ నెంబరు 899. కొత్త ఇల్లు" అన్నాడు.

'ముసలాడు తెలివయినవాడే' అనుకుని అతను జీవితంలో ఇంతకన్నా ఎదగ నందుకు ఒకక్షణం విచారించాను.

అతను అందజేసిన సమాచారానికి తగ్గట్టు పదిరూపాయల కాగితం అతనికి యిచ్చేసి అతను అందజేస్తున్న దీవెనలు పూర్తిగా వినకుండానే కారు స్టార్ట్‌చేసి పుష్పనగర్‌వైపు ప్రయాణం సాగించాను.

దారిలో ఒక ఏర్‌కండిషన్డ్ హోటల్‌కు వెళ్ళి ఆ చల్లని వాతావరణంలో కూచుని ఛాయాదేవి గురించి నా ఊహలనూ, ఉద్దే, శాలనూ తీరిగ్గా అంచనా వేసుకున్నాను. చల్లని కాఫీకి ఆర్డరిచ్చాను. కాఫీమీద ఐస్‌క్రీమ్ తేలుతూ ఉంటే-అలాంటి చల్లని కాఫీ తాగడం నాకెంతో ఇష్టం. లావెక్కు తాననే భయంలేదని ముందే చెప్పానుకదా!

శాంతారాం ఛాయాదేవి భర్త కాక పోవచ్చు. సారా చెప్పిందీ అదే! గోవర్ధనం ధోరణినిబట్టి, బడి బంట్రోతు చెప్పిన దాన్నిబట్టి సారా చెప్పిందే నిజంకావచ్చు. అతను బడి యజమానురాలి భర్తే అయితే బడిలో పనిచేస్తున్నవాళ్ళు అతను ఒక వారం సెలవులో ఉన్నారని చెప్పరు. ఛాయాదేవీ, ఆమె బడిలో పనిచేస్తున్న వాళ్ళందరూ కలిసి కూడబలుక్కుని అబద్ధాలు చెబితే తప్ప అది సాధ్యంకాదు. అలా చెప్పవలసిన అవసరమూ కనిపించ లేదు. నాకు ఏమీ తోచలేదు. ఛాయాదేవి తన లాయరునయిన నాకు అబద్ధం ఎందుకు చెప్పినట్టు? ఆమె అబద్ధం చెప్ప డానికి బలమైన కారణం ఏదయినా ఉండి ఉండాలి. అదేమిటి?

స్పూనుతో చిల్డ్ కాఫీ రుచిచూస్తూ ఉన్నా నా ఆలోచనలు నన్ను వదిలిపెట్ట లేదు. కాఫీ బాగానే ఉంది. నేను కుర్చీలో వెనక్కువాలి కాఫీగ్లాసు చేతిలోకి తీసు కున్నాను. అలా చెయ్యడం టేబుల్ మేనర్స్ పాటించకపోవడమని పాతకాలం వాళ్ళు ఎవరయినా అనుకోవచ్చు. నాకేం?

ఛాయాదేవి ప్రస్తుతం నా క్లయంట్. ఆమెనుంచి వెయ్యిరూపాయలు తీసుకో వడంవల్ల చట్టప్రకారం ఆమెకోసం నేను పని చెయ్యవలసి ఉంది. ఇప్పటిదాకా ఆమె నన్ను చెయ్యమని కోరింది చట్టానికి విరుద్ధమైనదేమీకాదు. అందువల్ల ఆమె కోరిక పాటించడం నా కర్తవ్యం. ఆమె

ఇచ్చిన డబ్బు పువ్వుల్లోపెట్టి ఆమెకు ఇచ్చి వచ్చినదారినే దయచెయ్యమని చెప్పి ఉండవచ్చు. కాని నేను అలా చెయ్యలేదు. కనుక నేను ఆమె అప్పజెప్పిన కేస్‌గురించి దర్యాప్తు చెయ్యాలి. కేసు? మాయమై పోయిన మనిషిని వెతకడం అంటే ఆమె తన భర్తగా చెప్పుకున్న వాణ్ని వెతకడం.

శాంతారాం గురించి, ఆమె చెప్పిన అబద్ధం గురించి తలుచుకున్నప్పుడల్లా ఒళ్లు మండిపోతున్నది నాకు. ఇప్పటికి మాత్రం అతణ్ని వెతికి పట్టుకుని ఏమవు తుందో చూడాలనుకున్నాను. ఛాయాదేవి మాటలవెనక మర్మం ఏమిటో తెలుసు కోవాలన్న తపన నాలో మొదలయింది.

బిల్లు చెల్లించి మంచి టిప్ ఇచ్చి హోట ల్లోంచి బయటపడ్డాను. హోటల్‌పక్క నున్న పుస్తకాల షాపులోకివెళ్ళి స్త్రీల పత్రికలు కొన్ని, తక్కువ పత్రికలు కొన్ని, సినిమా పత్రికలు కొన్ని, ఒక కథల పత్రిక కొనుక్కుని వాటిని కారు వెనకసీట్లో పడవేసి స్టీరింగ్ వీల్‌ముందు కూచున్నాను. పుష్పనగర్ వెళ్ళడానికి ఛాయాదేవి బడి బంట్రోతు చెప్పిన దారి ఒకసారి గుర్తుచేసుకున్నాను.

ఆ గుర్తుల ప్రకారం సులభంగానే పుష్పనగర్ చేరుకున్నాను. ఆ ప్రాంతంలో ఇళ్లు చెదురుమదురుగా ఉన్నాయి. చాలా ప్లాట్లు ఖాళీగానే ఉన్నాయి. కొన్ని పునాదుల మట్టంలోనే నిలిచి ఉన్నాయి. మొక్కలూ, పొదలూ ఆ స్థలాల్లో అల్లి బిల్లిగా అల్లుకుని ఉన్నాయి. మామూలు ప్రకారం కారును ఫర్లాంగు దూరంలో ఆపి 899 నెంబరు ప్లాటును వెతుక్కుంటూ బయలుదేరాను. మిట్టమధ్యాహ్నం కావ డంతో రోడ్డుమీద జన సంచారం అంతగా లేదు.

ఆ ఇల్లు-రెండతస్తులమేడ. కొత్తదే. అలంకరణలతో నిండిన ఆ యింటి గేటు నేను తోయగానే చప్పుడు చెయ్యకుండా తెరుచుకుంది.

నేను వసారాలో నిలబడి అటూ ఇటూ చూశాను. వసారాలో మూడు పేము కుర్చీలు ఉన్నాయి. మధ్యఉన్న టీపాయ్ మీద కాఫీ,టీ వగైరాల మరకలెన్నో కని పించాయి. వసారాలోకి ఉన్న కిటికీ రెక్కలు మూసిఉన్నాయి. నేను కాలింగ్ బెల్ దగ్గరికివెళ్ళి నొక్కాను. ఏమీకాలేదు. వాకిటి తలుపు తట్టిచూశాను. తలుపు లోపలివైపున గడియపెట్టిఉంది. అంటే శాంతారాం ఇంట్లోనే ఉండి ఉండాలి. మళ్ళీ తలుపు తట్టినా నిశ్శబ్దమే బదులుపలికింది.

నేను ఇంటి వెనుకవైపునకు వెళ్ళాను. దొడ్డివాకిలి కనిపించింది. కొన్ని గజాల అవతల బావి కనిపించింది. బావి ముందు కొంతమేర తడిసిఉంది. శాంతారాంగానీ, మరెవరోగానీ అక్కడ కాసేపుముందు కాళ్ళు కడుక్కోవడమో మరేదో చేసి వుండాలి. తడిసిన మేర చుట్టుపక్కల బురదతో నిండిన కాలిగుర్తులు కనిపిం చాయి.

దొడ్డివాకిలి తలుపు నెట్టగానే తెరుచు కుంది. లోపలికివెళ్ళి డైనింగ్‌హాల్లోకి జొర బడ్డాను. అక్కడ బల్లమీద మూడు కప్పులు, సాసర్లు, కాస్తకాఫీ కనిపించాయి. ఒక కప్పుమీద లిప్‌స్టిక్‌మరక..నిరూప ఉప యోగించే రంగు లిప్‌స్టిక్ మరక కనిపిం చింది.

నేను శాంతారాం పేరుపెట్టి పిలుస్తూ నిలబడ్డాను. జవాబు రాలేదు. నెమ్మదిగా ఇంట్లోకివెళ్ళి మేడ మెట్లెక్కి విశాలంగా ఉన్న ఒక గదిలోకి ప్రవేశించాను. ఆ గది గందరగోళంగా ఉంది. బల్లల సొరుగులు, కప్‌బోర్డులు...అన్నీ చిందరవందరగాలాగి

పడేసివున్నాయి. సోఫాలు తలకిందులుగా పడివున్నాయి. సోఫామీది కేలికో కవర్లు ఊడబెరికి స్ప్రింగులూ అవీ బయటికిలాగినట్టు కనిపించింది. ఆ గది తుఫాను దెబ్బ తిన్నట్టుంది! ఎవరో ఆగదిలో దేనికోసమో తీవ్రంగా వెదికినట్టున్నారు. 'ఎవరు వెదికారు? దేనికోసం?' నన్ను నేనే ప్రశ్నించుకున్నాను.

ఇంతకూ శాంతారాం ఎక్కడ? జాగ్రత్తగా నడిచి ఆ పక్కగదిలోకి అడుగు పెట్టాను. అది పడకగది. అందంగా, శుభ్రంగావుంది. ఇక్కడ తుఫాను సూచనలు లేవు. ఎందుకు?

ఇక అప్పుడు శాంతారాం నాకు కనిపించాడు. ఫొటోలో చూసిన రూపాన్ని బట్టి ఆ బట్టతల మనిషి శాంతారాం అయి వుండాలనిపించింది. అతను పరుపుమీద పడుకుని ఉన్నాడు. అతని పొత్తికడుపులోంచి అందమైన ఒక కత్తిపిడి కనిపించింది. అతను అప్పటికే చనిపోయాడు...




ఆ దృశ్యం చూడగానే నాకు తగిలిన షాక్‌నుంచి తేరుకోడానికి కొన్ని క్షణాలు పట్టింది. అయితే నా వృత్తి మూలంగా నాలో పెంపొందిన జ్ఞానం నన్ను కుదుటబర్చింది. మంచంమీద పడివున్న శవాన్ని చూశాను. శవంకింద రక్తం మడుగుకట్టి ఉంది.




పాపం! శాంతారాం కడుపులో, డొక్కలో, రొమ్ములో కత్తిపోట్లు కనిపించాయి. అతని పెదవులు కూడా తెగి ఉన్నాయి. ఆ గాయాల ధోరణిని బట్టి శాంతారాంను ఎవరో బాగా కోపంతోనే దెబ్బతీసినట్టు కనిపించింది.

ఇంతకూ అతను ఎందుకు చనిపోయినట్టు? కాదు. ఎందుకు చంపబడినట్టు? అసూయా? పగా? కారణమేదై ఉంటుంది? అతణ్ని ఎవరుచంపివుంటారు? ఈ హత్య ఎందుకు జరిగింది? ఛాయ నానుంచి వృత్తిరీత్యా సహాయం కోరడంతో బాటు నా వ్యక్తిగత సహాయం కూడా కోరింది. ఆమె అలా ఎందుకు కోరినట్టు? శాంతారాం ఇంతత్వరగా మరణించగలడని ఆమె ఎదురుచూసిందా? ఒకవేళ ఆమెకూ, ఈ హత్యకూ ఏదన్నా సంబంధం ఉందా? ఆ అందగత్తె, ఆ సంపన్నురాలు హత్యచేసి ఉంటుందా? ఏమో! ఎందుకు చెయ్యకూడదు? ఏ మనిషీ పుట్టుకచేత హంతకుడుగా గానీ, హంతకురాలిగాగానీ పుట్టరనీ; పరిస్థితుల ప్రభావం వల్లనే మనుషులు హత్యచేస్తారనీ నాకు తెలుసు.

ఒకసారి గడియారం చూసుకున్నాను. సెకన్లు—విలువైన కాలబిందువులు వడివడిగా కరిగిపోతున్నాయి. మరింక ఆలస్యం చెయ్యకూడదనుకున్నాను. శవం దగ్గరగావెళ్లి పరిశీలనగా చూశాను. ఇంకా రిగర్‌మార్టిస్ మొదలుకాలేదు. ఆ బట్టతల మాడుమీద నా చెయ్యి వెనక భాగం పెట్టి చూశాను. ఇంకా వెచ్చగానేవుంది. గాలిలో రక్తం వాసన. నాకు ఫోర్సెనిక్ వైద్యంలోనూ, పేథాలజీలోనూ ఉన్న ప్రవేశాన్ని బట్టి చూడగా హత్యజరిగి రెండుగంటలు మించి వుండదనిపించింది.

ఏవన్నా సాక్ష్యాధారాలు కనిపిస్తాయేమోనని ఆ గదిని వెతకడం మొదలు

పెట్టాను. ఆ రక్తంమడుగునుబట్టి అతణ్ణి పడుపుమీదే హత్యచేసి ఉండాలనిపించింది. హత్య జరిగినపుడు అతను నిద్రపోతూ ఉన్నాడా? మొదటి పోటు తగలగానే అతను కేకలుపెట్టలేదా? ఒకవేళ అతను కేకలుపెట్టినా ఎవరికీ వినబడలేదా? పక్కిల్లు కూడా పెద్ద దూరానలేదు. మరి చంపే ముందు అతనికి మత్తుమందు ఏదయినా ఇచ్చారా?

పడకగదిలో-ఆ పక్కగదిలో కనిపించిన గందరగోళంఅసలు లేదనే చెప్పాలి. ఆశ్చర్యకరం! హంతకుడు (లేదా హంతకురాలు) పక్కగదిలో వెదికినదానికోసం ఈ పడకగదిలో ఎందుకు వెదకలేదు? అంటే వెదికింది ఆ గదిలోనే దొరికిందా? ఇంతకూ దేనికోసం వెదికినట్టు...?

ఉత్తరంవైపు గోడపక్కన నేలమీద పడివున్న పుస్తకంమీదికి నాదృష్టిమళ్లింది. ఆ పుస్తకం - హిందూ నాగరికత. పడకగదిలో అలాంటి పుస్తకానికి చోటు లేదనిపించింది. శాంతారాం ఇలాంటి పెద్దపెద్ద పుస్తకాలుకూడా చదివేవాడా? గదిలో మరి ఇంకే పుస్తకాలూ కనిపించలేదు. పుస్తకం పెట్టడానికి బోలెడన్ని చోట్లు ఉండగా ఆ పుస్తకంనేలమీద ఎందుకుపడవేసినట్టు? హత్యచేసిన మనిషి దాన్ని అలా పారేసి ఉంటాడా? అలాఅయితే అది విలువయిన సాక్ష్యాధారం - మెటీరియల్ ఆబ్జెక్ట్ అవుతుంది.

కుడికాళ్ళమీద కూచుని పుస్తకం నేలమీద ఎలా పడివుందో చూశాను. రుమాలుతో దాన్ని చేతిలోకి తీసుకుని పేజీలు తిరగవేశాను.

ఆ పుస్తకం ఎవరో విదేశీయుడు రాసింది. దాన్నిండా బొమ్మలు. మొహంజదారో...హరప్పా...వగైరా వగైరా...! మహాబలిపురంలోని సముద్రతీరంమీది గుడికి సంబంధించిన బొమ్మలు నా దృష్టిని ఆకర్షించాయి. ఆ పేజీలు తక్కిన పేజీల కన్నా లావుగా కనిపించాయి. ఆ పేజీలను తిప్పిచూసినా ఏమీ తెలియలేదు. చటుక్కున అర్థమయింది. రెండు పేజీలను కవరులా ఉండేటట్టు అతికించిపెట్టారు. ఆ పేజీల మధ్య ఉన్న భాగంలోకి వేళ్లుపోనిచ్చి చూస్తే చేతికేదో తగిలింది. కాస్త మందంగా ఉన్న కాగితం అది ... జాగ్రత్తగా పైకిలాగాను.

అది ఒకఫొటో. ఒక ఆడమనిషి ఫొటో! నగ్నంగా ఉన్న ఆడమనిషి ఫొటో! ఫొటోలో మనిషి అంగసౌష్ఠవం బాగుంది. మనిషి కూడా వయసులో ఉన్నట్టే ఉంది. మరి-ఆ ఆడమనిషి ఎవరు?

ఆమె ముఖం లేదు. ఫొటో మీది భాగం చిరిగి ఉంది. అంటే ఈ ఫొటో ముఖంకోసమేనా హంతకుడు వెదికింది? నా ఆలోచనే సరయినదయితే హంతకుడు ఎంతో నిబ్బరంగా ఉన్నాడన్నమాట. ఫొటోను చించి, దాన్ని మళ్ళీ ఆ పేజీల మధ్య ఉంచి పుస్తకాన్ని పారెయ్యడం... ఇవన్నీ శాంతారామ్‌ను హత్యచేశాక చేసి ఉండాలి. మంచి నిబ్బరమే!

ఫొటోను కాసేపు దీక్షగా చూసి ఆ వివరాలను గుర్తుపెట్టుకోవడానికి ప్రయత్నించాను. దాన్ని ఆ పేజీల మధ్య ఎడంలో పెట్టి పుస్తకం మూసెయ్యబోతుండగా-మధ్యలో ఒక పేజీమీద పెన్సిలుతో రాసిన ఒక సంఖ్య నన్ను ఆకర్షించింది. 5629...బహుశా ఏదన్నా టెలిఫోన్ నెంబర్‌కావచ్చు! ఎవరిదో అది?

ఆ ఇంట్లో ఎక్కడో ఉన్న టెలిఫోన్ ఆ భీకర నిశ్శబ్దాన్ని చీల్చుతూ హఠాత్తుగా మోగడం ప్రారంభించింది. నేను ఉలిక్కిపడి పుస్తకం కిందపడవెయ్యబోయాను.

వెంటనే కుదుటబడి పుస్తకాన్ని నేలమీద దాన్ని తీసినచోటే ఉంచేసి ఆ గదిలోంచి బయటపడ్డాను.

ఫోను మేడమెట్లకింద ఒక ఎత్తయిన స్టూలుమీద ఉంది. కటువుగా, బిగ్గరగా మోగుతున్నది. నా చీర అంచుతో రిసీవర్‌ను పట్టుకుని చెవికి తగలకుండా కాస్త దూరంగా పెట్టుకున్నాను.

"హలో! శాంతారాం ఉన్నాడా?"

ఒకస్త్రీ కంఠం ఆత్రంగా వినిపించింది. నేను జవాబు చెప్పకుండా ఊరుకున్నాను.

"హలో..శాంతారాం..హలో..హలో.."

అవతలి మనిషి ఫోన్ పెట్టేసిన చప్పుడు వినిపించింది. నేను రిసీవర్ పెట్టేసి ఫోన్ వైపు ఒకసారి చూశాను. అప్రయత్నంగా నా బొమలు ముడివడ్డాయి. ఆ స్వరం ఎవరిదో తెలిసింది. అది - సారా కంఠ స్వరం!

* * *

గబగబా ఇంటికి వచ్చి గోరువెచ్చని నీళ్ళలో స్నానం చేసి నేను అంతకు ముందు తొడుక్కున్న పచ్చ పంట్లాం, చొక్కా తొడుక్కున్నాను. తలారా స్నానం చేశాను కనుక జుట్టు అలాగే విరబోసుకున్నాను. నడుమును అందు కుంటున్న నా జుట్టు నల్లగా, నిగనిగ లాడుతూ ఉంటుంది. అడపాదడపా ఎప్పుడయినా తెల్ల వెంట్రుక కనబడితే - ఠాత్తుళ్ళ పనిగట్టుకుని వాటిని లాగి పారేస్తూ ఉంటాను.

తిల్లీ మంచి భోజనం పెట్టింది. వంట కాలు తిల్లీలాగానే బాగానే ఉన్నాయి. ఆమె వయసు ఇరవై అయిదు దాకా ఉండవచ్చు. రంగు చామనఛాయేకానీ రొమ్ము, నడుము తీర్చినట్టు ఉంటాయి. ఆమెకింకా పెళ్ళికాలేదు. ఆమెను చేసుకో వలసిన 'అయ్య' ఇంకారాలేదు.

భోంచేసి పడకగదిలోకి వెళ్ళి కాసేపు రెస్ట్ తీసుకున్నాను. ఉదయమంతా బాగా శ్రమపడి ఉండడంతో కాసేపు నడుము వాలిస్తే బాగుండుననిపించింది. కానీ- కుదరలేదు. కత్తిపోట్లతో నిండిన శాంతారాం శవం, తల లేని ఫొటో, సారా నుంచి వచ్చిన ఫోన్‌కాల్, గందరగోళంగా ఉన్న గది... నా మెద డును తొలిచివేస్తుండగా విశ్రాంతి తీసు కోవడం ఎలా సాధ్యం? భోజనం ఎలాగో చేశాను కానీ, విశ్రాంతి తీసుకోవడానికి వీలు కాలేదు. నా ఆలోచనలు ఛాయాదేవి చుట్టూ తిరుగుతున్నాయి. 'ఆమెకు ఈ హత్యతో ఏదయినా సంబంధంఉంటుందా' అని ఆలోచించసాగాను.

ఆమె కేవలం నగలు దిగవేసుకున్న బంగారుబొమ్మ మాత్రం కాదనిపించింది ఆమెకు బాగాడబ్బు ఉందనీ, ఆ డబ్బుకు తగ్గ తెలివితేటలూ ఉన్నాయని తెలిసింది. ఆమె తెలివితక్కువదయితే అలాంటి బడి నడపడం సాధ్యం కాదు. ఈ ముగ్గు లోకి సారా ఎలా వచ్చింది? నేను ఫోన్‌లో విన్నది ఆమె స్వరమే! రెండుసార్లు వింటే నేను ఏ కంఠస్వరాన్నయినా గుర్తుంచుకోగలను. సారా గొంతును గుర్తు పట్టడంలో నేను పొరబడలేదనిపించింది.

నాకు తెలియకుండానే కునుకు పట్టే సింది. మామూలుగా ఆదివారాలూ, తక్కిన సెలవు రోజులూ మధ్యాహ్నాలు నిద్రపోయి నా బుద్ధికి పదును పెడుతూ ఉంటాను. శనివారం కావడం వల్ల నాకు కావాలనిపించినంత సేపు నిద్రపోవచ్చు. మా ఆఫీసు శనివారాలు పనిచేస్తుంది కానీ తొందర పనులుంటే తప్ప నేను




వెళ్లను.

మూడు గంటలకు మెలకువ వచ్చింది. లేచి పక్కమీద కూచున్నాను. అంతలో లిల్లీ వేయించిన జీడిపప్పు, కాఫీ పట్టు కొచ్చింది. నేను జీడిపప్పు తింటూఉండగా నేను నిద్రలో ఉన్నప్పుడు వచ్చిన ఫోన్ కాల్స్ గురించి చెప్పింది.

తర్వాత నేను ఆఫీసుకు ఫోన్ చేశాను. నిరూపకు ఆ ఉదయం జరిగిన సంఘటన లన్నీ వివరంగా చెప్పి 5629 ఫోన్ గురించికనుక్కోమని చెప్పాను. నిరూపకు



చాలా మంది స్నేహితులున్నారు. వాళ్ళలో కొందరు టెలిఫోన్ శాఖలో పని చేస్తున్నారు. వాళ్ళ సాయంతో ఆమె కావలసిన సమాచారం రాబడుతూ ఉంటుంది.

పది నిమిషాలు గడిచాక నా బెడ్ పక్కన ఉన్న అన్‌లిస్టెడ్ ఫోన్ మోగింది. నాకు రెండు ఫోన్లున్నాయి. డైరెక్టరీలో కనిపించని ఈ అన్‌లిస్టెడ్ నెంబరు చాలా తక్కువ మందికి మాత్రమే తెలుసు.

"నీరూను మాట్లాడుతున్నాను..."

"ఏమిటి డియర్! దొరికిందా?"

"అంత తొందరగానే? నీవిచ్చిన నెంబర్ 5629 పూర్తి ఫోన్ నెంబర్ కాదు. నువ్వు చెప్పగానే నేనూ అనుకున్నాను. బహుశా అది ఒక నెంబర్‌లో భాగమేమోనన్నది నా ఫ్రెండ్. అలా అయితే బోలెడన్ని నెంబర్లు ఉంటాయి. నేను ఆ అంకెలున్న నెంబర్లన్నీ రాసి ఇమ్మని నా ఫ్రెండ్ భాగ్యానికి చెప్పాను"

"అది కష్టమేమో కదా...?"

"కావచ్చు. కానీ తప్పదు. బహుశా ఆ నెంబర్ మంచి లీడ్ కావచ్చు. మనం దాన్ని వదులుకోకూడదు"

"సరిగ్గా చెప్పావ్! మరి ఇది ఎప్పట్లో అందుతుంది?"

"తెలీదు. మనకు కావలసిన సమాచారం అందగానే ఫోన్ చేస్తుంది. భాగ్యం చాలా చురుగ్గా పనిచేస్తుంది. కాబట్టి త్వరలోనే ఫోన్ చెయ్యగలదని ఎదురు చూస్తున్నాను. రాగానే నీకు ఫోన్ చేస్తాను"

ఈలవేసి ఫోన్ పెట్టేసింది నిరూప.

ఇంకో కప్పు కాఫీ కావాలనగానే తిల్లీ పట్టుకొచ్చింది. ఆమె ఖాళీ కప్పు తీసుకుని వెళ్ళిపోగానే నేను మంచం దిగి ఇటూ అటూ పచార్లు చెయ్యడం మొదలు పెట్టాను. ఉదయం లేచినప్పటినుంచి జరిగిన సంఘటనలన్నీ ఒకసారి నెమరు వేసుకుంటే-ఇదంతా ఎలా ముగుస్తుందనిపించింది. 'శాంతారాం శవాన్ని ఎవరయినా చూశారా, లేదా? ఎవరు చూసి ఉంటారు? పోలీసులా? అతని మిత్రులా? లేదా - ఛాయాదేవిగానీ, ఆమె అన్నయ్యగానీ చూశారా?' అనేది కనుక్కోవాలనుకున్నాను.

ఆ మెట్లకింద ఉన్న ఫోన్ నెంబర్ నేను కంఠస్థం చేసుకున్నాను. వెంటనే ఆ నెంబర్‌కు ఫోన్ చేశాను. చాలా సేపు ఫోన్ మోగినా ఎవరూ తీయలేదు. అంటే అక్కడికి పోలీసులు ఇంకా చేరుకోలేదన్న మాట అనుకున్నాను. ఫోన్ పెట్టేసి మళ్లీ గదిలో పచార్లు ప్రారంభించాను.

నాలో ఆందోళన మొదలయింది. త్వరగా ఏదయినా అయితే బాగుండుననుకున్నాను.

మళ్ళీ ఆ నెంబరుకు ఫోన్ చేశాను; ఫోన్ గంట ఎనిమిదిసార్లు మోగింది. నేను ఫోన్ పెట్టేసేలోగా ఎవరో దాన్ని తీసిన చప్పుడు వినిపించింది.

"హలో....?" నేను గుసగుసగా అడిగాను.

"హలో..."

అవతలి గొంతు ఒక పురుషుడిది. మెత్తగా వినిపించింది. ఆ మెత్తదనంలోనూ కొంత ప్రత్యేకత కనిపించింది. అంటే-కొన్ని గజాల దూరంలో నెత్తుటి మడుగులో ఒక శవం పడిఉన్నా నిలిచి నిలకడగా జవాబుచెప్పే ధైర్యంకనిపించిన దన్నమాట!

"శాంతారాంతోమాట్లాడాలి" అన్నాను.

"బెంగుళూరు వెళ్లాడు..."





బెంగుళూరు! ఒక్క క్షణం నిశ్శబ్దంగా నిలిచిపోయాను. నన్ను మోసంచెయ్యాలని చూస్తున్న అవతలి మనిషి ఎవరు?

"అతను ఎప్పుడు తిరిగి వస్తాడు?"

"ఇంకో వారం పట్టచ్చు. ఇంతకూ మీరెవరు?"

'భలే ధైర్యమే' అనుకున్నాను.

"ఇంకో వారం రోజులా" అని అడిగాను.

"అవును. మీరెవరూ?"

"ఎలిజబెత్ మహారాణి!" అని నవ్వాను. ఇలాటి ఆట ఇద్దరు ఆడితే బాగుంటుంది. అవతలి మనిషి ఫోన్ పెట్టేసిన చప్పుడు వినిపించింది.

ఆ మనిషి ఎవరు? ఎంత నిబ్బరంగా ఉన్నాడు! నేను ఆ ఇంటికి వెళ్ళినప్పుడు అతను ఎక్కడున్నాడు? ఎక్కడన్నా దాక్కున్నాడా? లేకుంటే నేను వచ్చేశాక వెళ్ళాడా అక్కడికి? మొత్తం మీద ఈ విషయం చిత్రాతిచిత్రంగా కనిపించింది. ఆ స్వరం ఎవరిది? ఎంత ప్రయత్నించినా నాకు ఆ స్వరం ఎవరిదో అంతుచిక్కలేదు. ఆ స్వరం నేను అంతకుముందు విన్నట్టూ అనిపించలేదు.

కిందఉన్న గడియారం ఐదు కొట్టింది. శనివారం సాయంకాలం ఐదుగంటలు. వారమ్మంతా పడ్డశ్రమనూ, పొందిన అలసటనూ పోగొట్టుకోవడానికి ప్రయత్నించవలసిన సమయం. సాధారణంగా ఇలాంటి సందర్భాలలో నేను ఇంట్లో ఉండను. స్నేహితుడు ప్రకాష్ దగ్గరికి వెడదామనుకున్నాను. ప్రకాష్ చిత్రకారుడు. అతను కాటేజ్ ఒకటి కట్టుకుని అందులో ఉంటున్నాడు. ప్రతిరోజూ ఉదయం ఆరుమైళ్ళు నడుస్తూ ఉంటాడు. ఒకసారి వాకింగ్‌కు వెళ్ళి వచ్చేస్తే మరి ఇల్లు వదలడు.

నేను డ్రెస్ చేసుకోవడం మొదలుపెట్టాను. జాకెట్ తొడుక్కుంటూ ఉండగా ఫోన్ మోగింది. వెళ్ళి అందుకొన్నాను. నిరూప! ఆమె స్వరం ఆదుర్దాగా ధ్వనించింది.

"సాగరీ! శాంతారామ్‌ను హత్య చేసిన నేరం కింద పోలీసులు ఛాయాదేవిని అరెస్ట్ చేశారు. అరగంట క్రితం ఆమెను పోలీస్ స్టేషనుకు తీసుకువెళ్ళారు. నువ్వురానిదే తాను నోరు మెదపనని చెప్పిందట ఆమె"

"ఇంతకూ శవాన్ని ముందు ఎవరు చూశారు?"

"నేనింకా కనుక్కోలేదు. ఛాయ అన్నయ్య గోపాల్ ఇక్కడికి వచ్చాడు. ఆయన ఆదుర్దా పడుతున్నారు. నీతో మాటాడాలట"

"ఆయనను నాతో మాటాడమను"

గోపాల్ ఫోన్ అందుకుని, "హలో" అన్నాడు.

"ఎస్" అన్నాను.

"హలో! నేను ఛాయ అన్నయ్యను. ఆమెను అరెస్ట్ చేశారు. దయచేసి మీరు వెంటనే రావాలి" అన్నాడు. ఒక క్షణం నేను ఆశ్చర్యపోయాను. వెంటనే ఆ స్వరాన్ని గుర్తుపట్టాను. అంతకుముందు శాంతారాం ఇంటికి నేను ఫోన్ చేసినప్పుడు బదులు చెప్పిన మనిషి ఈ గోపాలే అయిఉండాలి.

* * *

శాంతారాంను హత్య చేసినందుకుగాను ఛాయాదేవిని పోలీసులు అదుపులోకి తీసుకున్నారు. నేను ఆమె తరఫున 'వకాల్తా' పుచ్చుకున్నాను. చట్టప్రకారం ప్రాసిక్యూషన్ ఈ కేసు పెట్టడానికి

ఆధారంగా చూపే కాగితాల ప్రతులన్నీ నా క్లయంట్‌కు అందజెయ్యాలి. అంటే- 'ఎఫ్.ఐ.ఆర్'గా పేర్కొనే ఫస్ట్ ఇన్‌ఫర్మేషన్ రిపోర్ట్ కాక తక్కిన కాగితాలూ ఇవ్వాలి.

పోలీస్‌స్టేషన్‌లో ఛాయాదేవిని కలుసుకున్నాను. తనపై మోపిన నింద సరికాదని ఆమె చెప్పాక, సరే! మరే విషయమూ చెప్పవద్దన్నాను. భారతదేశంలో మనం పాటించే న్యాయ సూత్రాలు బ్రిటిష్‌వారి నుంచి సంక్రమించింది కావడంవల్ల నేరం ఋజువయ్యేదాకా నిందితులు నేరం చెయ్యనట్టుగానే పరిగణించాలి. నేరం ఋజువు చెయ్యవలసిన బాధ్యత ప్రభుత్వానిది. ఋజువు కాకపోతే నేరం కాదనే ఈ వీలు మన న్యాయ విధానంలోని ప్రత్యేకత.

ఆఫీసులో కూచుని, ఛాయాదేవి కేసుకు సంబంధించిన కాగితాలన్నీ చదివి నిరూపతో చర్చించడం మొదలు పెట్టాను.

నా క్లయంట్ మీద భారతీయ శిక్షా స్మృతిలోని వివిధ సూత్రాల ప్రకారం పోలీసులు ఆరోపించిన నేరం ఏమిటంటే-

ఛాయాదేవికీ, ఆమె బడి అయిన దేవీ విద్యాలయంలో పనిచేసిన హతుడు శాంతారామ్‌కూ అక్రమ సంబంధం ఉంది. శాంతారామ్‌మీద వ్యామోహం ఎక్కువై అతణ్ని తన అదుపులోనే ఉంచుకోవాలనుకుని శాంతారాం తన భర్త అని చెప్పుకొనేదాకా వెళ్ళిపోయింది. ఇటీవల శాంతారాం ఛాయాదేవికన్నా వయసులో చిన్నవారయిన అందగత్తెలతో సంపర్కం పెట్టుకునే సరికి కోపం వచ్చింది. దాంతో ఆమె తరచుగా అతనితో పోట్లాడేది. ఒక్కోసారి ఆమె కోపం పట్టలేక అతని మీదికి చేత ఏది ఉంటే అది విసిరేది. ఆమెలో ఈర్ష్య బాగా ఎక్కువయిపోయి చివరికి శాంతారామ్‌ను చంపుతానని బెదిరించే దాకా వచ్చింది. ఇక ఈర్ష్య పట్టలేక ఆమె పరుపు మీద పడుకున్న శాంతారామ్‌ను తాను ఒక్కతేగానీ, మరెవరి సాయంతో నయినాగానీ పొడిచి చంపింది. ఈ 'సాయం' గురించి పోలీసులు ఇంకా విచారిస్తూ ఉన్నారట...




ప్రాసిక్యూషన్ కథనం ప్రకారం- కేసు చాలా సింపుల్!

కాని నా బుద్ధికి, అనుభవానికి, స్త్రీ పురుష సంబంధాలలోని మర్మాల గురించి ఎంతో కొంత తెలిసిన నాలోని స్త్రీత్వానికి- పోలీసులు ఛాయాదేవి మీద పెట్టిన కేసు చాలా సాధారణంగా, నమ్మడానికి వీలు కాసంత సాధారణంగా కనిపించింది. ఏది ఏమయినా ఆమె మీది కేసు అదీ. ఆమె లాయర్‌గా ఆ కేసును పడగొట్టాల్సిన బాధ్యత నాది.

నిరూప సోఫామీద తన మామూలు ధోరణిలో కూచుని మూతి ముడుస్తూ ఉంది. నేను నా బల్ల మీద కాగితాలన్నీ పరేసుకుని వాటి ముందు కూచున్నాను.

"సాగరీ! ఛాయలాంటి స్త్రీ ఆ శాంతారామ్‌ను అంత భీకరంగా చంపగలదని అనుకుంటున్నావా?" అని అడిగింది నిరూప.

"ప్రాసిక్యూషన్ కేసు అదీ... మన

చిరకాలమిత్రుడు జార్జి పోలీసుల ఆరోపణను రుజువు చెయ్యడానికి బాగా ప్రయత్నిస్తాడు..." అన్నాను.

జార్జి సిటీ ప్రాసిక్యూటర్. సెషన్స్ కోర్టులో కేసులు నడుపుతూ ఉంటాడు. అతను బాగానే వాదిస్తాడు కానీ, అతనిలో చురుకుదనం పాలు కాస్త తక్కువ. కోర్టులో తటస్థపడినప్పుడల్లా అతనూ, నేనూ తీవ్రంగా వాదించుకుంటూ ఉంటాము.

జార్జి లావుగా, లావుకు తగ్గ బొజ్జతో కనిపిస్తాడు. అతనికి యాభై ఏళ్లుంటాయి. ఎందుకో అతనికి ఆడ లాయర్లంటే మంట. లాయర్ గౌను తొడుక్కున్న నన్ను చూస్తే చాలు - అతని ముఖం ఎర్రబడిపోతుంది!

నా ఆలోచన గమనించి, "వాణ్ని అలా ఉండనీ సాగరీ! వీలుంటే ఛాయను విడిపించడానికి తగ్గ వాదాన్ని సిద్ధం చేసుకోవాలి. లేకుంటే ఆమెకు శిక్ష తక్కువ పడేలా చూసుకోవాలి" అంది నిరూప.

"నిరూపా! ఆమె హత్యచేసి ఉంటుందనుకుంటున్నావా?"

"అది కోర్టు తేల్చుకోవాల్సిన విషయం. నా ఉద్దేశ ప్రకారం ఇందులో తక్కిన వాళ్ళ ప్రమేయం కూడా ఉండి ఉంవాలి. ఛాయకు ఈ హత్య గురించిన వివరాలు తెలిసి ఉండాలి. ఆమె ఆ హత్య జరిగిన ఇంట్లో ఉంది. నీతో ఫోన్‌లో మాట్లాడిన గోపాల్‌కూ ఆ వివరాలు తెలిసేఉండాలి.."

"మరి పోలీసులకు ఇవేవీ తెలియదు కదా నిరూపా? వాళ్ళకా వివరాలు చెప్పాలనీ నాకు లేదు" అన్నాను.

"అదికాదు సాగరీ! అక్కడేం జరిగి ఉంటుంటో ఊహించడానికి ప్రయత్నిస్తున్నాను... ఛాయకూ, శాంతారామ్‌కూ సంబంధం ఉండిఉండాలి. ఇద్దరూ ఆ ఇంట్లో కలుసుకుంటూ ఉండి ఉండాలి. అది పొక్కకుండా ఉండడం కోసం అతను తన భర్త అని ఆమె నీకు చెప్పింది. మనల్ని మోసం చేసినందుకు ఆమెను ఏమీ అనలేం! తాను కోరినప్పుడల్లా అతను తన మాట వినేవాడని ఆమె మనకు ఎలా చెప్పుకోగలదు?" నిరూప తన మాటకారితనాన్ని మళ్ళీ ప్రదర్శించడం మొదలుపెట్టిందన్నమాట!

"సరే నిరూపా! ఛాయ తన బాయ్ ఫ్రెండ్‌ను చంపిందనే అనుకుందాం... బహుశా గోపాల్ ఆమెకు సాయం చేశాడనే అనుకుందాం... మరి సారా శాంతారామ్‌కు ఎందుకు ఫోన్ చేసినట్టు?"

"అంటే సారా అతని గర్ల్‌ఫ్రెండ్ అన్నమాట. అంతేగా?" అన్నది నిరూప.

"అయితే ఆ న్యూడ్ ఫొటో ఎవరిది? ఆ ముఖం చించిందెవరు?"

"అంటే అది సారాదంటావా?"

"ఏమో... నాకేం తెలుసు? సారా బట్టలు తొడుక్కొని ఉన్నప్పుడే నేను చూశాను"

ఇద్దరమూ ఒక్కసారిగా నవ్వడం ప్రారంభించాం.

"సాగరీ! మన డిఫెన్స్ తయారు చేసుకునే ముందు ఛాయను కలుసుకోవడం మంచిదనుకుంటాను. వెళ్ళి ఇదివరకు చేసినట్టుకాక, ఇప్పుడు నిజమే చెప్పమంటాం" అన్నది నిరూప.

"మంచిది నిరూపా! అలాగే కానీ నీ ఫ్రెండు ఆ ఫోన్ నెంబర్ గురించి ఏమన్నా చెప్పిందా?" అని అడిగాను.

"ఇంకా లేదు!" అన్నది నిరూప.

* * *

నగల బరువు లేకుండా ఉండే




ఛాయాదేవిని చూడటం కొంచెం చిత్రంగా కనిపించింది. మా బెయిల్ అప్లికేషన్‌ను నిరాకరించడంతో ఆమెను జైలులో స్త్రీల వార్డులో ఉంచారు. నేనూ, నిరూపా అక్కడికి వెళ్ళి ఆమెను కలుసుకున్నాం. ఆమె జుట్టును వదులుగా ముడి వేసుకుంది. గంటల తరబడి ఏడ్చినందుకు ఫలితంగా ఆమె కళ్ళు బాగా వాచి ఉన్నాయి. హత్యా భియోగం కింద అరెస్టు చేసి జైలులో పడేస్తే నిబ్బరంగా ఉండే మనుషులుకూడా సడలిపోతారు. అలాంటప్పుడు సుఖజీవనానికి అలవాటుపడ్డ ఛాయాదేవి బాగా దెబ్బతినడంలో ఆశ్చర్యమేమీ కనిపించలేదు.

మొదట కొద్ది నిమిషాలపాటు ఛాయాదేవి ఏమీ మాట్లాడలేదు. నిరూప తన శాయశక్తులా ఆమెను ఓదార్చటానికి ప్రయత్నించింది. అక్కడ డ్యూటీలో ఉన్న ఆడపోలీసు ఈ తతంగం చూసి భరించలేక మొహం తిప్పుకుంది.

"ఛాయా! మేము మీకు సాయం చెయ్యడానికే వచ్చాం. వీలైనంత గట్టి ప్రయత్నం చేసి మిమ్మల్ని విడిపిస్తాం. కాని మీరు జరిగినదంతా చెప్పాలి...నిజం చెప్పాలి..." అన్నాను.

"నామాట నమ్మండి" ఛాయ గొంతు దుఃఖంతో పూడుకుపోయింది. "శాంతారామ్‌ను నేను చంపలేదు. అతన్ని ఎవరు చంపారో తెలియదు" అన్నది ఆమె.

"ఓకే ఛాయా! అవాళ నన్ను చూడ్డానికి వచ్చినప్పుడు శాంతారామ్ మీ భర్త అన్నారు. అది నిజం కాదా?"

ఆమె బదులు చెప్పక నిశ్శబ్దంగా ఏడుస్తున్నది.

"మీకూ, శాంతారాంకూ మధ్య ఉన్న సంబంధం ఏమిటి?"

"చాలా ఏళ్ళ క్రితం నేను బడి ప్రారంభించిన రోజులలో మేము సన్నిహితంగా ఉండేవాళ్ళం. ఆ తర్వాత అతను మా బళ్ళో ఉద్యోగి. అంతే...!"

"అయినా మీరు అతని ఇంటికి వెళ్ళేవారు కదూ?" నిరూప అడిగింది.

"అది అతనిల్లు కాదు. నాది. నేను కొన్నాను ఆ ఇంటిని. అతను అక్కడుండేవాడు"

నేనూ, నిరూపా ఒకరి నొకరు చూసుకున్నాం.

"అలాగా! మరయితే అతను అద్దె ఇచ్చేవాడా?" అని అడిగాను.

"పాత స్నేహాన్ని గుర్తులో ఉంచుకుని అతణ్ని ఊరికే ఉండనిచ్చాను. అదీ కాక అతను మా బళ్ళో పని చేస్తున్నాడు గదా అని..."

"శాంతారామ్ మీ భర్త అని మీరు మీ స్నేహితులెందరికో చెప్పుకునే వారని పోలీసులు చెబుతున్నారు"

"శాంతారామ్ నన్ను చాలా చోట్లకు తీసుకువెళ్ళాడు. అతనికి పెద్ద పెద్ద వాళ్ళతో పరిచయం ఉండేది. బడి ప్రారంభించిన తొలిరోజులలో అతనూ, నేనూ కలసి చాలా మందిని కలుసుకున్నాం. అప్పట్లో అతని భార్య అని చెప్పుకోవడం నాకూ, బడికి లాభించింది"

"ఐసీ! మరి ఇలా చెప్పుకోవడానికి మీ అన్నయ్య గోపాల్ అడ్డు చెప్పలేదా?"

"మా అన్నయ్య మెతక మనిషి. పైగా నా మీద ఆధారపడ్డవాడు. అందువల్ల నాకేమీ అడ్డు చెప్పలేదు" అన్నది ఛాయాదేవి.

"మీకో విషయం చెప్పనా? శాంతారామ్ హత్య జరిగాక మీ అన్నయ్య ఆ ఇంటికి వెళ్ళాడు. మీకు తెలుసా?"

"మీ కెవరు చెప్పారు?" ఛాయ నిలువెల్లా వణికిపోతూ అడిగింది.

"ఎవరయితేనేం? నమ్మదగ్గ వ్యక్తే చెప్పారు"

ఆమె అరనిమిషం మౌనంగా ఉండిపోయింది. నిరూప నా వైపు ఒక చూపు విసిరి నెమ్మదిగా ముందుకు వాలి ఛాయ ఎడమ తొడ మీద తన కుడిచెయ్యి ఉంచి, "ఛాయా, అప్పుడు మీరూ ఉన్నారా అక్కడ?" అని అడిగింది సూటిగా.

ఛాయాదేవి జవాబు చెప్పక వెక్కి వెక్కి ఏడుస్తూ చీరచెంగు నోట్లో కుక్కుకుంది.

"ఇదిగో ఛాయా! మీరు మమ్మల్ని నమ్మి నిజం చెప్పకపోతే మీకు మేము సాయపడ్డం కష్టమౌతుంది. మీరు అది తెలుసుకుంటే మంచిది'' అన్నాను.

ఆమె సరే అన్నట్టు తల ఆడించింది. ఏడుపు మాని కళ్లు నులుముకుంది. ఆమె కళ్ళు ఇప్పుడు మరింత ఎర్రగా ఉన్నాయి.

"నాకు అంతా గందరగోళంగా ఉంది. భయంగానూ ఉంది. ఏదీ పాలుపోవటంలేదు. నా స్థితి మీరు అర్థం చేసుకోగలరనుకుంటాను. నా బతుకు పాడయిపోయింది. ఒకవేళ మీరు నన్ను విడుదల చేయించినా నా బతుకు బాగు పడదు. నా బడి దెబ్బతింటుంది. ఏ పెద్దలూ తమ పిల్లలను మా బడిలో చేర్చరు" అన్నది ఆమె.

నేను తల ఆడించాను. నిరూప సానుభూతిగా ఏవో శబ్దాలు చేసింది.

"ఇదండీ నా పరిస్థితి. నేనూ, గోపాల్ కలిసే అక్కడికి వెళ్ళాం. కాని అప్పటికే శాంతారామ్ చచ్చిపోయి పడి ఉన్నాడు. అతణ్ని అప్పటికే ఎవరో చంపేశారు. నేను భయపడ్డాను. నాకు పిచ్చెక్కినంత పనయింది..."

"మీరు ఆ శవాన్ని చూశారా?"

"చూశాను. చాలా భీకరంగా ఉంది. పాపం అతను ఎన్ని కత్తిపోట్లు తిన్నాడో" అన్నది ఆమె.

"అక్కడ దేన్నయినా ముట్టుకున్నారా మీరు?'' అని అడిగాను.

"ఏమో! గుర్తులేదు. నేను మీకు చెప్పానుగా నాకు ఏదీ పాలుపోలేదు. ఆ గందరగోళంలో ఏం చేశానో, ఏం చెయ్యలేదో చెప్పలేను'' అన్నది ఆమె.

"ఆ కత్తి గానీ ముట్టుకున్నారా?"

"గుర్తులేదు నాకు. అంతా కన్ఫ్యూజింగ్‌గా ఉంది"

"ఆ కత్తి మీది కాదుగదా?" అని అడిగింది నిరూప. కాదన్నట్టు తల అడ్డంగా ఆడించింది ఛాయాదేవి.

"మా ఆఫీసుకు వచ్చినప్పుడు మీరు సారా అనే ఆవిడ గురించి చెప్పారు. గుర్తుందా?"

"ఊఁ! ఆ పాపిష్టిదాన్ని అతను ఉంచుకున్నాడు. డబ్బుకోసం అది ఎవడితోనయినా..."

"అయినా మీరు ఆమెకు ఉద్యోగం ఇచ్చారు. కదూ?"

"అవును! ఆమె మంచి టీచరు. మా బళ్ళో పనిచేస్తున్నవాళ్ళు బడి బయట ఎలా ఉన్నారన్న దాంతో నాకు నిమిత్తం లేదు" అన్నది ఆమె.

"ఓకే! అలా అయితే సారా మరో ఆడమనిషినీ, శాంతారామ్‌నూ రైల్వే స్టేషన్లో చూడటం అబద్ధమేకదూ?"

ఛాయాదేవి తలవించుకుంది. నిరూప విగ్గరగా గొంతు సవరించుకుని ఛాయాదేవిని తీక్షణంగా చూసింది.





"ఇదిగో ఛాయాదేవీ! మీరింకా అబద్ధాలు చెప్పడం మానలేదని నాకు అనిపిస్తున్నది. మీరు మాకు నిజం చెప్పడం లేదు. మీరు చేస్తున్న ఈ పనివల్ల మీకే నష్టం. ఈ విషయం మటుకు గుర్తుంచుకోండి" అన్నది నిరూప.

"అది కాదండీ..." ఏదో చెప్పబోయింది ఛాయాదేవి. నేను అడ్డు తగిలి "ఛాయా! మీరు శాంతారామ్‌ను చంపారా లేదా అన్నదే ప్రశ్న" అన్నాను.

"లేదు. వెయ్యిసార్లు చెప్పమన్నా చెబుతాను ఆమాట. నేను అతణ్ని చంప

లేదు. ఒట్టు" అన్నది ఆమె.

"మరి మీ అన్నయ్య చంపాడా?" అని అడిగాను.

"లేదు మా అన్నయ్య నల్లిని నలప డానికి కూడా వెనుకంజ వేసేంత మెతక మనిషి"

"మంచిది. ధైర్యంగాఉండండి ఛాయా దేవీ!" అని నిలబడ్డాను.

దారిలో కారులో వెడుతూ "నిరూపా! ఛాయాదేవి ఈ హత్య చేయలేదనుకుం టాను. ఆమె చెడామడా అబద్ధాలాడిన మాట నిజమేకాని ఈ హత్య చేసి ఉంటుందనుకోను" అన్నాను.

నిరూప చిరునవ్వు చిందించింది.

"నిరూపా! ఛాయాదేవి నిర్దోషి అని నా గట్టి నమ్మకం. ఏది ఏమయినా సరే నేను ఆమెను విడిపించి తీరుతాను'' అన్నాను.

"మంచిది. తర్వాత?"

"నీరూ... తర్వాతకాదు ముందు. టోనీకి కబురుచెయ్యాలి" అన్నాను.

"టోనీ" అని నవ్వింది నిరూప.




టోనీ మాకు తోడూ నీడా. మాకు కష్టాలు వచ్చినపుడు ఆర్చేవాడూ తీర్చేవాడూ. మా కేసుల్లో 'ఆక్షన్' కావలసివచ్చినపుడు అతణ్ణి ట్రంప్‌కార్డ్‌గా వాడుతుంటాం. అతనిపేరు ప్రతాప్. అతను నూనూగు మీసాల నూత్న యౌవనంలో ఉన్నప్పుడు అతనితో కాస్త చనువుగాఉన్న ఒక చైనీస్ వనిత అతనికి 'టోనీ' అనే ముద్దుపేరు పెట్టింది. ఆ పేరు కాస్త స్థిరపడింది. నల భయ్యోపడిలోఅడుగుపెట్టడానికి సిద్ధంగా ఉన్నా యువకుడిలాగే కనిపిస్తాడు టోనీ. దృఢమైన శరీరం, చురుకుతనం – టోనీ తక్కిన లక్షణాలు. బుద్ధిబలానికన్నా భుజ బలానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చే పను లంటే టోనీకి ఇష్టం. అందుచేత అతను మా కేసులగురించి ఆరాలు తీసి నిజం తేల్చుకోవడానికి పనికివస్తూ ఉంటాడు. అతను ఈ విచారణా యాత్రలమీద వెళ్ళి నపుడు నేను అతనికి తోడువెళ్ళి, అతనికి తగిన సలహాలిచ్చి ఫలితాలు అప్పటికి అప్పుడు రాబడుతూ ఉంటాను. టోనీ శక్తియుక్తులన్నీ అతని మెడకిందిభాగాల లోనే కేంద్రీకరించి ఉన్నాయని చెప్పుకో వాలి. నోరు చేసుకోవలసిన చోట చేయి చేసుకోవడం అతని తత్వం!

నేనుప్రాక్టీస్‌ప్రారంభించిన కొత్తల్లో అతను ఒక విడాకులకేసు గురించి నా దగ్గరికి వచ్చాడు. అతని గర్ల్‌ఫ్రెండు తరఫున నేను వాదించాను. ఆమె పెద్ద సోషలైట్. ఆమె భర్త కూడా 'పెద్ద'మనిషే! దాంతో ఈ మహానగరంలోని పెద్దలమధ్య ఈకేసు సంచలనాన్ని రేకెత్తించింది. ఆ కేసు వాదించిన నాకు పేరూ ప్రఖ్యాతీ లభిం చాయి. విచారణ జరుగుతున్న రోజులలో సాక్ష్యాధారాలు సేకరించడానికి టోనీ ఎంతో సాయపడి నేను కేసు గెలవడానికి కారకుడయ్యాడు. ఆవిధంగా మొదలయిన ఆ అనుబంధం తర్వాతి కేసులలో అతను నాకుచేసిన సహాయాలతో బలపడింది. మా సంస్థ అతనికి ఏడాదికి ఇంతఅని రిటైనర్




ఇచ్చేట్టు ఏర్పాటుచేశాను. అంతేగాక వ్యక్తిగతంగా నేనతనికి ఏడాదికి నాలుగుసార్లు అయినా విలువైన బహుమతులు ముట్ట చెబుతూ వుంటాను. టోనీ ఓ అడ్వకేట్ గారి ఇంటివెనక కాటేజీలో అద్దెకు ఉంటు న్నాడు. ఆ ఇంటావిడ సినిమా ఛాన్సుల కోసం ప్రయత్నిస్తూండేది.

మహాబలుడు, జేమ్సుబాండ్, ఆపద్బాంధవుడు, అనాథరక్షకుడు...వగైరా వగైరా విశేషణాలన్నిటికీ టోనీ అర్హుడే.

హత్యకేసు ఒకటి పచ్చిపడిందనీ, అందులోఅతని అవసరంవుందనీ నిరూప కబురుచేస్తే, కబురు అందుకుని టోనీ నాకు ఫోన్‌చేశాడు. అతనికి ఇష్టమైన ఒక హోటలుకుమర్నాడుమధ్యాహ్నం లంచ్‌కి రమ్మని ఆహ్వానించాను. వెంటనే టోనీ ఒక నవ్వు నవ్వాడు. ఆ నవ్వు నాలాంటి ఒంటరివాళ్ళను ఏంచేస్తుందో చెప్పడానికి వీలులేని నవ్వు!

ఆ మరుసటిరోజు నేనూ, టోనీ ఆ హోటల్లో కలుసుకుని నెమ్మదిగా భోంచేశాము. నిమ్మపండురంగు 'టి'షర్ట్ తొడుక్కుని, నీలంరంగు పంట్లాం తొడుక్కున్నాడు. టోనీ కండపుష్టే కాదు, తిండి పుష్టికూడా ఉన్నమనిషే! పదిరోజులనుంచి పస్తులున్న గుర్రంలా ఆవురావురుమని అతను రకరకాల వంటకాలు తింటూ కూచున్నాడు. దాంతో ఛాయాదేవి గురించి గానీ, ఆమె కేసు గురించిగానీ చెప్పడం కుదరలేదు.

"సాగరీ! మీ ఇంటికి వెళ్లి కేసు వివరాలు మాటాడుకుందాం" అన్నాడు టోనీ భోజనం అయ్యాక నా కారులో కూచుని.

నేను నవ్వాను. "నిన్ను ఇంటికితీసుకువెడితే వ్యవహారం తెమిలినట్టే. పదపద. ఆఫీసుకు వెడదాం" అన్నాను.

"ఏ చోటయినా ఇంటితర్వాతే" టోనీ సంసారపక్షంగా మాటాడబోయాడు.

"అవన్నీ నాకు తెలుసు. పద. కబుర్లు చెప్పకు" అన్నాను.

"నీకు కబుర్లు చెప్పవలసిన అవసరం నాకులేదు" అన్నాడు టోనీ.

ఇద్దరం గలగలా నవ్వుకున్నాము. కారు మా ఆఫీసు వైపుగా దూసుకు వెళ్ళింది.

టోనీ, నిరూప, నేను - ముగ్గురమూ కేసు వివరాలు క్షుణ్ణంగా చర్చించాము. ఛాయాదేవి నాతో జరిపిన సంభాషణ టేప్ వినిపించాను. కేసుకు సంబంధించిన డాక్యుమెంట్ల ప్రతులు అతనికి ఇచ్చి తీరిగ్గా చదువుకోమన్నాను.

"చూడబోతే ఆసక్తికరమయిన కేసు గానే ఉంది అమ్మాయిలూ!" అన్నాడు టోనీ-సిగరెట్ వెలిగించి. "కానీ నేనేం చెయ్యాలో తెలియడం లేదు. ఎవరో ఒక అందగత్తె మీ దగ్గరికి వచ్చి తన మనిషి కనబడ్డం లేదని చెప్పింది. ఆ మనిషి ఆమె మొగుడు కాదని తేలింది. వాళ్ళిద్దరూ కొంచెం స్నేహంగానే ఉన్నారనీ తెలిసింది. ఆవిడ అతడు తప్పిపోయాడనీ, వెతికి పెట్టమనీ చెప్పింది. మీరు వెతికేసరికి అతను చచ్చిపడి ఉన్నాడు. ఆల్‌రైట్! ఇప్పుడు రంగంలోకి పోలీసులు దూకారు. ఇందులో నేనేం చెయ్యాలి?" అన్నాడు.

"నీకు ఏమాత్రం తెలివితేటలున్నా ఉండొచ్చుగానీ అవి నీ తలకాయలో మాత్రం ఉన్నట్టు లేవు" అన్నది నిరూప ఘాటుగా.

నేను నవ్వాను. టోనీ కూడా నవ్వాడు.

"నేను లాయర్ని కాను" అన్నాడు టోనీ.

"ఇదిగో టోనీ! మనం కాస్త సీరి యస్‌గా ఉండి వ్యవహారం తెముల్చు కోవడం మంచిది. నా అభిప్రాయం ప్రకారం నా క్లయంట్ ఛాయాదేవి ఈ హత్య చేసిందనుకోను. కానీ ఏవో కారణాలవల్ల ఆమె నిజం చెప్పడం లేదు. ఆ కారణాలేవో నాకు అంతుచిక్కడం లేదు. అంతమాత్రంచేత ఆమె ఈ హత్య చేసిందనడం కుదరదు. అందువల్ల ఆమెను విడిపించడం మన కర్తవ్యం. అందుకు ఈ హత్య వెనక ఉన్న నిజానిజాలు గ్రహించాలి. కనుక మనమందరం వెనువెంటనే ఇక్కడ నుంచి బయటపడి అన్ని మార్గాలూ అన్వేషించి ఈ కేసును పరిష్కరించాలి... ఇక్కడే నీ సహాయం అవసరం టోనీ" అన్నాను.

"నాకిప్పటికి అర్థం అయింది. ఇంతకూ మనం మన వేట ఎక్కడ, ఎలా ప్రారంభించాలి?" అన్నాడు.

"అదే - కోటీరూపాయల క్వెశ్చన్" అన్నది నిరూప.

అంతలో నా బల్లమీద ఇంటర్‌కమ్ మోగింది. రిసీవర్ అందుకున్నాను. అవతలి నుంచి గ్లో నిరూప కోసం ఎవరో పురుషుడు ఫోన్‌చేశాడనీ, ఎవరని అడిగితే చెప్పడం లేదనీ అంది. అతను లైన్లో ఉండేలా చూడమని, నిరూపకు సంగతి చెప్పాను.

నిరూప నా గదిలోంచి తన గదిలోకి గబగబా వెళ్ళింది. తనకు వచ్చిన ఫోన్ కాల్స్ అన్నీ ఆమె తన గదిలోకి వెళ్ళి గానీ అందుకోదు. అందుకు కారణాలు ఆమె చెప్పలేదు. నేను అడగాలేదు. బోలెడు ఫీజు ముట్టితేగానీ నేను అవతలి వాళ్ళ విషయాలలో జోక్యం కలగజేసుకోను కనుక నిరూప ఫోన్‌కాల్స్ గురించి నేను కల్పించుకోలేదు. రెండు నిమిషాల తర్వాత ఆమె తిరిగి వచ్చింది. ఆమె దేన్ని గురించో తీవ్రంగా ఆలోచిస్తున్నట్టు కని పించింది.

"ఏమిటి నిరూపా! భయపడినట్టు న్నావ్?" అని అడిగాడు టోనీ. నిరూప కూచుని, ఒక క్షణం కళ్ళు మూసుకుని ఊపిరి పీల్చుకుంది. కళ్ళు తెరిచి "ఎవడో జోకర్! ఈ కేసు గురించి మన ఇద్దరినీ హెచ్చరించాడు. ఈ కేసు గురించి ఇంకేమన్నా చేస్తే..." అనబోతుండగా టోనీ అడ్డుతగిలి -

"ఏం చేస్తాడట?" అని తీవ్రంగా అడిగాడు.

"అతను వివరాలు చెప్పలేదు. బహుశా మళ్ళీ ఫోన్ చేస్తాడేమో!" అంది నిరూప.

"'మనం చంటిపాపలమూకాము, అను భవంలేనివాళ్ళమూ కాము' అని అత గాడికి తెలీదులా ఉంది" అన్నాన్నేను.

"దట్స్ ది స్పిరిట్" అన్నాడు టోనీ పిడికిలి బిగించి, చెయ్యి పైకెత్తిపట్టి.

"నిరూపా! టెలిఫోన్ డిపార్ట్‌మెంట్ లోని మీ ఫ్రెండ్ నుంచి ఏదయినా వర్తమానం వచ్చిందా?"

"లేదు. ఆమెతో నిన్న సాయంకాలం మాటాడినప్పుడు మరికాస్త వ్యవధి కావాల న్నది. అందులోనూ మనం ఇచ్చిన నెంబర్‌లో ఉన్న అంకెలు ఎక్కువ కావడంతో చాలా శ్రమపడాలట. ఆమెతన స్నేహితులకుకూడా చెప్పిందట. విషయం తెమిలిన వెంటనే మనకు చెప్పమన్నాను" అన్నది నిరూప.

''మంచిది!'' అన్నాను నేను-తర్వాతి అడుగు ఎటు వెయ్యాలో ఆలోచిస్తూ.

గడియారంవైపు చూశాను. నాలుగు కావడానికి ఇంకా ఇరవైనిమిషాలు

న్నాయి. రోజు కరిగిపోవస్తున్నా కేసు విషయం ఏమీ తేలలేదు. శాంతారాం హత్య విషయంలో ఆరాలు తియ్యడానికి ఏం చెయ్యాలో, ఎటు వెళ్ళాలో స్పష్టం కాలేదు. హత్య ఎందుకు జరిగిందో ఊహ మాత్రంగా కూడా నాకు అంతుచిక్క లేదు. మామూలుగా అయితే హత్యకేసు గురించిన కాగితాలు మొదటిసారి చదవ గానే ఆ హత్య ఎందుకు జరిగిందో, ఎలా జరిగిందో తట్టేది. ఈ కేసులో అంతా అగమ్యగోచరంగా ఉంది. అందుకు నా క్లయంట్ ఛాయాదేవి అబద్ధాలు చెప్పడం మాకు,సాయంచెయ్యకపోవడంకూడాతోడ యింది. లాయర్‌గా రాణించాలంటే ఇలా రకరకాల క్లయంట్లనూ తట్టుకోవాల్సిందే!

టోనీ, నేనూ చిక్కని చక్కని కాఫీ తాగి, మిక్సెడ్ ఫ్రూట్ జామ్ పూసిన కరకరలాడే బిస్కట్లు తిని ఆఫీసునుంచి బయలుదేరాము.

మెయిన్‌రోడ్‌కువెళ్ళి అక్కడ విరామం లేకుండా కంటిన్యువస్ షోస్ ప్రదర్శించే సినిమా థియేటర్‌కు వెళ్ళాము. అదేదో బ్రిటిష్ చిత్రం. అందులో ప్రపంచ ప్రఖ్యాత హాస్యనటుడు ఒకాయన ఉన్నాడు. అయినా ఆ సినిమా హాస్యా నికి ఎంతో దూరంగా నీరసంగా చప్పగా ఉంది. హాలు సగంపైగా ఖాళీగానే ఉంది. ప్రేక్షకులలో చాలామంది కాలేజీ విద్యార్థినీ విద్యార్థులే! వాళ్ళు సినిమా చూడడంకన్నా పరస్పర 'స్పర్శ' సుఖాన్ని అనుభవించ డంలో ఎక్కువ ఆసక్తి చూపిస్తూ కని పించారు. మా పక్కన కూచున్న ఒక విలాస పురుషుడు చిత్రమైన ధ్వని ఏదో చేశాడు. టోనీ ఆ ధ్వని విని నా చెయ్యి

 

పట్టుకోబోయాడు. నెమ్మదిగా అతణ్ని వారించాను. నేను అలాంటి స్పర్శా సుఖాలు అనుభవించే స్థాయిని దాటి ఎన్నిరోజులయిందోకదా!

ఆరుగంటల ప్రాంతంలో థియేటర్ లోంచి బయటపడి మళ్ళీ మా ఇంటికి చేరుకున్నాము. టోనీకి కూడా కలిపి వంట చెయ్యమని తిల్లీకి పురమాయిం చాను.

* * *

ఆ తర్వాతి రోజు ఉదయం నేను లేచే సరికే ఆలస్యమయింది. టోనీ, నేనూ బ్రేక్‌ఫాస్ట్ తీసుకునేసరికి తొమ్మిదయింది. చెరినాలుగు బ్రెడ్ స్లైస్‌లు,రెండేసి ఫ్రైడ్ ఎగ్స్ పట్టుకొచ్చింది తిల్లీ. తన వాటా గుడ్లతోపాటు మరో గుడ్డు కూడా తిన్నాడు టోనీ.

"సాగరీ! మీ వంటలక్క చక్కగా, పొందికగా బాగుంటుంది" అన్నాడు.

"ఎందుకన్నా మంచిది. దూరంగా ఉండు. ఆమె తన అందచందాలు తన కాబోయే భర్త కోసం దాచి ఉంచింది!" అన్నాను.

"అంటే-అంత పాతకాలం మనిషన్న మాట... పోనీ తాము చెప్పకూడదూ?" అన్నాడు టోనీ.

"టోనీ! తిల్లీ గొడవ నీకెందుకు చెప్పు? ఆమె జోలికి వెళ్తే సినిమాల్లోలాగా 'నన్ను ముట్టుకోవాలంటే నా బొందిలో ప్రాణం ఉండగా జరగదు' అని ఓ బరువైన డైలాగ్ చెప్పగలదు." అన్నాను.

"మిమ్మల్ని ఎట్లా అర్థం చేసుకోవాలో తెలియదు!" అని భుజాలెగరవేశాడు టోనీ. వెంటనే నోరు పెద్దగా తెరచి ఆవలించి కుడి మోచేయి గోక్కోవడం మొదలుపెట్టాడు.

అతని ధోరణి చూస్తే వెంటనే కదిలేట్టు

కనిపించలేదు. అవతల నాకు ఆఫీసుకు వేళ మీరిపోతున్నది.

అతణ్ణి లాక్కొని ఆఫీసుకు చేరేసరికి పదకొండు దాటింది. ఏదో పాత కేసుకు సంబంధించిన పత్రాలు దాఖలు చెయ్యడానికి నిరూప కోర్టుకు వెళ్లిందట. నా బల్లమీద ఉత్తరాల కట్ట ఒకటి పెట్టిఉంది. ఆ ఉత్తరాలన్నీ చదివి నేను తగిన చర్యలు తీసుకోవాలి.

టోనీ రిసెప్షన్‌లో కూచుని పొందికగా ఉండే మా టెలిఫోన్ ఆపరేటర్ ఇర్మాను చూస్తూ కూచున్నాడు. ఇర్మా భర్త మల్లయుద్ధవీరుడు. అందువల్ల టోనీ మూలంగా ఆమెకు ఎటువంటి ఆపదా రాదన్న ధైర్యంతో అతణ్ణి అక్కడ ఉండనిచ్చాను!

నిరూప ఒక చీటీ రాసిపెట్టి వెళ్లింది. నన్ను కలుసుకోవడానికని గోపాల్ వచ్చాడట. నా కోసం కాచుకు కూచుని నేను రాకపోయేసరికి నిరూపను కలుసుకున్నాడట. అతనికి రాత్రి ఇంటికి వెడుతున్నప్పుడు తనను ఎవరో నీడలా వెన్నంటుతున్నట్టుఅనుమానంగా ఉందట. మొదట వాళ్ళ గురించి తాను పట్టించుకోలేదటగానీ ఆ తర్వాత భయంవేసిందట. కనుక వాళ్ళ గురించి నేను ఏదయినా చేస్తే బాగుండునట. అదీ సంగతి!

చీటీ చదువుకుని వెంటనే గోపాల్‌ను కలుసుకుని అతడినుంచి అసలు సమాచారం రాబడితే బాగుండుననుకున్నాను. అతనుకూడా తన చెల్లెలిలాగా అబద్ధాలు చెబుతున్నాడేమో తెలియదుకదా మరి! ఇర్మాకుచెప్పి నర్సరీస్కూల్‌కు ఫోన్‌చేసి గోపాల్ ఉన్నాడేమో కనుక్కోమన్నాను.

అయిదు నిమిషాలు గడిచాక ఇర్మా నాకు ఫోన్‌చేసి "మేడమ్! గోపాల్‌గారు లేరట! గోవర్ధనంగారని ఓ టైపిస్ట్ మాత్రమే ఉన్నారట..." అన్నది.

"ఇర్మా! నేనిప్పుడు అతనితో మాటాడదలచుకోలేదు. గోపాల్ ఇంటి అడ్రెస్, అతనికి ఇంట్లో ఫోన్ ఉంటే ఆ నెంబర్ కనుక్కో! క్విక్..." అన్నాను.

"అలాగేనండీ!" అన్నది ఇర్మా.

ఆఫీసుకుర్రాడు రాజు ఒక కప్పు కాఫీ, దాంతోబాటు ఇర్మా పంపిన చీటీ పట్టుకు వచ్చాడు. అందులో గోపాల్ అడ్రెస్, ఫోన్ నెంబర్ ఉన్నాయి.

ఆ నెంబర్‌కు డయల్ చేశాను – నా బల్లమీద ఉన్న రెండవఫోన్ నుంచి. ఈ ఫోన్ ఎక్స్‌చేంజ్ ద్వారా వెళ్లదు గనుక ఇర్మా ఆ సంభాషణ వినే అవకాశం ఉండదు. అవతల ఫోన్ మోగిన కాసేపటికి ఒక స్త్రీ కంఠం పలికింది.

"హలో! గోపాల్‌గారు ఉన్నారా?" అన్నాను.

"అవతల మాటాడుతున్న దెవరు?"

ఆ గొంతును బట్టి ఆమె అక్కడ పనిమనిషో, వంటమనిషో అయి ఉంటుందనుకున్నాను.

"నేను ఛాయాదేవి లాయర్‌ని. మీ అయ్యగారితో మాట్లాడాలి. ఆయన ఉన్నాడా అక్కడ? చాలా అర్జెంటు..."

"మీ పేరు?"

"ఇదిగో! నీవు ఎవరయినా సరే... ఫోన్ అవతల పెట్టి వెళ్లి మీ అయ్యగార్ని పిలు త్వరగా" అని గర్జించాను. జవాబుగా అవతల ఫోన్ దబుక్కుమని పెట్టిన చప్పుడు వినిపించింది!

నేను రిసీవర్ యథాస్థానంలో పెట్టేసి బల్లమీద ఉన్న ఉత్తరాలను తీసి చూడటం మొదలుపెట్టాను. అన్నీ మామూలు ఉత్తరాలే. అవన్నీ నిరూప చూసుకొంటుందిలెమ్మని వదిలి పెట్టేశాను.

అంతలో ఫోన్ మోగింది. రిసీవర్ తీసుకోగానే- "అవుట్ సైడ్ కాల్" అన్నది ఇర్మా.

"సాగరిగారూ! ప్లీజ్ ... వెంటనే వస్తారా నర్సరీకి? పోలీసులు నా భర్త కోసం ఇక్కడ గాలిస్తున్నారు. ఆయనేమో ఇక్కడ లేరు. ఎక్కడికి వెళ్ళారో తెలియడంలేదు" అన్నది అవతలి కంఠం.

"మీ భర్తా?" అన్నాను ఆశ్చర్యంగా.

"అవును... ఆయన...ఆయన ... గోపాల్‌గారు..."

నేను ఆశ్చర్యం పట్టలేకపోయాను. అవతలి కంఠస్వరం సారాది!




పోలీసులు గోపాల్‌ను ఒక లాడ్జిలో మారుపేరుతో తల దాచుకుని ఉండగా పట్టుకున్నారు. శాంతారాం హత్య జరగడానికి తోడ్పడ్డాడన్న నెపం మీద అతన్ని అదుపులోకి తీసుకున్నారు.

నిరూప, మా జూనియర్ శశికళ గోపాల్ తరఫున 'అపియరన్స్' దాఖలు చేశారు. శశికళ తండ్రి డిస్ట్రిక్ట్ జడ్జీగా పనిచేసి రిటైరయ్యారు. శశి మాతో మూడేళ్ళ నుంచి ఉంటున్నది. కులం, మతం అడ్డువచ్చి తన ప్రేమ పెళ్ళి చెడిపోవడంతో ఆమె పురుష ద్వేషిణిగానూ, రోజుకు ఇరవై నాలుగు గంటలూ పనిచేసే యంత్రంగానూ మారిపోయింది. ఆమె పిండిబొమ్మలా తెల్లగా,బొద్దుగాఉంటుంది. తనకు కనిపించిన ప్రతి 'లా' పుస్తకం చదువుతుంది.

గోపాల్‌ను విడిపించడానికి మేము దాఖలు చేసిన 'బెయిల్ అప్లికేషన్'ను నిరాకరించడంతో అతన్ని జైలుకు తీసుకు వెళ్ళిపోయారు. అతన్ని కలుసుకొని వివరాలు సేకరించడానికి నిరూప, శశి జైలుకు వెళ్ళారు. సాయంకాలం నా పనంతా పూర్తయే టైముకు ఇద్దరూ వగర్చుకుంటూ ఆఫీసుకు తిరిగి వచ్చారు.

ఇద్దరూ బాగా అలిసిపోయి, ఆకలిగా ఉన్నట్టు కనిపించారు. తినుబండారాలకు ఏర్పాటుచేసి-అవి వచ్చాకి తింటూ గోపాల్ చెప్పిన విషయాలను చర్చిస్తూ కూచున్నాము.

"సాగరీ! తనను ఎవరో వెంబడిస్తున్నారని గోపాల్ చెప్పాడని నీకో చీటీ రాసి పెట్టాను గుర్తుందా?'' అని అడిగింది నిరూప.

గుర్తుందన్నట్టు తల ఊగించాను.

"నిజానికి వాళ్ళు మఫ్టీలో ఉన్న పోలీసులు. గోపాల్ మీద నిఘావేసి ఉంచారనుకుంటాను. ఛాయాదేవిని అరెస్ట్ చేసినప్పుడే ఆమెకు గోపాల్ సాయపడి ఉండాలని పోలీసులు అనుమానించినట్టున్నారు. వాళ్ళ ఉద్దేశం అసలు గోపాలే హత్యచేసి ఉంటాడని...హత్య జరిగిన చోట అతని వేలిముద్రలు బోలెడన్ని కనిపించాయట! కత్తి మీద, మంచం అంచుల మీద, తలుపుల హాండిల్స్ మీద, టెలిఫోన్ మీద... ఇలా ఎక్కడపడితే అక్కడే అతని వేలిముద్రలున్నాయట!" అన్నది నిరూప.

"నిరూపా! గోపాల్ అక్కడికి వెళ్ళాడన్న దాంట్లో సందేహమేమీ లేదు. అతను




నా ఫోన్ అందుకుని జవాబు చెప్పాడు కదా! అతన్ని దాన్ని గురించి అడిగావా?" అన్నాను.

"అడిగాము...అడిగాము" అన్నది శశి-తనకు సహజమైన పురుష స్వరంతో బొంగురుగా.

"మరి అందుకు అతను ఏమన్నాడు?"

"అదే చెప్పబోతున్నా సాగరీ! అతను దాన్ని కాదనలేదు. అయితే ఆ ఫోన్‌కాల్ చేసింది నీవని మాత్రం అతనికి చెప్పలేదు. తను, తన చెల్లెలు అక్కడికి వెళ్ళినమాట వాస్తవమేనటగానీ వాళ్ళు వెళ్ళేసరికే శాంతారాం చచ్చిపడి ఉన్నాడట! అతను చెప్పిందీ, ఛాయాదేవి చెప్పిందీ దాదాపు ఒక

రకంగానే ఉంది" అన్నది నిరూప.

"అతను శాంతారాం గురించి ఏం చెప్పాడు?"

"పెద్దమనుషులెందరితోనో శాంతారామ్‌కు శత్రుత్వం ఉందట. అతనికి ఆడవాళ్ళన్నా, తాగడమన్నా సరదా అట! ఛాయాదేవి శాంతారామ్‌తో సంబంధమున్న ఎందరో స్త్రీలలో ఒకామె అని గోపాల్ స్పష్టంగా చెప్పలేదు. తన చెల్లెలి మానం, మర్యాద వగైరా కాపాడ్డం అతని బాధ్యతగదా మరి" అన్నది నిరూప.

"ఐసీ! కానీ నిరూపా, అతను తన చెల్లెలితోబాటు అక్కడికి ఎందుకు వెళ్ళినట్టు?" ప్లేటులో మిగిలిన చివరి దోసె ముక్కను నోట్లో పడేసుకుంటూ ప్రశ్నించాను.

"అతని సమాధానం చాలా సింపుల్‌గానూ, చాలా గొప్పగానూ ఉందిలే! అలవాటు ప్రకారం—అంటే ఆమె ఎక్కడికి వెడితే ఆమెతోబాటుగా వెళ్ళే అలవాటు ప్రకారం అక్కడికీ వెళ్ళాడట!"

"అయితే ఆమె మగ స్నేహితుల ఇళ్ళకు కూడా వెడతాడన్న మాట!"

"మన కేసుకు అదేమంత పనికివచ్చే అంశం కాదు. వాళ్ళ వ్యక్తిగత జీవితాల గురించి మనం తలలు బద్దలు కొట్టుకోవలసిన అవసరంలేదు. ఇంతకూ విషయం ఏమిటంటే గోపాల్, ఛాయాదేవీ కలిసి అక్కడికి వెళ్ళారు. శవాన్ని చూశారు. మన తలనొప్పి పెరగడానికి అక్కడ అవీ ఇవీ తాకి వచ్చారు.... అదీ అసలు సంగతి" అన్నది నిరూప.

"నీరూ! మనం ఏం చెయ్యాలో నేను ఆలోచించి పెట్టాను. మన క్లయింట్లు ఇద్దరూ చాలా ఘోరంగా అబద్ధమాడేస్తున్నారు... అదిసరే! సారా తనను డేవిడ్ భార్యగా సారా డేవిడ్‌గా చెప్పుకుందని చెబితే గోపాల్ ఏమన్నాడు?" అని అడిగాను.

"అది విన్నప్పుడు నీవెంతగా ఆశ్చర్యపడ్డావో అతనూ అంతగానే ఆశ్చర్యపడ్డాడు"

"అంత పచ్చి అబద్ధమన్నమాట! నేనప్పుడే అనుకున్నాను..." అంటూ కాఫీ కప్పు అందుకున్నాను.

"కావచ్చు. నీ ఊహ సరైనదేనని తేలింది!"

"ఛాయ చెప్పిన ప్రకారం చూస్తే ఈ సారా డేవిడ్ శీలం అంత మంచిదికాదుట కదా!"

"అది ఒక ఆడమనిషి గురించి ఇంకొక ఆడమనిషి అభిప్రాయం. ఇంతకీ శీలం అంటే ఏమిటి?" గడుసుగా అడిగింది నిరూప.

"మన అభిప్రాయాలు మనవి" అని ఆ మాట అక్కడే తుంచి చిరునవ్వు నవ్వాను.

సంఘంలో ఉన్న నీతి - పురుషుడు రూపొందించింది. స్త్రీలకు వ్యతిరేకమైనది. ఒక పురుషుడు పదిమంది స్త్రీల వెంటబడి వాళ్ళతో సంపర్కం పెట్టుకుంటే అతని 'మగటిమి'ని మెచ్చుకుని ఆరాధనా భావంతోనూ, ఈర్ష్యతోనూ చూసే లోకమే అటువంటి పని చేసే స్త్రీని క్షమించదు. 'వ్యభిచారిణి' అనీ, 'చెడిపోయిన మనిషి' అనీ చెబుతుంది! పురుషాధిక్యం ఉండే సంఘంలోని స్త్రీల పరిస్థితి ఇది!

"మంచిది నిరూపా! ఇవాల్టికి కొలువు చాలిద్దాం. నాకు అలసటగా ఉంది. మీరూ అలసిపోయి ఉన్నారు. మనం ఏం చెయ్యాలో ఆలోచించి పెట్టానని చెప్పాను కదా... ఇంకా ఇదమిద్ధంగా ఏదీ తేల్చుకో





లేదు. రాత్రికి వాటి గురించి ఇంకా బాగా ఆలోచిస్తాను. నీకు ఆ తర్వాత ఫోన్ చేస్తాను. సరేనా?" అని, "ఇంటికి వెడతావా?" అని అడిగాను.

"ఏమో!" అంటూ కన్ను గీటింది నిరూప కొంటెగా.

"సరే! నేనూ ప్రయత్నించి చూస్తాను. నీవు రాత్రికి దొరక్కపోతే రేపు ఉదయం ఇక్కడే చెబుతాను" అని కొంటెగానే జవాబు చెప్పి బయలుదేరాను.

* * *

రాత్రి తొమ్మిది గంటలయ్యాక తన ఫ్రెండ్ తాలూకు డొక్కు కారెక్కి టోనీ మా ఇంటికి వచ్చాడు. ఆ కారు చూడ్డానికి రంగు వెలిసిపోయి వెలవెలబోతున్నా దాని ఇంజన్ మాత్రం మంచి కండిషన్‌లో ఉంది. 'నేను అనుకున్న పనికి ఆ కారు బాగా ఉపయోగిస్తుంది' అనుకున్నాను.

టోనీ, నేనూ ఇద్దరమూ మా ఇంట్లోని చలువరాతి బల్లముందు కూచుని-తిల్లీ చేసిన చపాతీలు తినడం మొదలుపెట్టాము. చపాతీల కోసమని ఐదారు రకాల కూర గాయలతో తిల్లీ కూర చేసి పెట్టింది. ఎలాగూ బయటికి వెళ్ళాలికదా అని నేను రెండు చపాతీలే తిన్నాను. టోనీ పది చపాతీలూ, అరకిలో కూరా లాగించి-తదేక దీక్షతో తిల్లీని చూస్తూ కూచున్నాడు.

తినడం అయ్యాక నేను నీలిరంగు పంట్లాం, దానిమీద నల్లని సిల్క్ టాప్ తొడుక్కున్నాను. రాత్రిళ్ళు 'పత్తేదారీ' పనిమీద వెళ్ళినపుడు నేను ఈ దుస్తులే ధరిస్తుంటాను. ఇవయితే కదలడం తేలిక. పైపెచ్చు ఎవరిదృష్టినీ ఆకర్షించవు. టోనీ ముదురు గోధుమ వన్నె చొక్కా తొడుక్కుని దాన్ని గోధుమ వన్నె పాంట్‌లో ఇన్‌సెర్ట్ చేసుకున్నాడు. నడిచినప్పుడు చప్పుడు కాకుండా ఉండటంకోసం మెత్తని రబ్బరుబూట్లు ధరించాడు. ఇలాంటి పనుల మీదవెళ్ళినప్పుడు వాడే పెట్టెను తనవెంట తెచ్చుకున్నాడు. ఆ పెట్టెలో తాళాలూ, తలుపులూ తెరవడానికి పనికివచ్చే రకరకాల పనిముట్లూ, ఆయుధాలూ ఉంటాయి.

ఒక గంట తర్వాత నేనూ, టోనీ బయలుదేరాం. టోనీ మా వేటకు గురి కావలసిన ఇంటి అడ్రసు ఒక బ్లాటింగ్ పేపర్‌మీద రాసుకున్నాడు.

మా గమ్యానికి ఫర్లాంగు దూరంలో కారు ఆపి, కారులోనే కూచున్నాం. చుట్టూ అంతా చీకటి. అక్కడక్కడా ఇళ్ళలో మినుకుమినుకుమంటూ నైట్ లాంప్స్ వెలుగుతున్నాయి. అంతకు మించి వేరే వెలుతురు లేదు. చీకట్లో కుక్కలు మొరుగుతూ ఉన్నాయి. దూరాన రోడ్డు పక్కగా చెట్టుకింద ఒక కారు ఆపి ఉంది. ప్రేమికులేమో! ఇద్దరూ వెనుక సీట్లోనే ఉన్నట్టున్నారు...!

టోనీ తన చేతులకు నల్లని గ్లోవ్స్ ధరించి, నాకూ ఒక జత ఇచ్చాడు.

మేము జాగ్రత్తగా కారులోంచి దిగి నెమ్మదిగా మా గమ్యం వైపు నడిచాం. టోనీ నన్ను ఆనుకుని నడిచాడు. ఎవరన్నా చూస్తే ఆలస్యంగా ఇంటికి వెడుతున్న ప్రేమికులలాగా కనిపించడానికి అదొక పద్ధతి.

మొత్తంమీద ఆ అపార్ట్‌మెంట్స్ చేరుకున్నాము. అదొక నాలుగంతస్తుల భవనం. మాకు కావలసిన 234 రెండో అంతస్తులో ఉంది. ఒకరినొకరం ఆనుకునే, మెట్లెక్కి రెండో అంతస్తుకు వెళ్ళాము. బాగా రాత్రి కావడం వల్ల లిఫ్ట్

తాళం వేసి ఉంది. అందువల్ల మేము మెట్లెక్కి వెళ్లడానికి వీలు చిక్కింది.

234కు తాళం వేసి ఉంది. తలుపు పక్కన ఒక పోలీస్ కానిస్టేబుల్ కూచుని నిద్రను దూరం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు.

మాకు ఆ దృశ్యం ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. నా గుండె దడదడా కొట్టుకోవడం మొదలుపెట్టింది. ఆసరాకోసం టోనీ భుజాన్ని పట్టుకున్నాను. అతను చిరునవ్వు నవ్వి, వెనుకగా ఉన్న వసారా వైపుగా తీసుకువెళ్ళాడు. వెనుకవైపు తలుపు లోపల నుంచి గడియపెట్టి ఉంది. టోనీ అటూ ఇటూ చూసి తన పెట్టెలోంచి ఏదో పరికరం తీశాడు. అది నేను జపాన్ నుంచి పట్టుకొచ్చిన ఎలక్ట్రానిక్ కటర్. అది ఎలాంటి తలుపునయినా శబ్దం లేకుండా కోసేస్తుంది. రెండు నిమిషాలలో టోనీ తలుపులో రంధ్రాలు చేసి గడియలు తీసేశాడు. ఇద్దరమూ లోపలికి వెళ్ళాం. మళ్ళీ గడియలు పెట్టేశాము. కాసేపు ఆ చీకట్లో నిలబడ్డాము. నాకు చెమటలు కమ్ముతున్నాయి. అరచేతులూ, వీపూ తడిసిపోతున్నాయి. నేను ఆ పక్కన ఉన్న చిన్న స్టూలు మీద కూచున్నాను. టోనీ చీకటిని చీల్చుకుని లోపలికి వెళ్ళాడు. నేను చెమటలు కక్కుకుంటూ లేనిదీ పోనిదీ ఆలోచించుకుంటూ కూచుండిపోయాను.

నాకు యుగంలా తోచినంతసేపు గడిచిన తర్వాత టోనీ నా దగ్గరికి వచ్చాడు. టోనీ కూడా బాగా ఎక్సయిట్ అయినట్టు కనిపించాడు. అతను భుజం మీద చెయ్యి అన్చి, గుసగుసలాడసాగాడు.

"సాగరీ! ఈ ఇంట్లో అట్టే వస్తువులేవీ లేవు. చాలా గదులు ఖాళీగా ఉన్నాయి. ఇక్కడ తరచుగా ఎవరూ ఉండరనిపిస్తున్నది" అన్నాడు.

"అంటే?" అన్నాను.

"వంటింట్లోకి వెళ్లాను. అక్కడ పాత్రలు కూడా లేవు. గాస్ స్టవ్, సిలిండర్ ఉన్నాయి. అయితే గాస్ లేదు. ఆఖరికి గాస్ వాసన కూడా లేదు" అన్నాడు.

"ఓహో!"

"నా ఉద్దేశం ప్రకారం ఈ ఫ్లాట్‌ను మరెందుకో వాడుతున్నారనిపిస్తున్నది. నేను వెళ్లి తక్కిన గదులు కూడా చూసి వస్తాను. నువ్వు ఇక్కడే కూచో!" అన్నాడు టోనీ.

"ఒంటరిగానా?" అని అడిగాను.

"సాగరీ! నీకు చీకటంటే భయమని కథలు చెప్పకు!" అని వెళ్ళిపోయాడు టోనీ. కాసేపు గడిచాక అతను తిరిగి వచ్చాడు.

"ఇంట్లో ఎవరూ లేరనుకుంటాను! పడకగదిలో మాత్రం చాలా విశేషాలున్నట్టున్నాయి. మనకు అవసరమైనదేదైనా అక్కడ కన్పించవచ్చునేమో! వీలయినంతత్వరగా వెదుకుదాం పద! మనం ఇక్కడ ఎక్కువసేపు ఉండటానికి కుదరదు. అందువల్ల నీవుకూడా నావెంట రా!. ధైర్యంగా రావాలి. నెమ్మదిగా నడు. అంతగట్టిగా ఊపిరి పీల్చకు" అని నాకు హితబోధ చేశాడు టోనీ.

"టోనీ! నన్ను భయపెడదామనుకుంటున్నావా? నేను నీవెంట ఇలా రావడం ఇది మొదటిసారి కాదుకదా!" అన్నాను కొంచెం దురుసుగా.

టోనీ బదులుచెప్పకుండా నా చెయ్యి

పట్టుకొని ఆ పడకగదివేపు దారితీశాడు. ఎక్కడ ఏముందో, తెలుసుకోవడానికి వుదరనంత చీకటిగా ఉంది. తూర్పువేపు గోడపక్కనే ఒక మూలగా డబుల్ బెడ్ ఒకటి కనిపించింది. టోనీ ఆ పక్కనే ఉన్న బల్లదగ్గరికి నెమ్మదిగా వెళ్ళి, తన జేబులోంచి పెన్‌టార్చ్ తీసి ఆన్‌చేశాడు.

ఆ బల్లపై చెక్క మూతలాగా ఉంది. దాన్ని పైకెత్తాడు టోనీ. ఆలోపల పావురాల గూళ్ళలాగా సొరుగులు ఉన్నాయి. వాటిలో ఏవో కాగితాలున్నాయి. టోనీ ఒక్కొక్కి బొత్తిలాగి నాముందువేసి, నేను వాటిని చూడటానికి వీలుగా టార్చ్ పట్టుకొన్నాడు. అవి మాకు అంతగా పనికి రాని కాగితాలు...ఏవో ఆహ్వానపత్రికలు, ఎలక్ట్రిక్ బిల్స్, ఫోన్‌బిల్స్ మరేవేవో కాగితాలు.

ఒక సొరుగు తాళంవేసి ఉంది. టోనీ తన పెట్టెలోంచి ఏదో పనిముట్టు తీసి చకచకా తాళం తీశాడు. అతను ఆ సొరుగులోంచి ఒక కవరు తీశాడు. ఒక వేపు చించిఉన్న ఆ కవరులోని కాగితాలను బయటికితీసి చూశాడు.

"సాగరీ! బూతు బొమ్మలు...హాట్ స్టఫ్" అన్నాడు గుసగుసలాడుతూ.

"నన్ను చూడనీ!" అన్నాను.

టోనీ ఆ ఫొటోలు చూపించాడు. మొత్తం ఆరున్నాయి. వాటిలో గోపాల్, ఛాయాదేవి ఒంటి మీద నూలుపోగు లేకుండా కౌగిలింతలో... పక్కమీద పడుకుని కనిపించారు!

* * *

గంట తర్వాతఏ అవాంఛనీయ సంఘటనా జరగకుండా క్షేమంగా మా ఇంటికి తిరిగి వచ్చాం. అపార్ట్‌మెంట్స్‌నుంచి దూరంగా వచ్చేస్తున్నా మా గుండెలు అదరడం తగ్గలేదు. మేము రోడ్డుమీదికి వచ్చాక 234ముందు కూచున్న పోలీసు లేచివెనక వసారావేపు వెళ్ళడం కనిపించింది.

'కొద్దిలో తప్పిపోయింది' అనుకుని కొంచెం అదిరిపడ్డాను నేను. టోనీమాత్రం ఏ మాత్రమూ చలించకుండా నిబ్బరంగా నడుస్తున్నాడు.

కారెక్కిన తర్వాత గ్లోవ్స్‌తీసి టోనీ పెట్టెలోపడేశాం. పెట్టెలో గోపాల్ అపార్టుమెంట్‌లోంచితీసుకొచ్చిన ఫొటోలురెండున్నాయి!చట్టానికివ్యతిరేకమేమోఅంటారా? కాదనుకుంటాను. ఎందుకంటే పోలీసులకు ఆఫొటోలసంగతి ఇంకా తెలిసినట్టు లేదు. లేకుంటే ఆ ఫొటోలు ఆ బల్ల సొరుగులో పడి ఉండవుకదా! అంటే సాక్ష్యాలుగా వాటి విలువేమో ఇంకా తెలియనట్టే. అదీ కాక మేము అన్ని ఫొటోలూతీసుకురాలేదు. హత్యగురించిన నిజం తెలుసుకోవడానికి మేము తెచ్చుకున్న రెండు ఫొటోలు పనికి వస్తాయేమోనని నా అనుమానం. ఈ కారణాలచేత వాటిని తీసుకురావడం నాకు చట్టానికి వ్యతిరేకమయినదిగా కనిపించలేదు.

ఇంటికివెళ్ళి హాయిగా స్నానంచేసి నా టేబుల్‌లైట్ వెలుగులో ఆ ఫొటోలను పరీక్షించి చూశాం. ఫొటోలో వాళ్ళ తలలవెనుక నీడలు పడలేదు. అంటే ఫ్లాష్ లేకుండా ఫొటో తీశారన్నమాట! ఉన్న వెలుగులో ఫొటోలు తీయడానికి పనికి వచ్చే విలువయిన జపానీస్ కెమేరా ఏదో ఉపయోగించి ఆ ఫొటోలు తీసి ఉండాలి. ఫొటోలు ఎంతో స్పష్టంగా ఉన్నాయి. బహుశా వాటిని ఫొటోగ్రఫీలో ఆరితేరిన వారెవరో తీసి ఉంటారని ఊహించాం. ఫొటోల్లోని పరుపు మామూలుగా ఎన్నో ఇళ్ళల్లో కనిపించేదే. దానికంటూ నగిషీలు,





ఫోమ్ పరుపులూ ఏవీలేవు. అంటే ఆ ఫొటోలు ఏ హోటల్ గదిలోనో తీసినవి కాదు. ఎక్కడో ఇంట్లో తీసిఉండాలి. ఎవరింట్లో తీసిఉంటారు? ఎవరు, ఎందుకు తీసిఉంటారు?




స్నానమూ, టిఫినూ పూర్తి చేసి టోనీ మా ఇంట్లోంచి బయలుదేరి మళ్ళీ కనిపిస్తానని వెళ్ళిపోయాడు. అడపాదడపా అతను సినిమాల్లో చిల్లరమల్లర వేషాలు వేస్తూ ఉంటాడు. నైట్‌క్లబ్ దృశ్యాలు, ముష్టి యుద్ధాలు, కార్ ఛేజ్ దృశ్యాలు మొదలయిన వాటిలో అతను కనిపిస్తూవుంటాడు. వాటి ద్వారా సులభంగాలభించే డబ్బు, పబ్లిసిటీ వగైరాలన్నీ అతనికి ఇష్టం!

నేను ఆఫీస్ చేరుకునేటప్పటికి పదకొండయింది. నిరూప కోర్టుకు వెళ్ళిందట. అంటే ఒంటిగంటకుగానీ రాదన్నమాట. ఆ పూట విడాకులకేసేదో ఉంది. నిరూప ఆ కేసు వాదిస్తున్నది. మాకు విడాకుల కేసులు ఎక్కువగా తగులుతూవుంటాయి. నిరూప వాటిపని పడుతూవుంటుంది. నేను హత్యలు, ఫోర్జరీలు మొదలయిన కేసులలోనూ తక్కిన ముఖ్యమైన విషయాలలోనూ; ఆసక్తి చూపిస్తూఉంటాను. మాకు వచ్చే కొద్దిపాటి సివిల్ కేసులను శశికళ చూస్తూవుంటుంది.

జవాబులు రాయవలసిన ఉత్తరాలు ఎన్నో నాకోసం ఎదురుచూస్తున్నాయి. దాంతో గంటసేపు గ్లోరియాకు జవాబులు డిక్టేట్ చేస్తూ ఉండిపోయాను. మధ్యమధ్య స్నేహితుల దగ్గరినుంచీ, క్లయింట్లనుంచీ ఫోన్‌కాల్స్ వచ్చాయి. ఉత్తరాలు పూర్తయి గ్లో వెళ్ళేసరికి నాకు బాగా ఆకలి వెయ్యడం మొదలయింది. ఆకలికితోడు అలసటగా కూడా ఉంది. రాత్రి సరిగా నిద్ర లేకపోవడంతో కళ్ళు మండుతున్నాయి. దగ్గరున్న రెస్టారెంట్ నుంచి భోజనం తెప్పించుకున్నాను.

భోజనం అయ్యాక సోఫాలో కూచుని విశ్రాంతితీసుకుంటుండగా కిళ్లీ నములుతూ నిరూప వచ్చింది.

"హలో సాగరీ! కబురేం లేదు. నీనుంచి... రాత్రంతా బిజీగా ఉన్నావా ఏమిటి?" అని అడిగింది – కళ్లు చికిలిస్తూ, నా పక్కన కూచుంటూ.

"బిజీగానే ఉన్నాను. కానీ నీవు అనుకున్నట్టు కాదు... అన్నట్టు నిరూపా! నీకోవిషయం తెలుసా?" అని అడిగాను. తెలీదన్నట్టు భుజాలెగరవేసింది నిరూప.

"మన క్లయింట్స్ ఛాయాదేవి, గోపాల్..."

"వాళ్ళకేమిటి?"

"వాళ్ళిద్దరూ మనం అనుకున్నట్టు అన్నా చెల్లెళ్ళు కాదు..."

నిరూపఆశ్చర్యంగాకూచుండిపోయింది.

"అదేమిటి?" అన్నది–కాస్త తేరుకుని.

ముందు రాత్రి బెసంట్‌నగర్‌కు వెళ్ళి సాధించుకు వచ్చిన ఫలితాల గురించి నిరూపకు వివరంగాచెప్పాను. కిళ్ళీ నమలడం కూడా మానేసి చిన్న పాపాయిలాగా శ్రద్ధగా కథ వింటున్నట్టు అన్నివివరాలూ విన్నది నిరూప. ఆసక్తికరంగా చెప్పడం

నా ప్రత్యేకతఅని అంటుంటుంది నిరూప.

"ఫెంటాస్టిక్ సాగరీ! మనం ఇన్నేళ్ళ నుంచి కలిసివున్నాం. కానీ ఇప్పటికింకా నీవు ఇవన్నీ ఎలా చెయ్యగలవో నాకు అంతుచిక్కడం లేదు. నీవు చెబుతున్నది వినడానికే భయంగా వుంది" అన్నది నిరూప.

"బహుశా ధైర్యం నాకు పుట్టుకతోనే అబ్బిందేమో'' అన్నాను.

"నీ వినయమే వినయమూ..." అంటూ చిలిపిగా నా తొడగిల్లిందినిరూప.

"సాగరీ!ఇంతకూఆ ఫొటోలు ఇక్కడ ఉన్నాయా, ఇంట్లోవున్నాయా?" అని ఆత్రంగా అడిగింది.

నా బ్రీఫ్ కేస్‌లోంచి ఆ ఫోటోలున్న కవరుతీసి, ఆమెకు ఇచ్చాను.ఆ ఫొటోలను చూసి నిరూపలో ఆశ్చర్యం, షాక్,ఆసక్తి అన్నీ ఒక్కసారిగా కలిగాయి. మరేవన్నా కొత్త అభిప్రాయాలు కలుగుతాయేమో చూడటానికి నేను ఫొటోలను పరిశీలనగా చూశాను.

"సాగరీ! నా కళ్ళను నేనే నమ్మలేక పోతున్నాను. అన్న... చెల్లెలు... నీవు కోపెన్‌హేగన్ నుంచి పట్టుకువచ్చిన పిక్చర్‌కార్డ్స్ ఉన్నంత బాగున్నాయిఇవి!" అని నిరూపఅంటుంటే నాకునవ్వువచ్చింది.

"సాగరీ!ఇలాంటి ఫొటోలుకొనడానికి ఎందరో అబ్బాయిలూ, అమ్మాయిలూ ఎంత డబ్బు ఖర్చు పెట్టడానికయినా వెనుకాడరనుకొంటాను. కానీ ఇంతకూ వీటిని ఎవరుతీసినట్టు? గోపాల్ పడకగది లోకి ఇవి ఎలా వచ్చినట్టు?''

"మిలియన్‌డాలర్స్ క్వెశ్చన్స్!నిరూపా నీ ప్రశ్నలకు సమాధానాలు తెలుసు కుంటే ఈ కేసు తెమిలిపోతుందనుకుంటాను" అన్నాను.

"ఎలా?'' అన్నది నిరూప.

"ఎలాగంటే ఇదమిత్థంగా చెప్పలేను. ఇప్పటికది ఊహ మాత్రమే. కాని బలమైన ఊహ! ముందు ఈ ఫొటోలు ఆ గోపాల్ అన్నయ్య అపార్ట్‌మెంటుకు ఎలా చేరుకున్నాయో చర్చించుకుందాం. బహుశా అతనే వాటిని బల్ల సొరుగులో ఉంచి తాళం వేసి ఉండాలి. అంటే వాటిని అతనికి ఎవరో ఇచ్చి ఉండాలి. ఎలా ఇచ్చి ఉన్నా 'శుభదిన ప్రేమకానుక'గా మాత్రం అయి ఉండదు. ఆ ఇచ్చిన వ్యక్తి స్త్రీ అయినా పురుషుడయినా వాటిని ఏదో ఒక ధరకు గోపాల్‌కు ఇచ్చి ఉండాలి!"

"అంటే బ్లాక్‌మెయిల్ అంటావా?''

"అవును నిరూపా! నా ఉద్దేశం అదే! మనకు తెలిసినంతమటుకు ఈ భయంకరమైన ప్రపంచంలో గోపాల్, ఛాయాదేవి అన్నాచెల్లెళ్ళుగా చలామణి అవుతున్నారు. అది మనకు ఆమె కనీసం వెయ్యిసార్లయినా చెప్పి ఉంటుంది. ఎవరో నిజం కనుక్కున్నారు. త్వరగా, సులభంగా డబ్బు సంపాదించడానికి గొప్ప అవకాశం దొరికింది అనుకుని ఉంటారు.వాళ్ళనుంచి డబ్బు రాబట్టడానికి.. ఆ మనిషి పేరు 'ఎక్స్' అనుకుందాం. 'ఎక్స్' వాళ్ళిద్దరూ కలిసి ఉండగా ఫొటోలు తీసి ఈ ఆట మొదలుపెట్టి ఉండాలి" అన్నాను.

"ఓకే! ఇక్కడిదాకా నీ ఆలోచన సబబుగానే కనిపిస్తున్నది. ఆ తర్వాత ఏమిటి?'' అని అడిగింది నిరూప.

'ఇంతకూ ఈ ఫొటోలు ఎక్కడ తీసినట్టు అన్నది తర్వాత ప్రశ్న. ఇక్కడే నేను స్పెకులేట్ చేస్తున్నాను. నిరూపా! ఈ ఫొటోలోని మంచాన్నీ,




పరుపునూ గుర్తుపట్టగలిగితే మనకు సమాధానం దొరికినట్లే'' అన్నాను.

''సాగరీ! ఫొటో తీసిన స్థలం ఛాయా దేవి ఇల్లయినా అయి ఉండాలి. లేకుంటే గోపాల్ ఇల్లయినా, శాంతారాం ఇల్లయినా అయి ఉండాలి. నీవన్నట్లు అది హోటల్ గది కాకపోవచ్చును. అటువంటి పరుపు



హోటళ్ళలో ఉండదనుకుంటాను'' అన్నది నిరూప.

''నీవు చెప్పింది నేను ఒప్పుకుంటా నమ్మాయ్! మనం గోపాల్ ఇంటిని వది లేయ వచ్చునుకుంటాను. ఎందుకంటే అక్కడున్నది డబుల్ బెడ్! చీకట్లోనే నేనక్కడికి వెళ్లాననుకో! అయినా ఆ

డబుల్ బెడ్‌ను చూడగలిగాను. కనుక మిగిలిన రెండిళ్ళ సంగతీ చూడాలి'' అన్నాను.

"ఆ మంచం శాంతారాం ఇంట్లో ఉన్నట్టు తేలితే మన పని అయిపోయినట్టే! శాంతారామ్‌ను చంపడానికి మన క్లయింట్స్‌కు తగిన కారణం ఉందని తేలిపోతుంది!''

"ఈ కత్తికి రెండువేపులాపదునుందని నాకూ తెలుసు నిరూపా! కాని అందు కోసమని మనం బెంగపెట్టుకోనక్కర లేదు. నాకు కావలసింది నిజాన్ని కనుక్కోవడం. మన క్లయింట్స్ నిరపరాధులని నా నమ్మకం. వాళ్ళు ప్రేమికులు కావచ్చు. అబద్ధాలకోర్లు కావచ్చు. కానీ హంతకులు మాత్రం కాదు'' అన్నాను.

"ఐ హోప్‌సో!'' అని భుజాలెగరవేసింది నిరూప.

"నిరూపా! ముద్దాయిల తరఫు లాయర్లుగా మనకు నేరం జరిగిన ప్రదేశాన్ని పరిశీలించే హక్కు ఉంది. అక్కడికి వెళ్ళడానికి రేపు అనుమతి తీసుకుందాం. రేపటిదాకా ఎందుకు? ఇవాళే వెళ్ళి ఆ పక్క సంగతి చూసొద్దాం" అన్నాను.

"ఓకే! అల్లే అగుగాక" అన్నది నిరూప.

* * *

ఆ సాయంకాలం నిరూప, శశికళ, నేను కారులో పుష్పనగర్‌కు వెళ్ళాము. నా బ్రీఫ్‌కేసులో ఆ ఫొటోలు అలాగే ఉన్నాయి. ఆ రాత్రి ఏకాంతంగా కూచుని వాటిని పరీక్షించాలనుకున్నాను.

శాంతారాం ఇంటి ముందున్న పోలీసు నన్ను చూడగానే గుర్తుపట్టి నవ్వి సెల్యూట్ చేశాడు. నగరంలోని క్రిమినల్ కోర్టులో మంచి ప్రాక్టీసున్న ఆడ లాయర్‌గా పోలీసులెందరికో నేను పరిచితురాలినే. ఆ కాన్‌స్టేబుల్ తలుపు తెరిచి పడకగదికి తీసుకువెళ్ళాడు.

గదిలో మంచం మాత్రమే ఉంది. పక్కదిండ్లు,తక్కిన పరుపులూ కెమికల్ ఎగ్జామినేషన్ కోసం తీసుకు వెళ్ళి నట్టున్నారు. అది మామూలు చెక్క ముక్కలు పేర్చి అమర్చుకునే మంచం. గదిని ఒకసారి పరీక్షగా చూసేసరికి ఆ నేలమీద పడి ఉండిన హిందూ నాగరికత గురించిన పుస్తకం కనిపించలేదు. నేను వచ్చి వెళ్ళాక పోలీసులో, మరెవరో దాన్ని తీసుకు వెళ్ళి ఉండాలనుకున్నాను.

నిరూప కళ్ళూ, నా కళ్ళూ ఒక క్షణం కలుసుకున్నాయి. ఆ క్షణంలో నిరూప కళ్ళతోనే ఆ మంచం గురించిన సందేశం అందజేసింది.

ఆ గదిలోని ఆ మంచం – శాంతారాం శవంగా పడి ఉండిన మంచం–ఫొటోల్లోని మంచం ఒకటే! ఒక్క మాటలో చెప్పాలంటే ఆ ఫొటోలు శాంతారాం పక్కను ఉపయోగించినప్పుడు తీసినవి! నిరూప శశికళ చెవిలో ఏదో చెప్పి బయటికి నడిచింది. నేను కాసేపు గదిని పరీక్షగా చూసి నిరూప కోసం వెళ్ళాను. శశికళ దిగ్భ్రమతో నన్ను వెంబడించింది.

ఆఫీసుకు తిరిగి వెడుతున్నప్పుడు నిరూప శశికళతోబాటు కారు వెనక సీట్లో కూచుంది. నోరు మెదపకుండా కళ్ళ ముందు కదిలిపోతున్న దృశ్యాలనుచూస్తూ ఉండిపోయింది. ఆ మంచం ఆమెను అదరగొట్టేసినట్టుంది. వాతావరణంలోని గాంభీర్యాన్ని పోగొట్టడానికి కారును దగ్గరలో ఉన్న ఒక రెస్టారెంట్ ముందు ఆపాను. లోపలికి వెళ్ళి పొటాటో వేఫర్స్,

 

కాఫీ తెమ్మని బేరర్‌కు పురమాయించాను. అవి రాగానే ఒక వేఫర్ అందుకుని కొరికాను.

"సాగరీ! శాంతారాం గదిలోని ఆ మంచం ఒక్కటే చాలు—మన క్లయింట్స్ ఇద్దరినీ ఉరితియ్యడానికి..." అన్నది నిరూప బరువుగా.



ఛాయాదేవినీ, గోపాల్‌నూ మేజిస్ట్రేట్ ముందు ప్రిలిమినరీ ఎంక్వయిరీ కోసమూ, కమిటల్ కోసమూ హాజరుపరిచారు. భారత శిక్షా స్మృతి 302 సెక్షన్ ప్రకారం కుట్రచేసి శాంతారామ్‌ను హత్య చేసినట్టు ఇద్దరి మీదా నేరాలు ఆరోపించారు.

మేజిస్ట్రేటు ముందు జరిగే కమిటల్ ప్రొసీడింగ్స్ — పెద్ద నేరమేదైనా జరిగినపుడు ఆ సందర్భంగా అరెస్ట్ చేసిన నిందితులను అనుమానించడానికి ప్రాతిపదిక ఏదయినా ఉందా అని చూసేందుకు (దీన్ని న్యాయ పరిభాషలో ప్రైమాఫేసీ కేస్ అంటారు) అసలు ట్రయల్ ముందు ప్రాథమిక విచారణ చెయ్యడానికి పనికి వస్తాయి. ఈ కమిటల్ ప్రొసీడింగ్స్‌వల్ల అసలు విచారణ జరుగుతున్నపుడు ట్రయల్ కోర్టు కాలం వృథా కాకపోవడం, ఒకవేళ పోలీసులు తొందరపడి అరెస్టు చేసి ఉంటే అది తేలిపోవడం జరుగుతూ ఉంటాయి. అయితే కమిటల్ కోర్టులో విచారణకు అంతగా వీలుండదు. నా గురువు కీర్తిశేషులు వేదం అవధాని వంటి అనుభవజ్ఞులైన క్రిమినల్ ట్రయల్ లాయర్లు కమిటల్ కోర్టులో తమ వాదం ఏమిటో ప్రాసిక్యూషనుకు అంతు చిక్కకుండా జాగ్రత్తపడుతూ ఉంటారు. కేసును సామర్థ్యంతో వాదించి గెలవడానికి ఈ కళ ఎంతగానో పనికి వస్తుంది. నా గురువు ఈ కళలో సిద్ధహస్తులు.

వేదం అవధాని వాత్తేరుకు దగ్గరున్న ఒక కుగ్రామంలో పుట్టారట. కటిక బీదరికంతో బాధపడుతూ ఉండడం వల్ల కాలినడకనే బయలుదేరి బెజవాడలో ఏదో గుళ్ళో పూజారిగా ఉన్న తన మేనమామ ఇంటికి చేరుకున్నారట. ఆయన అవధానిని ఏదో సంస్థానపు యువరాజావారి దగ్గరికి తీసుకువెడితే, ఆ యువరాజు అవధానిని చూసి ముచ్చటపడి సాయం చేశారట. అలా అవధాని తర్వాత లా చదివారట!

అది అయ్యాక ఆ యువరాజుగారు అవధానిగారిని లండన్‌లో న్యాయశాస్త్రం చదువుకున్న ఓ లాయర్ దగ్గర చేర్చారట. ఐదేళ్ళలో అవధాని క్రిమినల్ ట్రయల్ లాయర్‌గా మంచి పేరు తెచ్చుకుని ప్రాక్టీసు పెంచుకొన్నారట.

ఆయన మరో ఏడాదిలో చనిపోతారనగా నేను ఆయన ఛాంబర్స్‌లో లీగల్ అప్రెంటిస్‌గా చేరాను. ఆయన నన్ను ఎంతగానో అభిమానించి ఎన్నెన్నో మెలకువలు నేర్పించారు.

ఆయన పోయాక నేను ఖాన్ అనే మరో లాయరుకు జూనియర్‌గా చేరాను. ఆ ఖాన్‌గారు తెలివయినవాడేగానీ చాలా సోమరి. మధువన్నా, మగువలన్నా ఆసక్తి చూపించే షోకులరాయుడు. దాంతో ఆయనకు నా మీద ప్రత్యేకాభిమానం

ఉండేది. నేను నా జాగ్రత్తలో ఉండగా ఉండగా ఒకరోజు మైసూరు రైల్వేస్టేషన్ వెయిటింగ్ రూమ్‌లో తనను పెళ్ళిచేసుకోమని సెలవిచ్చాడు. వెంటనే నేను ఆయనకు పెద్ద నమస్కారం ఒకటి పారేసి ఆయన దగ్గర ఇహ జూనియర్‌గా ఉండబోనని చెప్పి వచ్చేశాను!

కోర్టులో మెట్రోపాలిటన్ మేజిస్ట్రేట్ ఆనందం అనే ఆయన. సిటీప్రాసిక్యూటర్ రత్నకుమార్ ప్రభుత్వం తరఫున వాదించడానికి వచ్చారు. నేనూ, నా జూనియర్ పద్మజారెడ్డి-ఛాయాదేవి తరఫునా, నిరూప, శశికళ-గోపాల్ తరఫునా హాజరయ్యాము. పద్మజ ఇనుపతుక్కు అమ్మే ఒక ధనవంతుడి కుమార్తె. మూడేళ్ళనుంచి ఆమె నా జూనియర్‌గా పని చేస్తున్నది. ఆమె తన బావనే పెళ్ళాడింది. కడుపునిండా తిని మంచమెక్కడం ఒకటే ఆ బావగారికి చేతనయిన పని. ఆమె కలం పేరుతో, కథలు రాస్తూ ఉంటుంది. ఆమె కథలకు కొందరు 'రెగ్యులర్' పాఠకులూ ఉన్నారు.

నా అలవాటు ప్రకారం నా వాదన సెషన్స్ కోర్టులో చేస్తానని కోర్టువారికి తెలియజేశాను. నిరూపా అంతే చేసింది. మా చర్య రత్నకుమార్‌ను ఆశ్చర్యపరిచినట్టుంది. ఆయనకు నేను ఎలా పనిచేస్తానన్నది తెలుసు. అయినా ఆ ముఖంలో ఆశ్చర్యం కొట్టవచ్చినట్టు కనిపించింది.

ప్రాసిక్యూషన్ ఇద్దరు నిందితులమీదా ఆరోపించిన కేసు వివరాలున్న పత్రాలు రత్నకుమార్ మాకు అందజేశాడు. ఆ పత్రాలలో నన్ను ఆశ్చర్యపరిచింది-సారాను ప్రాసిక్యూషన్ తరఫుసాక్షిగా పేర్కొవడమే! అది చూసి నిరూపకూడా గుబురుగా ఉండే తన కనుబొమలను పైకెత్తింది.

బహుశా శాంతారామ్ హత్య కావడానికి గల కారణాన్ని నిరూపించడం కోసం ప్రాసిక్యూషనువారు సారాను ఉపయోగించుకోవచ్చు. సారా-శాంతారామ్‌కు ప్రియురాలు. అందువల్ల ఛాయాదేవిలో స్త్రీ సహజమయిన అసూయ చెలరేగి ఆమెభర్తగా చలామణీ అవుతున్న శాంతారామ్‌ను హత్యచేసి ఉంటుందన్నమాట. హత్య జరగడానికి తగిన కారణాన్ని నిరూపించడానికి ఏ ప్రాసిక్యూటరుకయినా పనికివస్తుంది ఇది.

ప్రాసిక్యూషన్ కథనం వింటే వాళ్ళు మా క్లయింట్లకు వ్యతిరేకంగా నమ్మడానికి వీలుకానంత బాగా కేసు అల్లారనిపించింది. ఛాయాదేవి, గోపాల్ కలిసి ఉండగా తీసిన ఫొటోలు ప్రాసిక్యూషనువారి దృష్టిలో పడినట్టులేదు. టోనీ, నేనూ ఆ మిగిలిన ఫొటోలు పోలీసుల దృష్టిలో పడడానికివీలుగానే అక్కడి జల్లలో వదిలేసి వచ్చాము. ఆ అపార్టుమెంట్ మీద పోలీసులునిఘావేసే ఉంచారు. వాళ్ళూ ఆ ఫొటోలు చూసే ఉండాలి. కాని వాటి ప్రస్తావన ఎక్కడా లేదు. ఎందుకు? అలాగే హత్య జరిగినచోట పుస్తకంలో ఉంచిన తలలేని నగ్నచిత్రం మాట ప్రాసిక్యూషనువారు ఎత్తనయినా లేదు. ఎందుకో? పోలీసులు ఆ చిత్రాన్ని స్వాధీనం చేసుకున్నారా లేదా? మరి వాళ్ళ దృష్టిలో అది పడకపోతే నా తర్వాత అక్కడికి వెళ్ళిన గోపాల్, ఛాయగాని, మరెవరయినా దాన్ని తీసి ఉండవచ్చు.

రత్నకుమార్ కేసు వివరాలు ఏకరువు పెడుతూ ఉండగా నేను నా డిఫెన్స్ గురించి ఆలోచిస్తూ కూర్చున్నాను. నా వాదం ఏమిటో నేను తెలియజెయ్యక

పోవడంవల్లకోర్టువారు ఇద్దరు నిందితులను సిటీ సెషన్స్ కోర్టుకు విచారణ కోసం కమిట్ చేస్తారు. అలా జరిగితే నాకు కేసును సరిగ్గా రూపొందించుకోడానికీ, హత్య వెనుకగల రహస్యాన్ని ఛేదించడానికీ కా.స్త తెరిపి దొరుకుతుంది. ఛాయాదేవి, గోపాల్ ఇద్దరూ వాళ్ళ అబద్ధాలతో బాటు క్షేమంగా జైలులో ఉండడం వాళ్ళకు మేలు జరగటానికి అవసరం అనిపించింది.

న్యాయ పరిభాషలో 'లెర్నెడ్ మేజిస్ట్రేట్'గా పేర్కొనబడే న్యాయమూర్తి గారు ఇద్దరు ముద్దాయిలమీద ప్రైమా ఫేసీ కేసు ఉందని ప్రాసిక్యూషన్ నిరూపించినందువల్ల ఛాయాదేవినీ, గోపాల్‌నూ వాళ్ళమీద మోపిన నేరాల విచారణకుగాను సెషన్స్‌కు కమిట్ చేశారు.

* * *

ఫొటోలగురించి నేను చెప్పినపుడు ఛాయాదేవి ఒక్కసారిగా ఉలిక్కిపడింది. నేనూ పద్మజా ఆమెను కలుసుకోవడానికి జైలుకు వెళ్లాము. మామూలు ప్రకారం ఏదో విడాకులకేసు హడావిడిలో ఉండి నిరూప రాలేకపోయింది.

పాపం ఛాయ! కోర్టుకెక్కవలసి రావడం, జైలులో ఉండటం, హత్యకేసులో ఇరుక్కోవడం ఆమెను బాగా దెబ్బతీశాయి. చిక్కిపోయి కళ్ళకింద నల్లటి చారలు ఏర్పడ్డాయి. చేతబంగారు వన్నె కలం లేకపోవడంవల్ల కాబోలు ఆమె గోళ్ల కొరుక్కుంటూ తాను కూచున్న నల్లులునిండిన బల్లమీద అసహనంగా కదులుతూ ఉంది.

"ఎ...ఎ...ఎవరు?" ఆమెకు గొంతు పెగలలేదు. "ఫొటోలు ఎవరు చూశారు?"

"ఎవరు చూశారో అనవసరం. నేను చూశానన్నది సత్యం!" అన్నాను. ఆమె నమ్మలేనన్నట్టు చూసింది.

"ఛాయా! నేను ఈ కాలం స్త్రీని. ఇలాంటివి జరుగుతాయని తెలిసినదాన్ని. కాబట్టి దీన్ని గురించి మీరు విచారించవద్దు. మీ మీద ఇంతకన్నా ఘోరమయిన నేరం మోపారు. నేను దానిగురించి ఆలోచిస్తున్నాను ఛాయా! నన్ను కలుసుకోవడానికి వచ్చిన క్షణం నుంచీ ఇప్పటిదాకా మీరు కనీసం ఒక్కనిజమన్నా చెప్పలేదు. నేను మీ లాయర్‌ని. మీకు సాయం చెయ్యడానికీ, మిమ్మల్ని రక్షించడానికీ నేను పనికివస్తాననుకుని నా దగ్గరికి వచ్చారు. బాగుంది. కానీ నాకు నిజం చెప్పేటంత నమ్మకం మీకు లేకపోయిందన్న మాట! మీరు ఇలా చేశారని నాకు బాధకలగలేదు కానీ నిరుత్సాహం మాత్రం కలిగింది" అన్నాను.

ఆమె దిగులుగా చూసింది. ఆమె కళ్లు చెమ్మగిల్లుతున్నాయి. ఉన్నట్టుండి ఆమె వెక్కి వెక్కి ఏడ్వడం మొదలుపెట్టింది. ఏడిస్తే ఆమె కుదుటపడుతుందనుకుని ఆమెను అలా కాసేపు ఏడవనిచ్చాను.

"అది కాదండీ!" నా ఎడమ చెయ్యి పట్టుకుని గుసగుసలాడింది ఆమె. "మిసెస్ రావ్! మీకు తెలుసు. పరువుగల మధ్యతరగతి కుటుంబానికి చెందిన నాలాంటి మనిషి- అందులోనూ ఆడమనిషి ఇలాటి విషయాల గురించి మాట్లాడడం కష్టం!" అన్నది ఆమె.

ఆ క్షణాన మధ్యతరగతి నీతి నియమాల గురించి ఎంతో చెప్పాలనుకున్నాను కానీ ఆ స్థలమూ, ఆ తరుణమూ తగినవి కావని ఊరుకున్నాను.

"ఏమండీ, ఈ ఫొటోగ్రాపులు మన కేసును బాధిస్తాయంటారా?" అని అడిగింది ఛాయాదేవి.




"అది ఇప్పుడప్పుడే ఏమీ చెప్పలేను. మీరు కనీసం నాతోనయినా నిజం చెబితే బహుశా ఆ ఫొటోలే మీకు సాయపడనూ వచ్చు. ఛాయా! మీరు హత్య చెయ్యలేదని నేను నమ్ముతున్నాను. కానీ మిమ్మల్ని కాపాడడానికి నా నమ్మకం ఒక్కటే చాలదు. మీకు నేను సహాయం చెయ్యాలంటే ముందు మీరు నాకు సహాయం చెయ్యాలి" అన్నాను.

ఆమె నా చెయ్యి గట్టిగా పట్టుకున్నది ఆమెను ఊరటపరచే ధోరణిలో నేనూ ఆమె చెయ్యి పట్టుకున్నాను.

"నిజంగానా" అని అడిగింది ఆమె.

"నిజంగానే. నా క్లయింట్లకు కాకమ్మ కథలు చెప్పడం నాకు నచ్చని పని" అన్నాను.

"అంటే, ఇదంతా కోర్టులో చెప్పాల్సి ఉంటుందా?" అడిగింది ఆమె.

"చెప్పాను కదా! ఈ వ్యవహారం ఎలాంటి మలుపు తిరుగుతుందో తేలితే తప్ప ఏం చెప్పడానికి వీలు లేదు!" అన్నాను.

"దేవుడా! ఆ అవమానాన్ని నేను ఎలా భరించేది?" అన్నది ఛాయాదేవి.

"ఇప్పుడు మన ముందు లేని సమస్యల గురించి బాధపడడం ఎందుకు? ఆ సమస్య తలఎత్తినపుడు దాని పరిష్కారం సంగతి ఆలోచిద్దాం" అన్నాను.

"సరే! మీకు వీలయినంత వరకు ఈ ఫొటోల వ్యవహారం రహస్యంగా ఉంచండి. ప్లీజ్..."

నేను తల ఊచి, చెయ్యి వెనక్కు తీసుకున్నాను.

"మీకు గుర్తుందా..." అంటూ ఆమె ఏదో చెప్పబోయింది.

"ఒక క్షణం! మీరు మొదలు పెట్టబోయే ముందు ఒక ప్రశ్న. గోపాల్ మీ అన్న కాదు కదా?" అన్నాను అడ్డుతగిలి.

ఆమె కాదన్నట్టు తల అడ్డంగా తిప్పింది. నన్ను చూడలేక కళ్లు దించుకుంది.

"కాదు. అతను మా అమ్మ వైపు చుట్టం. వాళ్ళు బీదవాళ్ళు. ఎన్నేళ్ల నుంచో గోపాల్ మా ఇంట్లో ఉన్నారు. నా చిన్నప్పుడే నన్ను మా మేనమామ కిచ్చి పెళ్ళి చేశారు. ఆయన బాగా ఆస్తి పరుడు. మీరు చూసిన బంగారమంతా ఆయన నాకిచ్చిందే! నా భర్త ముసలి వాడు. అంచేత నాకు ఆయనంటే అసహ్యం వేసేది. ఆయన గుండెపోటు వచ్చి పోయారు.చిన్నదాన్ని...డబ్బున్న దాన్ని. గోపాల్ నావాడయ్యాడు...నా పెళ్ళికి ముందునుంచి కూడా గోపాల్ మా ఇంట్లో ఉండడం వల్ల అతణ్ని అన్నయ్యగా చలామణీ చెయ్యటం కష్టం కాలేదు. ఎవరూ మమ్మల్ని అనుమానించ లేదు. పుష్పనగర్‌లోని ఆ ఇల్లు మాదని చెప్పానుకదా? నేనూ, గోపాల్ అక్కడికి శని, ఆదివారాల్లో వెళ్ళేవాళ్ళం. శాంతారామ్ అప్పట్లో ఇల్లు వదిలి వెళ్ళేవాడు. గోపాల్‌కూ, నాకూ మధ్య ఉన్న సంబంధం గురించి అతనికి కూడా తెలుసు. అసలు ఆ షరతుమీదే నేనతనికి ఇల్లు ఇచ్చాను. అతనూ నాకు స్నేహితుడే! కానీ, మా సాన్నిహిత్యం ఎక్కువ కాలం సాగలేదు"

"మీరు తనను దూరం చేసుకున్నప్పుడు అతను ఎలా ప్రవర్తించాడు?" అని అడిగాను.

"అతను మా బడిలో పని చేస్తూ ఉండేవాడు అని చెప్పాను కదా! మొదట మామూలుగానే ఉన్నాడు. తర్వాత గానీ

అతను ఎంతటి నీచుడో తెలియలేదు..."

"అంటే—అతను మిమ్మల్ని బ్లాక్ మెయిల్ చేసేవాడా?" అని అడిగాను.

కాసేపు ఆమె బదులు చెప్పలేదు. ఆ తర్వాత నిట్టూర్చి — "అవును. అతను బెదిరించి డబ్బు గుంజేవాడు. నానాటికీ అతని బెదిరింపులు ఎక్కువయ్యాయి. ఫొటోలు చూపించి మరీ బెదిరించేవాడు. వాటిని చూసి, నేను ఎలాంటి కోత అనుభవించానో మాటల్లో చెప్పలేను. బహుశా అతను కెమేరాలు దాచిపెట్టి, ఫొటోలు తీశాడనుకుంటాను. అతనికి ఫొటోలు తీయడమంటే సరదా... ఫొటోల గురించి నేను అతనితో చాలా సార్లు పోట్లాడాను. చివరికి మీ సహాయంతో నెగటివ్‌లు సంపాదిద్దామనుకున్నాను" అన్నది.

"నా సహాయంతోనా? నేను డిటెక్టివ్‌ను కానమ్మా! లాయర్‌ని!" అన్నాను.

"తెలుసు! నా స్నేహితురాలు ఒకామె మీగురించి చెప్పి మీరు తప్పకుండా నా పని చేసిపెట్టగలరని చెప్పింది. అందుకనే నా భర్త కనబడటం లేదంటూ మీ దగ్గరికి వచ్చాను. మీకు అన్నీ వివరంగా చెప్పుకునేలోపలే ఇవన్నీ జరిగిపోయాయి! నేను ఇక్కడికొచ్చి పడ్డాను!"

నేను సానుభూతితో తల ఆడించి ఊరుకున్నాను.

"ఆమె కానీ, నేనుగాని, గోపాల్‌గాని, శాంతారాంను హత్య చేయలేదు..." అన్నది.

"అది మీరు ఇంతకు ముందు కూడా చెప్పారు. శాంతారాం గురించి ఇంకా వివరాలు చెప్పండి" అన్నాను.

"అతను ఆడవాళ్ళంటే పడి చచ్చిపోయేవాడు. మొదట నాకుతెలియదు. కానీ తర్వాత తెలిసింది. అతను మా బడిలో పంతులమ్మలెందరినో తన వలలో వేసుకున్నాడని..."

"సారాలాంటి వాళ్ళనా?" అని అడిగాను.

"సారా బజారుమనిషి. డబ్బుకోసం వ్యభిచరించడానికి వెనుదీయదు. చూడ్డానికి ఆమె బాగానే ఉంటుందిగానీ, దాంతో మరింతలాభాలు పొందడానికి ప్రయత్నిస్తూంటుంది"

"శాంతారామ్‌కు, ఆమెకు దగ్గరి సంబంధమే ఉందంటారా?"

"తప్పకుండా!"

"మరి శాంతారామ్ ఆమెనుగూడా బెదిరించి డబ్బు గుంజేవాడా?"

"నాకుతెలియదు. కానీ అతనుఅందుకు సమర్థుడే! ఆమె దగ్గర అతనికివ్వడానికి శరీరంతప్ప మరేమీ లేదనుకుంటాను. ఆ నీచురాలు దాన్ని ఊరికేనే ఇచ్చుకుంటుంది....

* * *

మరుసటిరోజు ఉదయం చాలా బిజీగా ఉంది నాకు. మధ్యాహ్నం హైకోర్టులో ఇద్దరు జడ్జిల బెంచ్ ముందు క్రిమినల్ కేసు ఒకదానికి సంబంధించిన అప్పీల్‌కోసం నేను హాజరుకావలసి ఉంది. మా ఆఫీసు లైబ్రరీలోకూచుని నేను ఆ కేసుకోసం నా వాదం తయారుచేసుకుంటున్నాను. మా లైబ్రరీగదిలో ఒకవైపు తప్ప మిగిలిన మూడువైపులా గోడలలో అమర్చిన అల్మైరాల నిండా న్యాయశాస్త్రానికి సంబంధించిన పుస్తకాలు పేర్చివుంచాము. ఆ అల్మైరాలుకాక ఉక్కుఅల్మైరాలు, గాజు తలుపులుఅమర్చిన చెక్కబీరువాలు మొదలయిన వాటినిండా పుస్తకాలువుంచాము. మిగిలిన పుస్తకాలు గదిలోని బల్లలమీద

గదినేలమీద చిందరవందరగా పేర్చాము. ఉన్న పుస్తకాలలో చాలామటుకు నావే. మిగిలినవి లైబ్రరీల నుంచి తెచ్చుకున్నవి. మనన్యాయశాస్త్రానికి సంబంధించినవే కాక వివిధదేశాలన్యాయశాస్త్రాలకు సంబంధించిన పుస్తకాలు, నివేదికలు మొదలైనవి ఎంతో కష్టపడి సేకరించాను. ఈ సేకరణకు డబ్బు బాగాఖర్చయింది. అయితే నావంటి న్యాయవాదులకు న్యాయశాస్త్రానికి సంబంధించిన పుస్తకాలు మంచి ఆయుధాలుగా పనికివస్తాయి. ఒక బల్లమీదకూచుని పుస్తకాలు తిరగవేస్తూ, నాకు కావలసిన పాయింట్లు రాసుకుంటున్నాను. పద్మజ నాకు నోట్స్ తీసుకోవడానికి సహాయపడుతూవుండగా గ్లో కావలసిన పుస్తకాలుతీసియిస్తూ అక్కరలేనివి మళ్ళీ వాటి

స్థానంలో పెట్టేస్తూ సహాయపడుతున్నది.

మాకు శ్రమతెలియకుండా ఉండడం కోసం ఫ్లాస్కునిండా కాఫీ, తినడానికి చిప్స్‌వగైరా ఏర్పాటుచేసుకున్నాము.

మేము పుస్తకాలతో కుస్తీ పడుతూ వుండగా నిరూప తన ఎడమచేతపొడవాటి కాగితం ఒకటి పట్టుకొని లైబ్రరీలోకి వచ్చింది.

"సాగరీ! ఇదిగో నీవడిగింది. భాగ్యం మనకు కావలసిన అన్ని నెంబర్లు రాసి పంపించింది...." అంటూ నా పక్కన కూచుంది. ఆమె వేసుకున్న పెర్‌ఫ్యూమ్ వాసన నాకు అంటుకునేలా కనిపించింది. నిరూపకు ఇలాంటి సుగంధద్రవ్యాలంటే ఇష్టం. నాకు నా సహజసౌందర్యం మీదా, సహజ సుగంధాలమీదా నమ్మకం ఎక్కువ. నా అనుభవం, నా నమ్మకం సరయినదే నని రుజువుచేసింది!

"నిరూపా! ఈ అప్పీల్ పనిఅయ్యాక ఆ నెంబర్ల సంగతి చూస్తాను. నీకు వీలుంటే ఈలోగా వాటినొకసారి చూడకూడదూ? ఏమన్నా తెలుస్తుందేమో?" అన్నాను.

"చాలా నెంబర్లున్నాయి సాగరీ! వాటితో ఎంచెయ్యాలో నాకు తోచడంలేదు. అంతా గందరగోళంగా వుంది!" అన్నదామె.

"ఐసీ! నీకా లిస్టు అక్కరలేకపోతే నా డెస్కుమీద పెట్టివెళ్లు. మీ ఫ్రెండ్ భాగ్యం బాగా శ్రమపడి ఈ నెంబర్లు సేకరించినందుకు థాంక్స్ చెప్పు. మనం ఆమెకు ఏదన్నా గిఫ్ట్ పంపితే బాగుంటుందేమో కదా నిరూపా?" అన్నాను.

"పంపించేశాను సాగరీ! భాగ్యానికి సింగపూర్ నైలాన్ చీర ఒకటి పంపించాను. పోయినేడాది నా పుట్టినరోజు కానుకగా ఎవరో పంపారు. అది నేను కట్టుకోనేలేదు. భాగ్యం ఆ చీర గురించి విని తెగ ఇంటరెస్ట్ చూపించింది. ఫోన్‌లోనే అనుకో! తనకు నైలాన్ చీర లంటే చాలా ఇష్టమట" అన్నది నిరూప.

"మంచి పనిచేశావు నిరూపా! ఓకే. కోర్టునుంచి తిరిగి వచ్చాక నిన్ను కలుసుకుంటాను" అని చెప్పాను.

నా పుస్తకాలనూ, నన్నూ వదిలిపెట్టి నిరూప లైబ్రరీలోంచి వెళ్ళిపోయింది.

* * *

ఆ రాత్రి ఇంటికి వెళ్ళేసరికి బాగా అలిసిపోయాను. తిల్లీని నా కోసం ప్రత్యేకంగా పుదీనా సూప్ తయారు చేయమన్నాను. పుదీనా వగైరా ఆకుకూరలు మా ఇంటి తోటలో పెరుగుతున్నాయి. తిల్లీ చెయ్యి తగిలితే చాలు ఆ మొక్కలు ఆరోగ్యంగా పెరుగుతాయి.

నేను వేడి నీళ్ళ షవర్ కింద కూచుని స్నానం చేసి బడలిక పోగొట్టుకున్నాను. తర్వాత రెండు కప్పుల సూప్ తాగాను. సూప్ తాగుతూ తిల్లీని పెళ్ళి చేసుకోబోయేవాడి అదృష్టం గురించి ఆలోచించాను. తడితడిగా వున్న జుట్టును దువ్వుకుని, ఇంటి కింది భాగంలో ఉన్న నా గదిలో బల్లమీద నిరూప ఇచ్చిన టెలిఫోన్ నెంబర్ల కాగితం ముందు వేసుకుని కూచున్నాను.

'5629' అనే అంకెలతో ముగిసే టెలిఫోన్ నెంబర్లు ఇరవై దాకా రాసి ఉన్నాయి అందులో. ఎడమవైపున టెలిఫోన్ నెంబర్, దానిపక్కనే కుడివైపున ఆ ఫోన్ ఎక్కడ ఏ పేరుమీద ఉన్నదీ తెలియజేసే వివరాలు ఉన్నాయి.

నీలిరంగు పెన్సిలు తీసుకుని ఆ పేర్లను పరిశీలించడం మొదలుపెట్టాను. ప్రూడెన్షియల్ ఇన్సూరెన్స్...కృత్తికా





ట్రేడర్స్, శేషాద్రి...అంబికా సినిమా ప్రొడక్షన్స్...వెల్‌కమ్ స్టోర్స్...శ్రీమతి ఇందిర...డాక్టర్ పాల్...లా బింబా... హైదరాబాద్ హైపవర్ లాండ్రీ... డాక్టర్ (శ్రీమతి) అమానుల్లా... అవినాష్ ట్రావెల్స్...నీలకంఠరావు...కుమారి లీలా ఫెర్నాండో... వెంకటరమణారావు కె... జలంధర్ స్పోర్ట్సు పాస్టైమ్ కంపెనీ... కఫే అబిడ్స్, దేవీ అండ్ దేవీ ఏజన్సీస్... ముఖ్యప్రాణపాయ్....

రకరకాల పేర్లు, వ్యక్తులు, వ్యాపార సంస్థలు, కంపెనీలు... ఈ పేర్ల వెనక ఉన్న ఎవరో ఒక వ్యక్తి తల చించేసిన నగ్న చిత్రం గురించిన రహస్యం వెల్లడి చెయ్యగలడెమోననిని నా ఊహ!

నాకు కూడా ఆ వ్యక్తిని కనుక్కోవడం అసాధ్యమైనదేననిపించింది.

బహుశా ఆ వ్యక్తి ఈ టెలిఫోన్ నెంబర్లున్న కంపెనీ ఎందులోనయినా పనిచేస్తూ ఉంటే నేనేం చెయ్యాలి? అన్ని కంపెనీలలోని వ్యక్తుల గురించీ ఆరా తీయాలన్నమాట! ఆదివారం ఉదయాన జనసమ్మర్దం బాగా ఉన్న బజారులో ఉండే సెలూన్‌లో ఒక వెంట్రుక కోసం వెతికేటంత వివేకవంతమైన పని అది!

అదీకాక ఆ తలలేని ఫొటోకూ, ఆ హిందూ నాగరికత గురించిన పుస్తకానికీ మధ్యగల సంబంధాన్ని తెలియజేసే ఆధారమూ నాకు దొరకలేదు. బహుశా ఆ ఫొటోను దాచడానికి అనుకోకుండా ఆ పుస్తకాన్ని తీసుకొని ఉండవచ్చు. నెంబర్ ఫొటోవెనక రాసివుంటే నాఆలోచనలకు బలం చేకూరివుండేది. నాకు ఏమీ తోచక గట్టిగా ఆవులించాను. కానీ నేను ఓడిపోయానని ఒప్పుకోదలుచుకోలేదు. పట్టినపట్టు వదలకపోవడం నా లక్షణాల్లో ఒకటి.

గీతలుగీసి ఉన్న కాగితాలబొత్తి తీసుకొని, ఒక్కో కాగితంమీద ఒక్కో ఫోన్ నెంబరూ, ఆ ఫోన్ తాలూకు పేర్లూరాశాను. ఆతర్వాత ప్రతి నెంబరుకిందా, దానికి సంబంధించిన పేర్ల గురించి నా అభిప్రాయాలు రాశాను.

లీలా ఫెర్నాండో... యువతిఅయినా కావచ్చు. లేకుంటే సన్నగా, పొడుగ్గావుండి పెళ్ళిగాని ముసలమ్మ అయినా కావచ్చు. బాగా డబ్బు, పైపెదవి మీద సన్నటి వెంట్రుకల గీత ఉన్న మనిషి కావచ్చు. జీవితంలో ఏదీ 'మిస్' కాని 'మిస్' అయినా అయివుండవచ్చు. మరి ఆమె హిందూ నాగరికత గురించిన 'హైబ్రో' పుస్తకాలు చదువుతుందా? బహుశా చదవకపోవచ్చు. అలాంటి స్త్రీల ప్రపంచం ఎంతో చిన్నదిగా ఉంటుంది. అందువల్ల లీలా ఫెర్నాండో నాకుకావలసిన 'లంకె'న కాకపోవచ్చుననుకుని పెద్ద అక్షరాలతో 'కాదు' అని రాసి తర్వాతపేరు గురించి ఆలోచనలో పడ్డాను.

నీలకంఠరావు అనే అతను రాజకీయవేత్త గానీ, భాషాభిమానిగానీ అయిఉండాలనుకున్నాను. బహుశా సంస్కృతంలో ఉన్న తన అసలు పేరును తెలుగులోకి అనువదించుకున్న మాతృ భాషాభిమాని ఏమో! బాగా డబ్బూ, పలుకుబడీ ఉన్నవాడేమో! మరి ఇతను యువకుడా? ముసలివాడా? సమాధానాలు తెలీని ప్రశ్నలు...

మాటిమాటికీ ఆవులింతలు వస్తున్నాయి. అలసట ముంచుకు వస్తున్నది. కానీ నేను పట్టు విడవదలచుకోలేదు. గోడమీది గడియారం చూస్తే తొమ్మిది గంటలు కావడానికి పదినిమిషాలుంది.

తిల్లీ ఒక వెండిగిన్నె నిండా ఆపిల్ పండ్ల ముక్కలూ, గ్లాసులో కుంకుమ పువ్వు వేసిన పాలూ పట్టుకొచ్చింది.

కుర్చీలో వెనక్కువాలి మెటికలు విరుచుకున్నాను. వీపును కుర్చీకి బాగా ఆన్చి కూచుని పండ్ల ముక్కలు తింటూ పాలు తాగడం మొదలుపెట్టాను.

అలా పదినిమిషాలు గడిచాయి.

మళ్ళీ ఫోన్ నెంబర్ల పరిశీలన మొదలు పెట్టాను.

శ్రీమతి ఇందిర నాకు కావలసిన మనిషి కాదనిపించింది. వెంటనే 'కాదు' అని రాసే శాను.

అంబికా సినిమా ప్రొడక్షన్స్...నాకు చలనచిత్ర పరిశ్రమలో స్నేహితు లున్నారు. నిర్మాతలు, నటీనటులు, దర్శ కులు, డిస్ట్రిబ్యూటర్స్-ఇలా ఎందరో! కానీ ఇక్కడ ఉన్న కంపెనీలే తక్కువ. నాకు ఆ కంపెనీల పేర్లు చాలామటుకు పరిచయమైనవే. కానీ ఈ అంబికా సినిమా ప్రొడక్షన్స్ నేను ఇంతకు ముందెన్నడూ విన్నది కాదు. అన్ని సినిమా కంపెనీల వివరాలూ నాకు తెలిసి ఉండాలనీ లేదు కదా! బహుశా ఈ కంపెనీ సినిమా ఆశ చూపి ఆడపిల్లలను తెచ్చి కళ పేర మరే దయినా వ్యాపారం చేస్తున్నదేమో! ఇలాంటి చోట నగ్న చిత్రాలు తియ్య డానికి ఆస్కారం ఉంటుంది. అందువల్ల పచ్చరంగులో 'చెక్' అని ఆ కాగితం మీద రాశాను.

'లా బింబా'...ఇలాంటి చిత్రమైన పేరున్న సంస్థ ఏమిటో?

పిల్లలకు కావలసిన రడీమేడ్ బట్టలు అమ్మే సంస్థ కావచ్చు. ఒకవేళ ఏదయినా కిండర్ గార్టెన్ బడి కావచ్చు. కాకనూ పోవచ్చు. 'దీని గురించి వివరంగా పరిశీలించాలి' అనుకున్నాను.

అంతే! ఎప్పుడు నిద్రపట్టిందో తెలియ లేదు. ఇక తక్కిన నెంబర్ల పరిశీలన మర్నాడు గానీ కుదరలేదు.

* * *

మా ఆఫీసులో నా డెస్క్ ముందు కూచు న్నాడు టోనీ. మా ఆఫీసుకు రమ్మని కబురు పంపించాను. సరిగ్గా రమ్మన్న సమయానికే వచ్చి నాముందు వాలాడు. తెల్లటి పంట్లాం, కోకోరంగు ఫుల్‌స్లీవ్డ్ చొక్కా తొడుక్కున్నాడు అతను. అతని పంట్లాం నడుముదగ్గర పిటపిటలాడుతూ వుంది. అది టోనీ 'ట్రేడ్ మార్క్'!

అంతకు ముందే ఫోన్ నెంబర్ల గురించి నేనురాసిన నోట్స్ కాపీలు తీయమన్నాను. గ్లోరియా ఆ కాపీలలో ఒకటితెచ్చి టోనీ కిచ్చింది. యథాప్రకారం టోనీ ఏదో తింటూ కూచుని గ్లో ఇచ్చిన కాగితాలను పట్టించుకోలేదు.

"త్వరగా కానీ బాబూ! బోలెడంతపని చెయ్యాలి. బోలెడంత మాట్లాడాలి" అన్నాను.

"నా చెవులు ఫ్రీగానే వున్నాయి. మాట్లాడు" అన్నాడు టోనీ తినడం కొన సాగిస్తూ.

ఇంక చేసేదేమీలేక, "టోనీ! ఈ కాగి తాలలో ఫోన్ నెంబర్లూ, ఆ నెంబర్లకు సంబంధించిన పేర్లూ ఉన్నాయి. అడ్రస్‌లు లేవు. ఈ ఫోన్‌నెంబర్లకు సంబంధించిన వ్యక్తులలో ఎవరో ఈ ఛాయాదేవి కేసు సాల్వ్ చెయ్యడానికి పనికివస్తారని నా నమ్మకం. మనకు కావలసిన వ్యక్తికి ఫొటోలు తీయడంతోనూ, బ్లాక్‌మెయిల్ చెయ్యడంతోనూ సంబంధంవుండవచ్చు"

"అంటే-అతనికి మనంచూసిన ఫొటో



లతో సంబంధం ఉంటుందంటావా?" అన్నాడు టోనీ.

"ఉండవచ్చు. అదీ నా అనుమానం. ప్రతిపేరు గురించీ నా అభిప్రాయాలు రాశాను. అవి ఏమన్నా ఉపయోగపడతాయేమో చూడు. నువ్వు వాటిని ఒప్పుకోవాలని నిర్బంధం ఏమీ లేదు" అన్నాను.

"ఇంతకూ నన్ను ఏంచేయమంటావు సాగరీ?" అని అడిగాడు టోనీ-కాఫీకప్పు అందుకుంటూ.

"టోనీ, ఈ టెలిఫోన్లున్న అడ్రెసులన్నీ పట్టుకో! ఆ అడ్రెసులకు వెళ్లు. ఆ మనుషులను చూడు. వాళ్లు మనకు కావలసిన వాళ్లేమో కనుక్కో! నరాసరి వెళ్లి వాళ్లనే అడగలేవు కదా? అందువల్ల జాగ్రత్తగా ఉండు. నీకిచ్చిన ఈనెంబర్లలో కొన్ని ఏవో కంపెనీలవి. ఇక్కడ నీ పని కొంచెం కష్టంగా ఉంటుంది. కానీ నువ్వీది చెయ్యగలవన్న నమ్మకం నాకుంది. వీలైనంత త్వరగా కనుక్కో! మనకు కావలసిన ఆధారాలు దొరకగానే నాకు చెప్పు. ఇద్దరం కలసి రంగంలోకి దూకుదాం!" అన్నాను.

"ఇది చాలా పెద్దపని సాగరీ!"

"నాకు తెలుసు టోనీ! అందుకనే నిన్ను పిలిచింది... నీకో ఐదువందల రూపాయిలిమ్మని మా మేనేజర్‌కు చెప్పాను. సరేనా?"

"థాంక్స్ సాగరీ!" అని చిరునవ్వు నవ్వాడు టోనీ.

"బెస్ట్ ఆఫ్ లక్" అన్నాను.

* * *

"సాగరీ! మన అన్నా చెల్లెళ్ళ కేసు సెషన్స్ కోర్టుకు వస్తున్నది కదా?" అని చిలిపిగా అంటూ నిరూప కన్ను గీటింది. "మన వాదం సిద్ధం చేసుకోవడానికి ముందు మన క్లయంట్లను జైలులో కలుసుకోవడం మంచిది కదా!" అని అడిగింది ఆమె.

మేమిద్దరమూ మా ఆఫీసు లైబ్రరీలో కూచుని ఆ కేసుగురించి ఆలోచిస్తున్నాము. కేసుకు సంబంధించిన కాగితాలన్నీ చదివాము.

"నిరూపా! నిజం చెప్పాలంటే ఈ కేసుకు అవసరమైన దానికన్నా ఎక్కువ సార్లు నేను ఛాయాదేవిని కలుసుకొన్నాను. ఛాయాదేవి తనంత తానుగా బయటపడి ఏ వివరమూ చెప్పడం లేదు. ఆమెను బలవంతపెట్టడం వల్ల లాభం ఉంటుందనుకోను. ఆమె మళ్ళీ బోలెడన్ని అబద్ధాలు చెబితే మన పని పాడయిపోతుంది. మనం కేసుకు సంబంధించిన కాగితాల మీదా, సాక్ష్యాల మీదా ఆధారపడటం మంచిదేమో!" అన్నాను.

"సాగరీ! గోపాల్‌ను సారా గురించి అడగటం వల్ల లాభం ఉండదంటావా? ఆమె అతనే తన భర్త అని చెప్పింది కదా!" అన్నది నిరూప.

"చూడు నిరూపా! ఆమె ప్రమాణం చేసి సాక్ష్యం చెప్పడానికి బోను ఎక్కుతుంది కదా? అప్పుడు ఆమె సాక్ష్యాన్ని వీలైనన్ని పోట్లుపొడిచి,ఆమె అబద్ధాలాడుతున్న దన్న విషయాన్ని ఋజువు చేస్తే మన క్లయంట్లు విడుదల కావడానికి ఆస్కారం ఉంటుందని నా ఆశ. అయినా నువ్వు కావాలనుకుంటే వెళ్లి గోపాల్‌ను కలుసుకో! నాకేం అభ్యంతరం లేదు!" అన్నాను.

"నువ్వు చెప్పింది నాకు అర్థమయింది సాగరీ! కానీ కేసు మొదలయ్యే ముందు అతణ్ని ఒకసారికలుసుకోవడం మంచిదను




ఉంటున్నాను. ఇలా చేస్తే అతనికి కొంచెం మానసిక తృప్తి కూడా కలుగుతుందేమో! కానీ, గోపాల్ ఛాయాదేవి అంత నిబ్బరమున్న మనిషి కాదు!"

"అలా అయితే నువ్వు వెళ్లి అతనికి కొంచెం ధైర్యం చెప్పు. ఛాయాదేవికి ధైర్యం చెప్పనవసరం లేదు" అన్నాను.

"అలాగే సాగరీ! టోనీ సంగతేమిటి?" అని అడిగింది నిరూప.

"టోనీ టెలిఫోన్ నెంబర్ల వేటలో ఉన్నాడు. బాగా కష్టమైన పనే అనుకో! కానీ టోనీ ఈ పని చెయ్యగలడన్న నమ్మకం నాకుంది!"

ఆ ఉదయం పోస్టులో వచ్చిన లా జర్నల్ కాసేపు చదివి, వెళ్లిపోయింది నిరూప. ఆమె వెళ్లాక మేజిస్ట్రేటు ముందు సారా ఇచ్చిన వాంగ్మూలాన్ని చదవడం మొదలు పెట్టాను. నమ్మడానికి వీలు కానంత వివరంగా, పకడ్బందీగా ఉంది ఆమె వాంగ్మూలం!




మూడు రోజులు గడిచాక టోనీ మా ఇంటి నుంచి ఆఫీసుకు ఫోన్ చేశాడు. నేను ఆఫీసులో ఉంటానని తెలిసి కూడా ఇంటికి ఎందుకు వెళ్లాడు? తిల్లీని ఉడికించడానికా? కానీ తిల్లీ పాతకాలం మనిషి. ఆమె దగ్గర టోనీ ఎత్తులూ జిత్తులూ పని చెయ్యవు.

టోనీ మా ఇంటి వైపు ఏదో పని ఉండి వచ్చాడట. ఫోన్ చేసుకోవడానికి ఇంట్లో జొరబడ్డాడట. ఛాయాదేవి కేసుకు సంబంధించినంత మటుకు అతనికి ఇంకా సరయిన వివరాలు దొరకలేదట. సాయంకాలం నాలుగు గంటలకు ఆఫీసుకు రమ్మన్నాను అతణ్ని.

నెమ్మదిగా ఐదుంబావుకు వచ్చాడు టోనీ. వచ్చి సోఫా మీద కాళ్లు ముడుచుకుని కూచుని సిగరెట్ వెలిగించుకున్నాడు. నేను డెస్కు మీది కాగితాలు సర్ది, అతనికి దగ్గరగా వెళ్లి కూచున్నాను.

"టోనీ, ఏమయింది? నిరూపకు రిజల్ట్స్ కావాలట" అన్నాను.

"తమాషానా ఏమిటి? నిరూపకేం? హాయిగా ఏర్ కండిషన్డ్ గదిలో కడుపులో చల్ల కదలకుండా కూచుంటుంది... పని జరగవద్దా? అయినా నేను అనుకున్నదాని కన్నా నీ పని కష్టమైనదే!" అని ఏదేదో చెప్పుకుంటూ పోసాగాడు.

"టోనీ! ఈ కబుర్లు వద్దుకానీ, అసలు విషయానికి సూటిగా రా! కోర్టులో ఫాక్ట్స్ పనికి వస్తాయి కానీ కబుర్లు పనికి రావు. జూరీలకోసం మైళ్ల పొడుగు ఉపన్యాసాలు దంచే రోజులు పోయాయి" అన్నాను.

"నీ లిస్టులో పావు భాగం కన్నా కొంచెం ఎక్కువ కవర్ చేసి ఉంటాను. ఒక్కో నెంబరూ ఒక్కో చోట ఉంది. మన జంటనగరాలు ఇంత పెద్దవని నాకు ఇప్పుడే తెలిసింది. ఎవరి దృష్టినీ ఆకర్షించకుండా ఉండటంకోసం ఒక చోటికి టాక్సీలో వెడితే మరొక చోటికి ఆటోలోనో, బస్సులోనో, ఏ ఫ్రెండు కారులోనో వెళ్లాను."

"తెలివయిన పనే చేశావు. ఇంకా చెప్పు..."

"చెప్పేముందు నా ఆత్మారాముడికి శాంతి జరగాలి!"

టోనీ ఆకలి తీరడానికి ఏర్పాట్లు చేసి, వివరాలు చెప్పమన్నాను.

"నేను ఇంతకు ముందే చెప్పినట్టు కొంతమటుకే కవర్ చెయ్యగలిగాను. మిస్ లీలా ఫెర్నాండో ముసలావిడ. కాటికి కాళ్లు చాచుకుని కూచుంది. నిటారుగా నిలబడటం, చూడటం ఆమెకు చేతగాదు. అంచేత ఆమెను లిస్ట్‌లోంచి తీసెయ్యొచ్చు!" అన్నాడు టోనీ.

"ఫైన్! లీలా ఫెర్నాండోను లిస్ట్‌లోంచి తీసేశాం!"

"శ్రీమతి ఇందిరను చూశాను. చూడ్డానికి బాగానే ఉంది. మొగుడు కెనడాలో ఉన్నాడట. ఈవిడకో కారుంది. ఆమే నడుపుతుంది. వాళ్లమ్మాయి ఇక్కడే చదువుకుంటున్నది. వేసవి సెలవులు వస్తే తల్లీ కూతురూ కెనడా వెడుతూ ఉంటారట. వాళ్ల పక్కింటాయన ఈవివరాలన్నీ చెప్పాడు.

"ఇక శేషాద్రి. ఏదో పెద్ద ఉద్యోగం చేసి రిటైరయ్యాట్ట. కర్నాటక సంగీతం గురించి ఉపన్యాసాలిస్తూ, రాస్తూ ఉంటాడట. పెద్దమనిషి. కాబట్టి మనకు పనికి రాడు..."

"ఓకే! నెక్స్ట్!"

"కఫే అపెండ్స్ మాంసాహార భోజనశాల మరీ చిన్నది. అదీకాక అక్కడున్నది పబ్లిక్‌కాల్ టెలిఫోన్. అంచేత పట్టించుకోనక్కరలేదు" అన్నాడు టోనీ.

"అలా చెప్పడం సబబు కాదు టోనీ చిన్న-చోటు, పబ్లిక్ కాల్ ఆఫీసూ అయినంత మాత్రాన పట్టించుకోకపోతే ఎలా? నేరాల విషయంలోనూ, మనుషుల ప్రవర్తన గురించీ జనరలైజ్ చెయ్యడం మంచిది కాదు" అని నేను చెబుతూ ఉండగా మా ఆఫీస్ బాయ్ తినుబండారాలు పట్టుకు వచ్చాడు.

టోనీ దృష్టి అటు మళ్లింది.

అతను తినడం ముగించాక, "టోనీ, నీ ఆకలి ఎంతో కొంత చల్లారింది కనుక నీవేం చేశావో చెప్పడానికి ఇప్పుడేం అభ్యంతరం లేదు కదా?" అన్నాను.

అతను నవ్వాడు. "అవినాష్ ట్రావెల్స్ అన్నది చిన్న కంపెనీయేగానీ బాగా డబ్బున్న వాళ్ల కంపెనీ అది. వాళ్ల వ్యాపారం అంత బాగులేదట. కానీ వాళ్లను మన అనుమానితుల జాబితాలోంచి తీసెయ్యవచ్చు. నేను కనుక్కున్నంత మటుకు వాళ్ల వ్యాపారం చట్టానికి లోబడే నడుస్తున్నది! ఇక పోతే.. తక్కినవి రెండూ అంతగా పనికిరానివే! ఒకటి హైదరాబాద్ హైపవర్ లాండ్రీ. రెండవది లా బింబా!" అన్నాడు గడగడా పాఠం పల్లిస్తున్నట్లు

"లా బింబా అంటే ఏమిటి? పిల్లల దుస్తులు అమ్మే షాపా? కిండెర్ గార్టెన్ స్కూలా? పేరు చిత్రంగా ఉంది..." అన్నాను.

"కాదు సాగరీ! అది ఇంటీరియర్ డెకరేషన్ చేసే సంస్థట! నే వెళ్లినప్పుడు మూసి ఉంది. అది ఒన్ మేన్ షోలా ఉంది. ఎప్పుడూ ఒక్క మనిషే కనిపిస్తాడట అక్కడ. నేను ఇన్‌కంటాక్స్ నుంచి వచ్చానంటే, ఆ పక్కింటి మనిషి చెప్పాడు. ఈ లా బింబా ఎగ్జిబిషన్‌లలో స్టాల్స్ తయారుచెయ్యడం, ఎగ్జిబిషన్‌లు నిర్వహించడం వగైరా పనులు చేస్తుందట!"

"అంతేనా?" అని అడిగాను.

"ఇప్పటికింతే!" అన్నాడు టోనీ.





కమలనాథ్ లాయర్‌గా ఎంతో అనుభవం, పేరూ ప్రతిష్ఠా గడించి న్యాయశాఖలో చేరాడు.

కోర్టుగది కిటకిటలాడుతూ ఉంది. నల్ల కోట్లూ, నల్ల గౌనులూ తొడుక్కున్న




"సరే! ఇంకా ప్రయత్నించు టోనీ!" అన్నాను.

* * *

ఛాయాదేవి మీద, గోపాల్ మీద ఆరోపించిన శాంతారామ్ హత్యకేసు జడ్జి కమలనాథ్ ముందు విచారణకు వచ్చింది.

లాయర్లు, లీగల్ అప్రెంటిస్‌లు, పోలీస్ ఆఫీసర్లు, కోర్టుఉద్యోగులు, తమాషా చూడడానికి వచ్చినవాళ్లు, పత్రికా విలేకరులు ఒక గుప్పెడు—ఇలా రకరకాల మనుషులు ఆ గదిలో వున్నారు. కోర్టులోపలి వాతావరణం ఉద్రిక్తతతో నిండివుంది.

గోపాల్, ఛాయ ముద్దాయిలకోసం ఏర్పాటుచేసిన బోనులో నిలబడ్డారు. ఇద్దరూ సన్నబడిపోయి బరువు తగ్గినట్టు కనిపించారు. ఛాయను మామూలుగా ఉన్నప్పుడు చూసినవారు ఇప్పుడుచూస్తే గుర్తుపట్టలేరు. అంతగా సడలిపోయింది ఆమె. ఆమె గోపాల్‌వైపు చూడనయినా లేదు. గోపాల్ మాత్రం అడపాదడపా ఆమెను చూస్తూనే వున్నాడు.

ప్రాసిక్యూటర్ జార్జ్ ఇదివరలోకంటే లావుగా కనిపించాడు. కోర్టులో మధ్యగా ఉన్న పెద్దబల్లకు అవతలివైపున నాకు ఎదురుగా కూర్చున్నాడు. అతని పక్కన అతని జూనియర్లు కూచున్నారు.

నేను, నిరూప, పద్మజ, శశికళ బల్లకు ఇవతల ఒకచోట కూచున్నాము. టోనీ మా వెనకగా కూచున్నాడు. మేము ఏ హత్యకేసు తీసుకున్నా టోనీ తప్పకుండా కోర్టుకువస్తాడు.

కోర్టుగుమస్తా ముద్దాయిలమీద ఇండియన్ పీనల్‌కోడ్ ప్రకారం మోపిన నేరాల గురించి చదివి, వాళ్లను ఆ నేరాలుచేశారా అని అడిగాడు. ఛాయ, గోపాల్ ఇద్దరూ తాము ఏ నేరమూ చెయ్యలేదనీ, నిర్దోషులమనీ చెప్పారు. విచారణకు ముందు నేనూ, నిరూపా వాళ్ళిద్దరినీ కలుసుకుని వాళ్ళకు ధైర్యంచెప్పి వచ్చాము.




అలవాటు ప్రకారం జార్జ్ ప్రాసిక్యూషన్ కేసును వివరించడానికి తన కుర్చీలోంచి నాటకీయంగా లేచాడు. నన్నూ, నిరూపనూ పురుగులనుచూసినట్టు చూశాక మాట్లాడడం మొదలుపెట్టాడు. అతని భాష, మాటతీరు పాతవాసన వేస్తూ వుంటాయి. అతని వాదంలో పస లేకపోయినా, అతని కంఠంమాత్రం కంచులా గట్టిగా మోగుతూవుంటుంది.

ముద్దాయిలిద్దరినీ చూస్తూ తనవాదం మొదలుపెట్టాడు. "యువర్ ఆనర్! ఇదొక హత్యకేసు. ఈ మహానగరంలోని గౌరవనీయులైన పౌరుల్లో ఒకరయిన శాంతారామ్ అనే వ్యక్తిని ఛాయాదేవి, గోపాల్ అనే ఈ ముద్దాయిలిద్దరూ ముందుగా ఆలోచించి, పథకంవేసి హత్యచేశారు. ముద్దాయిలిద్దరికీ బాగా ఆస్తిపాస్తులు వున్నాయి. ఆర్థికంగా స్తోమత వుంది; సంఘంలో మంచి అంతస్తు ఉంది. వీటిని మారణాయుధాలుగా వాడుకుని కుట్ర పన్ని ఒకటవ ముద్దాయి ఛాయాదేవి బడిలో పనిచేస్తున్న శాంతారామ్‌ను హత్య చేశారు. ఛాయాదేవి దాబుగా, దర్పంగా కనిపించే నర్సరీ బడి ఒకటి నడుపుతున్నది. దేవీవిద్యాలయం అనే ఆ బడిలో శాంతారామ్ మేనేజర్‌గా పనిచేసేవాడు.

"యువర్ ఆనర్! ఈ కోర్టులో ఒక స్త్రీ గురించి నీచంగా మాట్లాడడం నాకు ఇష్ట




మైనదికాదు. కాని ఈ ఒకటవ ముద్దాయి ఛాయాదేవి విషయంలో అలా మాట్లాడక తప్పేట్టులేదు. చనిపోయిన శాంతారామ్‌తో ఈమెకు అక్రమసంబంధం వుండేది. అది బయటకు పొక్కనీయకుండా ఈమె అతణ్ని తన భర్త అని చెప్పుకునేది. ఇద్దరికీ పెళ్ళంటూ జరగలేదు. ఒకటవ ముద్దాయికి సంబంధించినంతమటుకు శాంతారామ్‌తో సంబంధం తన శారీరక వ్యామోహం, కామవాంఛ మొదలయిన వాటిని తీర్చుకోవడం కోసమే. ఆమె బల మయిన కోరికలున్న మనిషి. ఆమెకు గుండెనిబ్బరం కూడా ఎక్కువే. అందు చేత మరణించిన శాంతారామ్‌ని తన కొంగున ముడివేసుకుని, అతణ్ణి బానిస లాగ తనచుట్టూ తిప్పుకోవాలన్న బల మయిన కోరిక ఆమెలో ఎక్కువయింది. ఈమధ్య హతుడు శాంతారామ్ ఈ ఛాయాదేవిని కాదని ఆమె బడిలో టీచర్‌గా పనిచేస్తున్న సారా అనే యువతిని ప్రేమి స్తున్నాడనీ తెలిసింది..."

జార్జ్ మాటలు విని నేనూ, నిరూపా ఒకరినొకరు చూసుకున్నాం. సారాను శాంతారాం ప్రేమించడమా? జార్జ్ కథ బాగానే అల్లాడనిపించింది!

"యువర్ ఆనర్! సారాను పెళ్లాడా లనుకున్న శాంతారాం ఒకటవ ముద్దా యితో తన సంబంధాన్ని తెంచుకోవాలను కున్నాడు. కానీ ఆమె అందుకు ససేమిరా ఒప్పుకోలేదు. ఆమె పాపిష్టి గుండెలో చెల రేగిన ఈర్ష్యా జ్వాలలు అసహాయుడైన శాంతారామ్ మీద ప్రతీకారం తీర్చుకోవా లన్న కోపాన్ని ఆమెలో రేకెత్తించాయి. ఆమె తన అన్నయ్య, వ్యాపార సహ చరుడు అయిన రెండవ ముద్దాయి గోపాల్ సహాయం తీసుకుంది. వారిద్దరూ శాంతా రామ్‌ను హత్య చెయ్యాలని కుట్రపన్నారు. ఫలితంగా ఛాయాదేవిలో చెలరేగిన మోహం, కోపం, ఈర్ష్యలకు శాంతారామ్ బలి అయిపోయాడు.

"ఒకటవ ముద్దాయి హతుణ్ణి ఎంతో మానసిక ఆందోళనకు గురిచేసింది. ఆ అభాగ్యుడితో ఆమె భయంకరంగా కొట్లా డేది. అతను తన మోహానికి లొంగకపోతే అతని మీదికి ఏవేవో వస్తువులు విసిరేది. చంపుతానని బెదిరించేది. అతను తన మాట వినకపోయేసరికి ఈమె అతణ్ణి చంప డానికి నిశ్చయించుకుంది.

"ఇలా ఉండగా ఒక రోజు— యువర్ ఆనర్! ముద్దాయిలిద్దరూ హతుడి ఇంటికి వెళ్లారు. అతను మంచం మీద పడుకుని నిద్రపోతూ ఉండగా ముద్దాయిలిద్దరూ కలిసి ఒక కత్తితో అతని పొత్తికడుపు, కడుపు, రొమ్ము, ముఖం మొదలయిన భాగాలలో లెక్కలేనన్నిసార్లు పొడిచి చంపేశారు. తనను తాను రక్షించుకోలేని నిస్సహాయుడి మీద క్రూరంగా, భీకరంగా, నిర్దయగా దెబ్బ తీశారు— మోహాంతో కళ్లు కానని ఈ స్త్రీ,ఆమె చేతిలో పని ముట్టుగా ఉన్న ఈ పురుషుడు...

"యువర్ ఆనర్! టూకీగా ఇదీ ప్రాసి క్యూషన్ కేసు సారం. నా ఉపోద్ఘాతం పూర్తి అయ్యాక సాక్షులను ప్రవేశపెడ తాను. ఒకసారి సాక్షులు ఈ ఘోరమైన నేరం గురించిన నిజాలు చెప్పటం మొదలు పెడితే ఈ ఇద్దరు ముద్దాయిల నేరమూ రుజువవుతుంది. అప్పుడు— మనదేశంలో అమల్లో ఉన్న శిక్షాస్మృతి ప్రకారం ఈ ఇద్దరికి తగిన శిక్ష విధించవలసిందిగా కోరుతున్నాను" అన్నాడు జార్జ్.

అని, ఓ చిరునవ్వు నవ్వి కోర్టంతా ఓసారి కలియజూసి, జడ్జి వైపు తిరిగి

మర్యాదసూచకంగా వంగి మళ్లీ నాటకీయంగా తన కుర్చీలో కూచున్నాడు.

నేను నిరూపను చూసి చిరునవ్వు నవ్వాను. ఆమె భుజాలెగరవేసింది. జార్జ్ 'నాకే ఓటు వెయ్యండి' అని ఉపన్యసించే నాయకుడిలాగా ఉపన్యసించాడు!

ప్రాసిక్యూషన్ తరఫున మొదటి సాక్షిగా శాంతారాం ఇంట పాలు పోసే రాధను ప్రవేశపెట్టారు. అతనే మొదట శవాన్ని చూసి పోలీసులకు తెలియజేసిన వాడు. జార్జ్ సూచనలకు అనువుగా అతను- తాను సాయంకాలం శాంతారాం ఇంటికి పాలు తీసుకుని వెళ్లడం, అప్పుడు శాంతారాం శవాన్ని చూడడం మొదలైన వివరాలన్నీ కళ్లకు కట్టేలా వర్ణించి చెప్పాడు. అతను ప్రాసిక్యూటర్ ప్రశ్నలకు జవాబులు చెబుతూ ఉండగా నిరూప నాకో చీటీ ఇచ్చింది. 'ఈ సాక్షి కాస్త నెర్వస్‌గా ఉన్నట్టున్నాడు. ఒక పట్టు పడతావా ఏం?' అని రాసి ఉంది అందులో. ఆ కింద 'అవసరం లేదు నిరూ! ఎందుకంటే శాం చనిపోయాడన్న విషయం గురించి మనకేం అనుమానం లేదు కదా?' అని రాసి చీటీ నిరూపకిచ్చాను.

లాయర్లకు క్రాస్ ఎగ్జామినేషన్ గొప్ప ఆయుధంగా పనికివస్తుంది. అయితే అది రెండు వైపులా పదునుగా ఉండే ఆయుధం. అనుభవం లేనివాళ్లు, దూరదృష్టిలేనివాళ్లు క్రాస్ ఎగ్జామినేషన్‌కు పూనుకుంటే అది వాళ్లనూ, వాళ్ల క్లయంట్లనూ దెబ్బ తీస్తుంది. తెలివైన లాయర్- క్రాస్ ఎగ్జామినేషన్ చెయ్యవలసి ఉంది గనుక చెయ్యాలి అనుకోకూడదు. మా సీనియర్ అవధానిగారు పదే పదే చెప్పేవారు- "సాక్షి నీకు వ్యతిరేకంగా ఏమీ చెప్పకపోతే అతణ్ణి వదిలిపెట్టెయ్" అని. ఆ పాఠం నాకు ఎంతో సహాయం చేసింది. క్రాస్ ఎగ్జామినేషన్ చెయ్యవలసి వచ్చినప్పుడు అనవసరమైన ప్రశ్నలు వేసి- కేసులో ఉన్న అసందర్భాల సందుల లోంచి తమ క్లయంట్లను బయటకు లాగడానికి బదులు ఆ సందులు పూడ్చి క్లయంట్లకు సమాధులుకట్టిన లాయర్లనూ నేను చూశాను.

జార్జ్ సంప్రదాయం ప్రకారం తన ఎగ్జామినేషన్ పూర్తి చేశాడు. నాకు సాక్షిని క్రాస్ ఎగ్జామిన్ చేసే అవకాశం దొరికింది. నేనా పని బాగా చేస్తానన్న పేరు ఉండటంవల్లా, న్యాయవాద ప్రపంచంలో పేరు ప్రతిష్టలు గడించిన మహిళా న్యాయవాదినులు తక్కువగా ఉండటంవల్లా- దాదాపు కోర్టులోని కళ్లన్నీ నా మీదే ఉన్నాయి. కోర్టులో ప్రేక్షకులు గుమిగూడడానికి అదీ ఒక కారణం. నా రూపురేఖలు వాళ్ళకు బోనస్‌గా పనికి వస్తాయి!

రాధ- నల్లగా పొట్టిగా లావుగా ఉన్నాడు. అతని తల బట్ట కడుతూ ఉంది. అతని గుబురు మీసాలు ప్రత్యేకంగా కనిపిస్తున్నాయి. అతను భయపడుతున్నాడని తెలిసిపోతూ ఉంది. అతణ్ని ఒకసారి చూసి పలకరింపుగా చిరునవ్వు నవ్వాను.

"రాధగారూ! మీరు శాంతారామ్ ఇంటికి పాలు తీసుకు వెళ్ళి ఇస్తూ ఉండే వారన్నారు కదా? ఎన్నాళ్లనుంచి అలా చేస్తున్నారు?"

"మూడేళ్ళనుంచి"

"ఈ మూడేళ్లలో ఆ ఇంట్లో ఇక్కడ బోనులో ఉన్న ఇద్దరిలో ఎవరినయినా చూశారా?"

"లేదు. ఎప్పుడూ చూడలేదు"

"అలాగా! మరి, పాలు ఎవరు తీస

కునేవారు?"

"కొన్ని రోజులు పసిమనుషులు. ఎప్పుడయినా ఒక ఆడమనిషి"

"ఆడమనిషా ?" అన్నాను నేను ఆశ్చర్యం నటిస్తూ.

"అవును"

"ఒక్క ఆడమనిషేనా?"

"కాదు. చాలా మంది"

కోర్టులో సన్నటి నవ్వు చెలరేగింది.

"ఎంత మంది?" అడిగాను నేను.

"నేను లెక్క పెట్టలేదమ్మగారూ!" అన్నాడు రాధ. కోర్టులో నవ్వులు ఎక్కువయ్యాయి.

"ఎంత మంది?"

"చాలా మందే అమ్మా!"

"వాళ్ళలో ఇక్కడ బోనులో నిలబడ్డ ఆమె ఉందా?"

"లేదు నేనీమెను ఎప్పుడూ చూడలేదు"

"అంతే యువర్ ఆనర్!" అని కూచున్నాను.

తర్వాత సాక్షి—నేరం జరిగిన స్థలం గురించిన చిత్రాలు తయారుచేసిన సర్వేయర్. అతనిది రొటీన్ సాక్ష్యం. అందుచేత అతనితో నాకేమీ పేచీ లేదు. "నో క్వెశ్చన్స్!" అన్నాను. నా వైపు చూసి సన్నగా నవ్వి జడ్జికి నమస్కరించి అతను సాక్షి బోనులోంచి దిగి వెళ్ళాడు.

తర్వాత సాక్షి అశోక్‌నగర్ పోలీస్ స్టేషనుకు చెందిన ఒక హెడ్‌కానిస్టేబుల్. రాధ, అతని మిత్రులు వెళ్ళి కంప్లయింట్ ఇవ్వగానే వచ్చి శవాన్ని చూసి తక్కిన కార్యక్రమాలకు ఏర్పాటు చేసినవాడు. అతను పొడుగ్గా, లావుగా ఉన్నాడు. అతని టోపీ కింది నుంచి నెరసిన జుట్టు తొంగి చూస్తూ ఉంది. మైకులు లేకుండా ఉపన్యాసం చేస్తున్నవాడిలాగా పెద్దగా, బొంగురుగా మాటాడుతున్నాడు అతను. అతణ్ని నేను గానీ, నిరూప గానీ ఏ ప్రశ్నలూ అడగలేదు.

సరిగా అప్పుడే భోజన విరామం కోసమని కోర్టు వాయిదా పడింది. మేమందరమూ ఓ ఏర్ కండిషన్డ్ హోటలుకు భోజనానికి వెళ్ళాము.

"టోనీ! లంచ్ అయ్యాక నువ్వు కోర్టుకు రానక్కరలేదు. ఆ టెలిఫోన్ నెంబర్ల పని పట్టు. రాత్రి మా ఇంటికిరా. బహుశా మనం ఈ రాత్రి వేటకు వెళ్ళాల్సి ఉంటుంది" అన్నాను. టోనీ సరేనన్నాడు.




భోజన విరామం అయ్యాక కోర్టు గదిలో ఉదయంకన్నా ఎక్కువ మంది చేరారు. దాంతో ఆ గది వెచ్చగా తయారయింది. టోనీ వెళ్ళిపోయాక, అతను కూచున్న చోట మా మరొక జూనియర్ కళ్యాణి కూచుని, విచారణ తాలూకు నోట్సు రాయడం మొదలు పెట్టింది. జార్జ్ చెమటలుకక్కుకుంటూ తన ఎగ్జామినేషన్ ఇన్ చీఫ్ కొనసాగించాడు.

తర్వాత సాక్షి డాక్టర్ రాజమన్నార్. ఆయనే శవాన్ని పోస్ట్‌మార్టమ్ చేసిన పేథాలజిస్ట్. నేను ఎదుర్కోవలసిన ప్రధాన సాక్షులలో మొదటివాడు ఆయనే. రాజ

మన్నార్ ఈ వ్యవహారాలన్నిటికి బాగా అలవాటు పడ్డవాడు. నాకు మంచి స్నేహితుడు. ఆయన శవం ఒంటిమీద కనిపించిన గాయాల గురించీ, వాటి లోతుపాతుల గురించీ వివరంగా చెప్పాడు. హత్య జరిగిన సమయం గురించీ, వైద్య సంబంధమైన తక్కిన అంశాల గురించీ కూడాచెప్పాడు. రాజమన్నార్ మాటల్లో ఆయన సామర్థ్యం, ఆత్మవిశ్వాసం ధ్వనించాయి.

నేను కుర్చీలోంచి లేవగానే కోర్టు గదిలో ఒక్కసారిగా నిశ్శబ్దంఆవరించింది. డాక్టర్ రాజమన్నార్‌ను క్రాస్‌ఎగ్జామినేషన్ చెయ్యడం కొంచెం కష్టమైన పని. అందు చేత నా స్థాయిలో నేను ఆయనను ఎలా ఎదుర్కొంటానో చూడాలన్న ఉత్సుకత అప్పుడు అక్కడున్న సాటి లాయర్లలోనూ,నా స్నేహితులలోనూ కనిపించింది.

నేను చిరునవ్వు నవ్వితే రాజమన్నార్ అందుకు సమాధానంగా తలపంకించాడు.

"డాక్టర్!హతుడు శాంతారాం ఆరోగ్యవంతుడేనా?"

"ఆరోగ్యవంతుడే! నా పరీక్షను బట్టి అతని శరీరం మంచి కండిషన్‌లో ఉంది. అంటే అతను బాగా ఆరోగ్యవంతుడనే చెప్పాలి"

"అంటే-శారీరకంగా బలవంతుడేనా?" అని అడిగాను.

"అలా చెప్పవచ్చు - కావాలంటే" అన్నాడు రాజమన్నార్.

"అవునా కాదా తేల్చి చెప్పండి డాక్టర్!" అన్నాను.

జార్జ్ అసంతృప్తిగా తీక్షణంగా నావైపు చూశాడు.

"అవును"

"మీరు ఆ శరీరాన్ని పరీక్షించినప్పుడు ఆవ్యక్తికి ఏదయినా మత్తుమందు ఇచ్చినట్టుగానీ, ఆ వ్యక్తి మత్తులో ఉన్నట్టుగానీ ఏవయినా గుర్తులు కనిపించాయా?"

"లేదండీ! అటువంటి గుర్తేదీ కనిపించలేదు"

"అలాగా...! మరయితే శవం మీది గాయాలు తీవ్రంగానూ, ప్రాణాపాయకరంగానూ ఉన్నాయన్నారుకదా?"

"అవును"

"అంటే-గాయాలు అంత తీవ్రంగా, ప్రాణాపాయకరంగా ఉండాలంటే బాగా బలంగా పొడిచి ఉండాలేమోగదా?"

"అవును!"

"అంటే పొడవడానికి బాగా బలం ఉండి ఉండాలేమోగదా?"

డాక్టర్ నా లక్ష్యం గ్రహించి బిగుసుకుపోయాడు.

"అలా అని చెప్పవచ్చు!"

"డాక్టర్ రాజమన్నార్! దయచేసి ఉండాలా లేదా అని కచ్చితంగా చెప్పండి. మీరు ప్రొఫెషనల్ విట్‌నెస్! దయచేసి ఇంకా స్పెసిఫిక్‌గా చెప్పండి" అన్నాను నా స్వరాన్ని కొంచెం పెంచి.

జార్జ్ అడ్డు చెప్పడానికి లేవబోయి మళ్ళీ ఎందుకన్నట్టు కూచున్నాడు.

"పొడవడానికి బలం ఉండాలి!" అన్నాడు డాక్టర్.

"అంటే ఒక స్త్రీ బలంగా, ఆరోగ్యంగా ఉన్న పురుషుణ్ని అంత బలంగా పొడవడం మామూలుగా సాధ్యం కాదేమో కదా?" అని అడిగాను.

కోర్టులో చిన్న సంచలనం చెలరేగింది. జడ్జి కూడా నా వైపు తెలుసునన్నట్టు చూశాడు.

"ఒక స్త్రీకి అది కష్టమైన పనే!"

"ఆ కత్తిని మీరు ఇందాక చూశారు కదా?"

"చూశాను"

"ఆ ఆయుధంతో ఒక స్త్రీ బలిష్ఠుడైన ఒక పురుషుణ్ని చంపగలదా?"

"కష్టమే! హతుడు ఎదుర్కొని తీరుతాడు"

"అంటే హతుడు ఆత్మరక్షణ చేసుకోబోయి అడ్డుతగిలి ఉండాలి కదా?"

"తప్పకుండా"

"ఆ ప్రయత్నంలో పరుపులూ, దిండ్లూ అస్తవ్యస్తంగా అయిఉండాలేమోకదా?"

"అవును. అలా జరిగి ఉండాలి"

"డాక్టర్! మీరు శవాన్ని ఎప్పుడు ఎక్కడ చూశారు?"

"పోలీసుల పిలుపును అందుకుని హత్య జరిగిన ఒక ఇంట్లోనూ, ఆ తర్వాత పోస్టుమార్టం చేసినప్పుడూ..."

"ఆ ఇంట్లో మీరు హతుడి దేహాన్ని ఎక్కడ చూశారు?"

"ఆ ఇంటి మేడమీది గదిలో పరుపు మీద"

"పరుపు మీద సంఘర్షణ జరిగిన గుర్తులేవయినా ఉన్నాయా?"

"నేను చూసినంతమటుకు ఏవీలేవు. ఆ విషయం
నా వర్కు బుక్‌లో విడిగా రాసుకున్నాను కూడా..."

కోర్టు ఆవరణ గుసగుసలతో నిండి పోయింది.

"అలాగా! గోడలమీదగానీ, నేలమీద గానీ రక్తంగుర్తులు కనిపించాయా?" అని అడిగాను.

"పరుపుమీద శవం నడుము కింది భాగానవున్న రక్తపు పడియ మాత్రమే నాకు కనిపించింది"




"మీరు ఇంతకుముందు చెప్పినట్టు బల ప్రయోగం జరిగిఉంటే శవం చుట్టు పక్కల బాగా రక్తం చిమ్మిఉండేది కదూ?"

"ఇది హైపొతెటికల్ క్వెశ్చన్. ఇటు వంటి ఊహగురించి సందిగ్ధంగా మాటాడ్డం నాకు అసహ్యం. కానీ ఎక్కువ రక్తం చిమ్మడానికి అవకాశం వుందని మాత్రం చెప్పగలను"

"మీరు చూసినదానికంటె ఎక్కువా?" అని ప్రశ్నించాను.

"కరెక్ట్" అన్నాడు డాక్టర్ రాజమన్నార్ ముక్తసరిగా.

"అంటే మరెక్కడయినా హత్యచేసి శవాన్ని పరుపుమీద పడవేసి వుండవచ్చేమోకదా?"

జార్జ్ చివాలున లేచాడు.

"యువర్ఆనర్! ఐ ఆబ్జెక్ట్. ఇది సక్రమమయిన ప్రశ్నకాదు. ఇట్ ఈజ్ కాలింగ్ ఫార్ అన్ ఆర్గ్యుమెంట్ అండ్ కంక్లూషన్. అది ఈ సాక్షి సమాధానం చెప్పలేని ప్రశ్న. ఈ ప్రశ్నకు నా అభ్యంతరాన్ని తెలియజేస్తున్నాను" అన్నాడు.

జడ్జిగారు చిరునవ్వు నవ్వి నన్ను చూసి జార్జ్‌వైపు దృష్టిమళ్ళించి, "మిస్టర్ ప్రాసిక్యూటర్! ఈ డాక్టర్‌గారు ప్రొఫెషనల్ విట్నెస్ కదా?" అని అడిగారు.

"విత్ రెస్పెక్ట్ ఐ అగ్రీ, యువర్ ఆనర్! అయితే డాక్టరుగారి సామర్థ్యం వైద్య విషయాలకే పరిమితంకానీ చట్ట సంబంధమైన వాదాల విషయంలో ఆయన అభిప్రాయం అడగటం సబబుకాదేమో!" అన్నాడు జార్జ్.

"వెరీవెల్! మీ అభ్యంతరాన్ని అంగీకరిస్తున్నాను. మిసెస్‌రావ్! మీరు అలాంటి ప్రశ్న అడగడానికి వీలులేదు..."

జడ్జిగారి అభిప్రాయం విని గెలిచాను

అన్నట్టు నన్ను చూసి, తన కుర్చీలో కూచున్నాడు జార్జ్.

"అలాగే యువర్ ఆనర్!" అని నేనూ కూచున్నాను. తర్వాత గోపాల్ పక్షాన నిరూప డాక్టర్‌ను కొన్ని ప్రశ్నలడిగింది.

తర్వాతి సాక్షి అహమద్. వేలిముద్రల నిపుణుడు. ఫోరెన్సిక్ సైన్స్ శాఖలో పని చేస్తున్నాడు. ఇక్కడేకాక ఇతర నగరాలలో జరిగే నేరాల పరిశోధనలో కూడా ఎంతగానో తోడ్పడుతూ వుంటాడు; వేలి ముద్రలద్వారా నేరాలను పరిశోధించడం గురించి ఎన్నెన్నో రచనలుచేసి ప్రపంచ వ్యాప్తంగా పేరు గడించినవాడు. నేను ఖాన్‌గారితో పనిచేస్తున్న రోజులనుంచీ

అహమద్‌గారు తెలుసు. ఇద్దరూ దూరపు బంధువులేఅయినా సన్నిహితంగా వుండే వారు.

వ్యక్తులకు సంబంధించిన నేరాలలో వేలి ముద్రలు ప్రముఖపాత్ర వహిస్తాయి. ఏ ఇద్దరి వేలిముద్రలమధ్య పోలికఉండదన్న సూత్రం-వేలిముద్రలద్వారా నేరాల పరిశోధన చెయ్యడానికి ప్రాతిపదిక. అహమద్ ప్రాసిక్యూషన్ సాక్షులలో ముఖ్యమయినవారిలో ఒకరు. ఆయన ప్రమాణం చేస్తూవుండగా నేను బోనులోని ఇద్దరు ముద్దాయిలనూ చూశాను.

ఛాయ, గోపాల్ ఇద్దరూ హత్య జరిగిన చోటికి వెళ్ళి అక్కడ తమ వేలిముద్రలు ఎన్నోచోట్ల వదిలివచ్చారని నాకు తెలుసు. ఆఖరికి హత్యకు ఉపయోగించిన కత్తిమీద కూడా వాళ్ళ వేలిముద్రలు వున్నాయి. జార్జ్ ఈ విషయాలను ప్రత్యేకించి భూతద్దంతో చూపించడానికి ప్రయత్నిస్తాడు. నేనూ, నా క్లయింట్లు తప్పించుకోవడానికి వీలుకాని ఇబ్బందిలో ఉన్నామనిపించింది.

జార్జ్ అహమద్‌కు సంబంధించి ఎగ్జామినేషన్ ఇన్ చీఫ్ ప్రారంభించి ఒక్కొక్క ప్రశ్న అడిగి వివరంగా జవాబులు రాబట్టసాగాడు. ఆ జవాబులువిని ఛాయ,గోపాల్ బాధతో మెలికలు తిరిగిపోయి నిరాశతో కుంగిపోసాగారు. ఛాయ చీరకొంగును నోట్లో కుక్కుకుంది. బహుశా ఆమె మౌనంగా ఏడుస్తూ ఉండి ఉండాలనుకున్నాను. పాపం ఛాయ! నాకు తెలిసినంత మటుకు ఆమె ఈహత్య చెయ్యలేదు. కానీ నేను 'దాన్ని కోర్టులో ఋజువు చెయ్యాలి కదా!

జార్జ్ నన్ను క్రాస్ ఎగ్జామిన్ చెయ్యమని కూచున్నాడు. నేను లేవగానే అహమద్ పలకరింపుగా నవ్వాడు. ఖాన్ గారిని పెళ్ళి చేసుకోమని నాకు సలహా లిచ్చిన పెద్దమనుషుల్లో ఆయనాఉన్నాడు. నా విషయంలో జోక్యం కలుగజేసుకోవద్దని అప్పట్లో ఆయనకు చెప్పాను కూడా.

"మిస్టర్ అహమద్! మీరు అనుభవమూ, గౌరవమూ గడించిన ఫింగర్ ప్రింట్ ఎక్స్‌పర్ట్..." అన్నాను.

"అలా అనే అనుకుంటాను!" అని నవ్వాడు ఆయన.

"మీ శాస్త్రం ప్రకారం ఏ వేలిముద్ర ఎప్పుడు పడి ఉంటుందో ఖచ్చితంగా చెప్పడం సాధ్యం కాదనుకుంటాను. ఒక వేలిముద్ర ఒకచోట ఎంతకాలం నుంచి ఉందో చెప్పలేం. కదూ?"

"ఏవి ఇటీవలివో, ఏవి ఇంతకు ముందు పడి మాసిపోయినవో చెప్పవచ్చు. అంతకు మించి ఏ ముద్ర ఎప్పుడు పడింది అని ఖచ్చితంగా చెప్పే స్థాయికి ఈ శాస్త్రం ఇంకా అభివృద్ధి చెందలేదు. లేసర్ కిరణాలు ఉపయోగించి ఆ నిర్ణయం చెయ్యవచ్చునేమోగానీ ఇప్పటికి మాత్రం అది వీలుకాదు"

నేను తలఊచి, కోర్టుగుమాస్తా దగ్గరకి వెళ్ళి "నాకు ఆ ఎం.ఒ. నెంబర్ వన్- ఆ కత్తి ఇస్తారా?" అని అడిగాను. ఆయన ఇచ్చాడు.

"మిస్టర్ అహమద్! వేలిముద్రల కోసం మీరు పరిశోధించిన కత్తి ఇదే కదూ?" అని అడిగాను.

అహమద్ కత్తి నా నుంచి తీసుకుని, అటూ ఇటూ జాగ్రత్తగా తిప్పి చూసి "ఇదే" అన్నాడు.

"ఇదివరలో మీ ఎగ్జామినేషన్ ఇన్ చీఫ్‌లో ఈ కత్తి మీది వేలిముద్రలు





ముద్దాయిల వేలిముద్రలతో సరిపోయాయి అన్నారు. కదూ?"

"అవును"

"ముద్దాయిలిద్దరి వేలి ముద్రలూ ఉన్నాయా?"

"ఉన్నాయి"

"అయితే మిస్టర్ అహమద్ కత్తి మీద ఏయే భాగాల్లో వేలిముద్రలు కనిపించాయి?"

అహమద్ తన చేతిలోని ఫైలు తెరిచి అందులోని నోట్స్‌ను సంప్రదించి, "కత్తి పిడి మీద-అంటే ఇక్కడ..." అన్నాడు.

"కత్తి పిడిమీద కాక కత్తి మీద-అంటే బ్లేడ్‌మీద ఏవయినా వేలిముద్రలు కనిపించాయా?" అని అడిగాను.

"బ్లేడ్‌ను పరిశీలించాను. అది రక్తంలో తడిసి ఉంది. నేను చూసేసరికి కత్తిమీద రక్తం ఎండిపోయి ఉంది..."

ఆయనకు అడ్డుతగిలి, "మిస్టర్ అహమద్! బ్లేడ్‌మీద ముద్దాయిల వేలిముద్రలు కనిపించాయా?" అని అడిగాను.

"లేదు" అన్నాడు ఆయన.

"అయితే, ఈ ప్రశ్న జాగ్రత్తగా వినండి. కత్తి మీద ముద్దాయిలవికాక మరెవరి వేలిముద్రలైనా కనిపించాయా?" అని అడిగాను.

అహమద్ మళ్ళీ ఫైలు తెరిచి చూడసాగాడు. జార్జ్ కుర్చీలో అసహనంగా కదులుతున్నాడు.

"ఉన్నాయి!"

"అయితే ఆ వేలిముద్రలు ఎవరివో చెబుతారా?"

"చెప్పలేను"

"ఎందువల్ల?" అని అడిగాను.

"ఆ వేలిముద్రలు ఎవరివో కనుక్కునే ప్రయత్నం జరగలేదు. వాటిగురించి నాకు సూచనలేవీ ఇవ్వలేదు" అన్నాడు అహమద్.

కోర్టులో ఉన్నట్టుండి అలజడి మొదలయింది. జడ్జి బల్లగుద్ది కోర్టును నిశ్శబ్దం చెయ్యవలసి వచ్చింది.

నేను—"ఐసీ! వెరీవెల్! ఇందులో మీ తప్పేమీ లేదు" అన్నాను. "మిస్టర్ అహమద్! ఇంకో ప్రశ్న. కత్తి పిడిమీద ముద్దాయిల వేలిముద్రలు కనిపించాయి అన్నారు. హత్య జరిగాక కత్తి హతుడి దేహంలో పొడిచిఉన్నప్పుడు-ముద్దాయిలు కత్తి పిడిని ముట్టుకోవడంవల్ల వాళ్ళ వేలిముద్రలు దానిమీద పడిఉండవచ్చుకదా?"

జార్ ఎగిరి గంతువేసి అభ్యంతరం తెలియజేశాడు. జడ్జి ఒక క్షణం ఆగి, నెమ్మదిగా—"అభ్యంతరం తోసిపుచ్చాను. సాక్షి ప్రశ్నకు జవాబు చెప్పాలి" అన్నారు.

"మిస్టర్ అహమద్! నేను అడిగిన ఆ చివరి ప్రశ్నకు జవాబు చెప్పగలరా?"

"మీరు చెప్పినట్టు హత్య జరిగాక ముద్దాయిలు కత్తి పిడిని ముట్టుకోవడం వల్ల వాళ్ళ వేలిముద్రలు పిడిమీద పడి ఉండవచ్చు. అయితే ఏ వేలిముద్ర ఎప్పుడు పడిందో ఖచ్చితంగా చెప్పడానికి వీలులేదు" అన్నాడు ఆయన.

"థాంక్యూ!" అన్నాను నా క్రాస్ ఎగ్జామినేషన్ ముగించి.

అంతటితో ఆ రోజుకు కోర్టు ముగిసింది. అరగంట తర్వాత మేము మా ఆఫీసుకు చేరుకున్నాము.

రాత్రి చెయ్యవలసినపని ఎంతో ఉంది. అందువల్ల ఆఫీసునుంచి త్వరగా బయటపడ్డాను. నేను ఇంటికి వెళ్ళేసరికి టోనీ అక్కడ కూచుని ఉన్నాడు - నల్లటి



డ్రెస్‌లో.

* * *

గబగబా భోజనం కానిచ్చి, ముదురు నీలి రంగు జీన్స్, స్వెటర్ ధరించి బయలు దేరాను. టోనీ తన పనిముట్లపెట్టె తీసుకు వచ్చాడు.

ఇద్దరమూ వెళ్ళి అతని స్నేహితుడి కారెక్కాము.

"ఎటు పోవుచున్నాము?" అని అడిగాడు టోనీ.

"లా బింబా!"

"ఏమిటి? ఆ పేరు మన లిస్ట్‌లోంచి కొట్టేశామనుకున్నానే?" అన్నాడు టోనీ.

"కొట్టేసింది నీవు. నేనుకాదు!"

"అకస్మాత్తుగా నీకేదో తట్టిందన్న మాట!"

"తట్టడంకాదు. అంతకన్నా ఎక్కువే"

"అదెలాగా?" అని అమాయకంగా అడిగాడు టోనీ.

"టోనీ! నీవు ఆ వివరాలన్నీ చెప్పాక నేను వాటి గురించే ఆలోచిస్తున్నాను. లా బింబా అనే పేరు నాకు ఆశ్చర్యం కలిగించింది. నీలాగే నాకూ మొదట ఏమీ అనిపించలేదు. అదేదో బడో, బట్టలషాపో అయి ఉంటుందనుకున్నాను. నెమ్మదిగా నా ఊహకు ఒక ఆకారం ఏర్పడింది"

"ఇంటరెస్టింగ్"

"లా బింబా అంటే ఏమిటో తెలుసా?" అని అడిగాను.

"తెలియదు" అన్నాడు టోనీ.

"బింబా—అంటే బింబం. నీడ, ప్రతిబింబం, ఛాయా, ఛాయ చిత్రం, ఫొటో— వీటి మధ్యగల సంబంధం గమనించు"

"ఓహో! అలా వచ్చావన్నమాట. అంటే లా బింబాకూ, ఆ ఫొటోలకూ సంబంధం ఉండి ఉండాలంటావా?"

"నాకు తెలియదు. ఇప్పుడు మనం వెళ్ళి చూడవలసింది అదే!"

"లా బింబా...లా బింబా!" అంటూ తన్మయత్వంలో పడిపోయాడు టోనీ.

కారు అబిడ్స్ సమీపించింది. అర్ధరాత్రి దాటింది. ఒకటి అరా కార్లు తప్ప రోడ్డుమీద వాహన సంచారంలేదు. కొందరు ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ నడిచిపోతున్నారు. అటూ ఇటూ ప్లాట్‌ఫార్మ్‌లమీద కొందరు ముడుచుకుని పడుకుని ఉన్నారు.

"టోనీ! లా బింబా దగ్గరగా కారు ఆపు. మనం ఎక్కువ దూరం నడిస్తే ఎవరికయినా అనుమానం కలగవచ్చు. కనుక కారు లా బింబా పక్కనే ఆపి లోపలికి వెళదాం. ఎవరయినా చూస్తే మనం ప్రేమికుల్లా ప్రవర్తిస్తాం. సరేనా?" అన్నాను.

"ఐడియా బాగుంది సాగరీ!" అంటూనే లా బింబాముందు కారు ఆపాడు టోనీ.

ఇద్దరమూ గ్లోవ్స్ తొడుక్కుని పనిముట్లపెట్టె తీసుకుని గేటు తోసుకుని లోపలికి వెళ్ళాము. తాళంవేసి ఉంది!

టోనీ పెట్టెలోంచి తాళాలగుత్తి తీసి తాళం తెరవడానికి ప్రయత్నం చేస్తుండగా నేను ఎవరయినా అటు వస్తారేమో అని చూస్తున్నాను. అంతలో ఒక వ్యక్తి అటువచ్చి వీధిలో నిలబడి మమ్మల్నే చూస్తున్నాడు. ఒకక్షణం నాకు గుండె ఆగినంత పనయింది. మరుక్షణం టోనీమీద వాలిపోయాను. అంతే! మరి కొన్ని క్షణాలలో ఆ వ్యక్తి అక్కడ లేడు!




"టోనీ! అతను వెళ్ళిపోయాడు. మన పని కానిద్దాం" అన్నాను. టోనీ తాళం తీసి తలుపు తెరిచాడు. ఇద్దరమూ లోపలికి వెళ్ళాము. తలుపు వేసే ముందు ఒకసారి వీధిలోకి చూశాను. ఎవరూమమ్మల్ని చూడటం లేదని తేల్చుకున్న తర్వాత తలుపు వేశాను. లోపలికి వెళ్ళి లైటు వేశాను. ఎవరన్నా చూస్తే మేము దొంగలం కామని అనుకోవడానికి వీలుగా. మొత్తం నాలుగు చిన్న గదులున్నాయి. దాదాపు ప్రతి చోటా గోడలను అలంకరించడానికి పనికివచ్చే వాల్ పేపర్ చుట్టలు పడి ఉన్నాయి. అలాగే ఇమిటేషన్ మొసాయిక్ పెంకులు, బ్లూ ప్రింట్స్, బ్లోఅప్ చేసిన ఫొటోలు కూడా ఉన్నాయి. అవి కాక ఫైళ్ళు, చిట్టాలు, లాబింబా ఏర్పాటు చేసిన ప్రదర్శనల ఫొటోలున్న ఆల్బమ్స్ ఉన్నాయి. కొందరు మాడల్స్ తాలూకు ఫొటోలు కూడా కనిపించాయి.

ఒక గదిలో చెక్కతో చేసిన అడ్డు గోడ అందులో ఒక తలుపు కనిపించింది. టోనీ ఆ తలుపుకున్న తాళం తెరిచాడు. ఆ గదిని ఫొటోలు డెవలప్ చెయ్యడానికి పనికివచ్చే డార్క్ రూమ్ ఉపయోగిస్తున్నట్టున్నారు. ఫాల్స్ సీలింగ్, చుట్టూ నల్లటి తెరలు ఉన్న ఆ గదిలో ఒకవైపు గోడ పక్కగా ఉన్న బల్లమీద ఎనామెల్ పళ్లాలు, చిన్న చిన్న సీసాలు, పసుపు రంగు ఎన్వలప్స్ కొన్నీ కనిపించాయి.

"టోనీ! మనం సరయిన చోటికే వచ్చాము. త్వరగా వెతకాలి. క్విక్" అన్నాను. నాలో ఉత్సాహం కట్టలు తెంచుకుంటూ ఉంది.

టోనీ ఆ గదిలోని స్విచ్ బోర్డ్ను వెదికి పట్టుకుని ఒక స్విచ్ నొక్కి అక్కడున్న ఎర్ర దీపాన్ని ఆన్ చేశాడు. ఆ వెలుగులో ఆ గదిమూల ఒక కేబినెట్ కనిపించింది. ఆ కేబినెట్ కు రెండు తాళాలు వేసి ఉన్నాయి. టోనీకి మళ్ళీ పని తగిలింది.

అతను ఆ తాళాలు తెరిచే ప్రయత్నంలో ఉండగా, నేను పెన్ టార్చ్ తీసుకుని ఆ పైగదిలోంచి బయటపడ్డాను. వీధివైపు ఉన్న ఒక గదిలోకి వెళ్లాను. ఆ గదిలో ఒక సోఫా కమ్ బెడ్- బెడ్ లాగ ఒక మూలగా పరిచి ఉంది. దాని కింద వంగి చూస్తే చెత్తబుట్ట కనిపించింది. దాన్ని లాగి చూస్తే దాన్నిండా ఉండలుగా చుట్టిపడేసిన కాగితాలెన్నో కనిపించాయి. వాటిని ఆ గదిలో పడి ఉన్న కాగితం సంచీ ఒకదానిలో పడేసి, ఆ సంచీని తీసుకున్నాను.

అంతలో టోనీ అడుగుల చప్పుడు వినిపించింది.

"సాగరీ! నేను ఆ కేబినెట్ తెరిచేశాను. అందులో నెగటివ్లు, ఫైళ్ళు, అడ్రెసులు మరేవో కాగితాలూ ఉన్నాయి" అన్నాడు టోనీ గదిలోకి వచ్చి రహస్యంగా.

"రా టోనీ! అవేమిటో చూద్దాం. నాకెందుకో మనం ఏదో బంగారు గనిలోకి వచ్చినట్టుంది" అన్నాను.




ఇద్దరమూ గబగబానడిచి డార్క్‌రూమ్ చేరుకుని ఆ కేబినెట్‌ను పరిశీలించడం మొదలుపెట్టాము. మొదటి సొరుగులో పుస్తకంలాగా ఉన్న ఫైలొకటి ఉంది. అందులో ఎన్నో విజిటింగ్ కార్డులు అతికించి ఉన్నాయి. ఆ కార్డుల్లో వ్యాపారస్థులు ఎలక్ట్రీషియన్లు మొదలైనవారి చిరునామాలున్నాయి. ఆ ఫైలు వల్ల నాకేం లాభం లేదనగానే టోనీ ఆ సొరుగును లోపలికి తోసి, రెండవ సొరుగును లాగాడు. అందులో చెక్ పుస్తకాలు, పే ఇన్ స్లిప్స్, స్టాంపు పేపర్లమీద రాసిన అగ్రిమెంట్లు మొదలయినవి ఉన్నాయి. వాటిని ఒకసారి చకచకా తిరగవేసేసరికి 'లాబింబా' యజమాని పేరు దీనబంధు అని తెలిసింది. అతను ఎలా ఉంటాడో అనుకుంటూ ఉండగా, అతని పాస్‌పోర్టు కనిపించింది. దీనబంధుకు జుట్టు బాగా ఎక్కువే. కళ్ళద్దాలు వేసుకుని, సైడ్ బర్న్స్ పెంచుకుని కనిపించాడు. చూడ్డానికి కళాకారుడిలాగా ఉన్నాడు. బహుశా అతను చిత్రకారుడు అయి ఉండాలనుకున్నాను. ఢిల్లీలో నాకు తెలిసిన ఆర్కిటెక్టు ఒకాయన నాతో పదేపదే అనేవాడు, "సాగరీ! ఏ ఆర్కిటెక్ట్‌నయినా, ఇంటీరియర్ డెకొరేటర్‌నయినా తీసుకో! అతను ఫ్రస్ట్రేటెడ్ పెయింటరయి ఉంటాడు!" అని. అతని ఊహ సరయినదేనని తెలిసింది.

దీనబంధు ఫొటోలు మరికొన్ని దొరికాయి. నా రిఫరెన్స్‌కోసమని ఒక ప్రింటు తీసుకున్నాను.

"ఎందుకా ఫొటో?" అని అడిగాడు టోనీ.

"నీకు తెలీదు టోనీ!" అన్నాను.

టోనీ అన్నిటికన్నా కింద పెద్దదిగా ఉన్న సొరుగును లాగాడు. దాని నిండా ఫొటోనెగిటివ్స్‌ఉన్న అల్బమ్స్ ఉన్నాయి. అక్కడున్న ఎర్రటి గుడ్డిదీపం వెలుగులో ఆ నెగిటివ్‌లన్నిటినీ పరిశీలించడం కష్టం. అయినా అది వీలయినంత త్వరగా చెయ్యకతప్పదు.

ఇటువంటిచోట్ల ఎక్కువసేపుఉండటం మంచిది కాదు. అయితే ఇటువంటిచోట్లకు వెళ్ళడం చట్టరీత్యాకూడా సరయినదేనని నా అభిప్రాయం. కేసుకు సంబంధించిన నిజం తెలుసుకోవడం కోసమే నేనూ, టోనీ ఇలాంటి వేటలకు బయలుదేరుతుంటాం గనుక మా వేటలో దొంగతనం ఏమీలేదని నా నమ్మకం. మా ధ్యేయాన్ని దృష్టిలో ఉంచుకుని చూస్తే మా మార్గం కూడా తగినదేనని నా ఊహ. నా క్లయింట్లు నిర్దోషులు అని నిరూపించడానికి ఈ వేటలు పనికివచ్చాయి. అలా నాకు ఎంతో ఆత్మసంతృప్తి కలిగింది.

టోనీ,నేనూ ప్రతి నెగటివ్‌నూ దీపానికి అడ్డంగా ఎత్తిపట్టుకొని పరిశీలించసాగాం. షోరూమ్‌లు, పెద్ద హోర్డింగులు, ప్రదర్శనశాలలు,కట్టడాలముందు నిలబడిన వ్యక్తులు. ఇలా అటువంటి సంస్థలకు సంబంధించిన నెగిటివ్‌లు అవి. నాకు కావలసినవి అందులో లేవు.

ఒక్కొక్క నిమిషమే గడిచేకొద్దీ నా రాక ఫలించలేదనే నిరాశ పెరగనారంభించింది. ఏ ఫలితమూ సాధించకుండా అక్కడ అంతసేపు ఉండడంబాధాకరంగా ఉంది. నేనూ, టోనీ పట్టుబడితే నేను గడించిన పేరుప్రతిష్టలు, వృత్తిరీత్యా నాకు ఉన్నగౌరవం అన్నీ మంటగలిసిపోతాయి. మా ప్రాణాలకే ముప్పు కలిగినా కలగవచ్చు. ఒకసారి ఒక కిడ్నాపింగ్ కేసుకు సంబంధించి ఊరికవతలఉన్న ఒక ఇంటికి వెళ్ళాము. నేనూ, టోనీ మా ధ్యాసలోపడి

ఆధారాలకోసం వెతుకుతున్నప్పుడు ఒక అదృశ్యవ్యక్తి గునపం తీసుకుని టోనీ తలమీద కొట్టాడు. దాంతో టోనీ మూడు వారాలపాటు మంచంపట్టవలసి వచ్చింది.

ఆ సొరుగు అడుగుభాగాన కంచు క్లిప్స్‌తో బిగించిన ఆల్బమ్ ఒకటి కనిపించింది. వెంటనే దాన్నిలాగి క్లిప్స్‌తీసి ఆ ఆల్బమ్‌ను తెరిచాను. అందులో ఉన్న నెగిటివ్‌లన్నీ ఒక కాగితంమీద పడేశాను.

"టోనీ! నీ వు కూ డా చూ డు. ఏ నెగిటివ్‌లోనయినా ఆడవాళ్లు కనిపిస్తే నా చేతికివ్వు. త్వరగా..." అన్నాను.

ఆ ఇరుకుగదిలో – గాలీ, వెలుతురూ లేకుండా ఆ నెగిటివ్‌లు చూడడంతో కళ్ళు నొప్పిపెట్టడం మొదలుపెట్టాయి. ఆడవాళ్ళు కనిపించిన నెగిటివ్‌లన్నీ విడిగా ఒక కవర్లో పడేసుకుంటూ వచ్చాము. బహుశా వాళ్ళందరూ మోడల్స్ కావచ్చు. కానీ ఎవరు ఎవరో ఆ వెలుగులో తెలుసుకోవడం కష్టంగా ఉంది. వృత్తిరీత్యా ఫొటోగ్రాఫర్‌లుగా పనిచేసేవారెవరయినా ఆ నెగిటివ్‌లనుచూస్తే ఎక్కువ వివరాలు కనిపించేవేమో కానీ మా కు మా త్రం అంతగా ఏ వివరమూ కనిపించలేదు.

చివరికి అయిదు నెగిటివ్‌లు టోనీ పనిముట్ల పెట్టెలో పడవేశాను.

టోనీ అన్నీ సక్రమంగా సర్దేశాడు. గబగబా ఇద్దరమూ లా బింబా నుండి బయటపడ్డాము. టోనీ ఆ ఇంటివాకిలి తాళంవేస్తూ ఉండగా వీధిలోకి చూశాను. ఎవరూ లేరు.

ఇల్లు చేరుకునేసరికి నాకు మనసు తేలికయింది.

* * *

సెషన్స్ జడ్జిగారు ఆ మరుసటిరోజు కోర్టులోకి వచ్చేసరికే కోర్టు కిటకిటలాడుతూ ఉంది. ముందురాత్రి లా బింబా వేటతో నిద్రలేదు. దాంతో తల భారంగా ఉంది.

కానీ చేతినిండా పనిఉంది. తెమల్చవలసిన హత్యకేసు ఉంది. దాన్ని పట్టించుకోకుండా ఉండడం ఎలా? రంగంలోకి దూకి ఈ కేసు సంగతి తేల్చాలని నిర్ణయించుకున్నాను.

జార్జ్ తన సీట్లోంచిలేచి తానేదో చక్రవర్తి అయినట్టు కోర్టును పరిశీలనగా చూసి ప్రాసిక్యూషన్ తరఫున సాక్షుల విచారణ మొదలుపెట్టాడు. చిల్లరమల్లర సాక్షుల విచారణ అయ్యాక నేను ఎదురుచూసిన ప్రముఖ సాక్షి సారా విచారణ మొదలైంది. అసలు సారాను ప్రాసిక్యూషన్ సాక్షిగా ఎన్నుకోవడమే నాకు ఆశ్చర్యం వేసింది. ఆమె రెండు వేపులా పదును ఉన్న ఆయుధం వంటిది. నేనే ప్రాసిక్యూటర్‌ను అయిఉంటే ఆమెను సాక్షి బోను ఎక్కించే దాన్ని కాను.

సారా తెల్లచీర కట్టుకుని నీలంజాకెట్టు తొడుక్కుంది. జుట్టు ముడిచి బర్మాముడి వేసుకుంది. వీలయినంతమటుకు ఇతరుల దృష్టిని ఆకర్షించకుండా ఉండడానికి ఆమె పనిగట్టుకుని ప్రయత్నించినట్టు అనిపించింది. కానీ ఆమె అందాలు, ఆకర్షణలూ కనిపిస్తూనే ఉన్నాయి. 'సారా గురించిన ఛాయాదేవి అభిప్రాయం సరయినదే కావచ్చు' అనుకున్నాను.

జార్జ్ ఆమెను చాలా ప్రత్యేకంగా ట్రీట్ చేస్తున్నట్టు కనిపించింది. అతని ప్రశ్నలు, అందుకు ఆమె చెప్పిన సమాధానాలు ఇద్దరు ముద్దాయిలనూ ఉరికంబం ఎక్కించడానికి పనికి వచ్చేట్టే ఉన్నాయి. కోర్టులోని ప్రేక్షకులు ఆమె సాక్ష్యాన్ని ఆసక్తితో వింటున్నారు. ఆమె ఒక రకమైన మత్తు, మెత్తదనం నిండిన కంఠంతో





సాక్ష్యం చెబుతూ ఉంటే ముద్దాయిలకు పడబోయే శిక్ష గురించి ఆలోచిస్తూ చాలా మంది వాళ్లవైపే చూస్తున్నారు.

నాలో అశాంతి మొదలయింది. గడియారం చూసుకున్నాను. టోనీ ఎందుకు రాలేదో తెలియలేదు. మేము తెచ్చిన నెగటివ్‌లకు కాంటాక్ట్ ప్రింట్స్ వేయించి తెమ్మని మా స్నేహితుడు గురుదేవ్ దగ్గరికి పంపించాను. గురుదేవ్ బాగా తొందరగా పని చేయగల సమర్థుడు. మరి టోనీ ఎందుకు ఆలస్యం చేస్తున్నాడో తెలియదు.

జార్జ్ సారాతో విచారణ పూర్తి చేశాడు. ఆమెను క్రాస్ ఎగ్జామిన్ చెయ్యడానికని లేచి, ఒకసారి ఆమెను తీక్షణంగా చూశాను. ఆమె నన్ను అంతే తీక్షణంగా చూసింది. టోనీ వచ్చాడా అని చూస్తే ఎక్కడా అతని జాడ లేదు. టోనీ వచ్చేయాలనుకుంటూ కాసేపు కాలయాపన

చేశాను.

"మిసెస్ రావ్! మీరు క్రాస్ ఎగ్జామినేషన్ మొదలు పెట్టవచ్చు" అని జడ్జిగారు నాకు గుర్తు చేశారు.

"అలాగే!" అని వినయంగా చెప్పి సారాను సమీపించాను.

"మీ పూర్తి పేరు సారా డేవిడ్. అంతేనా?"

నా మొదటి ప్రశ్నవిని సాక్షి, ప్రేక్షకులూ కూడా ఆశ్చర్యపడినట్టున్నారు.

"అవునండీ!" అన్నది ఆమె మెత్తగా.

"అలాగా! మీరు మిస్సా, మిసెస్సా?"

ఆమె దెబ్బతిన్నట్టు పోజు పెట్టి జార్జ్ తన సహాయానికి వస్తాడేమోనని అతనివైపు చూసింది. ఏం చెప్పాలో తెలియక కళ్లు మూసుకుంది.

"ప్లీజ్! చెప్పండి. నేనడిగింది అంత కష్టమైన ప్రశ్న కాదనుకుంటాను!" అన్నాను చిరునవ్వు నవ్వుతూ.

"మిస్...మిస్ సారా డేవిడ్!"

"గుడ్! మరణించిన శాంతారామ్, మీరూ పెళ్ళి చేసుకోవాలనుకున్నట్టు ఇంతకు ముందు మీరు ఈ కోర్టులో చెప్పారు కదూ?"

"అవును!" గొణుగుతున్నట్టు చెప్పింది ఆమె.

"పెళ్ళికి తేదీ ఏదయినా కుదుర్చుకున్నారా?" అని అడిగాను.

"లేదు"

"పెళ్ళిగురించి మీ తల్లిదండ్రులకు తెలుసా?"

"నాకు తల్లిదండ్రులు లేరు. వాళ్లు చనిపోయారు"

"పోనీ, ఎవరయినా దగ్గరి బంధువులున్నారా?"




"ఒక ముసలి అత్తయ్య ఉంది. ఆమె బొంబేలో ఉంది"

"ఆమెకు తెలుసా మీ పెళ్లిగురించి?"

"తెలియదు"

"ఆమెకు రాయలేదా మీరు?"

"లేదు. తేదీ కుదరగానే రాద్దామనుకున్నాను"

"అలాగా? ఇదిగో! ఆ బోన్సులో ఉన్న ముద్దాయిలిద్దరూ మీకు తెలుసా?"

"తెలుసు. వాళ్ళ బడిలో ,పనిచేస్తున్నాను నేను. ఛాయాదేవి మా బడికి యజమానురాలు. గోపాల్ బడిని నడుపుతున్నారు"

"బడికి గోపాల్ యజమాని కాదా?"

"కాదు. ఆయన బడి తాలూకు అడ్మినిస్ట్రేషన్ చూస్తూ ఉంటారు"

"అంటే ఆయన కూడా మీ బాసే కదూ?"

"అవును"

"అంతేనా? మరేం కారా?"

సారా జవాబు చెప్పలేదు.

"ఎస్ ఆర్ నో?" రెట్టిస్తూ అడిగాను.

"ఆయన... మరేం కారు"

"గోపాల్‌ను అరెస్ట్ చేసిన రోజున మీరు ఎక్కడున్నారు?" అని అడిగాను.

అంతే! జార్జ్ లేచి, "యువర్ ఆనర్! ఈ ప్రశ్నకు నా అభ్యంతరం తెలియజేస్తున్నాను. గోపాల్ పక్షాన వాదించడానికి నిరూపా మూర్తిగారు ఉన్నారు. తమ క్లయంట్ గురించి వాదించడం ఎలాగో ఆమెకు తెలుసుననుకుంటాను. అటువంటప్పుడు సాగరిగారు ఈ ప్రశ్న అడగడం అసబద్ధం" అన్నాడు.

"అలాంటి ప్రశ్నలడగటానికి మీరే సమర్థులు!" అన్నాను వాడిగా.

జడ్జిగారు అడ్డుతగిలి "ప్లీజ్! మీరిద్దరూ పరస్పర దూషణలు మాని కోర్టు డెకొరమ్‌నూ. డిగ్నిటీనీ నిలపాలవి నా

కోరిక" అన్నారు.

నేను– "యువర్ ఆనర్! మన కోర్టులను అవమానించే చివరి వ్యక్తిని నేనే అవుతానేమో! కోర్టు మర్యాద పాటించడం నా ప్రథమ కర్తవ్యం. నేను అడిగిన ప్రశ్న సబబయినదేననీ, ప్రమాణం చేసి సాక్ష్యం చెబుతున్న ఈ సాక్షి నిజం చెబుతున్నారా లేదా తెలుసుకోవడమే నా లక్ష్యమనీ తెలియజేస్తున్నాను" అన్నాను.

"ఐసీ! అలాగయితే మీరు ఆ ప్రశ్న అడగడానికి అభ్యంతరమేమీ లేదు. ప్లీజ్ గో అహెడ్!" అన్నారు జడ్జిగారు.

జార్జ్ నా వైపు తీవ్రంగా చూసి తన సీట్లో కూచున్నాడు.

"మచ్ ఒబ్లయిజ్డ్ యువర్ ఆనర్!" అని తలవంచి, సాక్షి బోనువైపు నడిచాను. సారా ముఖంలో అశాంతి కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నది.

"మీరు అప్పుడు ఎక్కడున్నారు?" అని అడిగాను.

"మా బడి ఆఫీసులో!"

"అంటే రెండవ ముద్దాయిని అరెస్టు చెయ్యడానికి పోలీసులు అక్కడికి వచ్చారా?"

"అవును" అన్నది ఆమె వణుకుతున్న కంఠస్వరంతో.

"ఆ అరెస్టును ఆపాలని మీ రొక లాయర్‌కు ఫోన్ చేశారా?"

"చేశాను"

"ఆ లాయర్‌కు గోపాల్ మీ భర్త అని చెప్పారా?"

నా ప్రశ్నతో కోర్టులో గొడవ మొదలయింది. జార్జ్ అభ్యంతరం తెలియజేస్తూ అరిచాడు. జడ్జిగారు పదే పదే బల్లమీద గుద్ది కోర్టులో నిశ్శబ్దాన్ని సాధించి, "అభ్యంతరాన్ని తోసిపుచ్చుతున్నాను" అన్నారు.

సారా సన్నగా ఏడవడం ప్రారంభించింది. నేను ఆమెను అనునయిస్తున్నట్టు "ప్లీజ్! మీరు గోపాల్ మీ భర్త అని చెప్పారా లేదా?"

"చెప్పాను... చెప్పాను..."

"సారా! ఈ ఫోటో చూడండి. ఈ మనిషి మీకు తెలుసా?" అని అడిగాను– ఫోటోను కోర్టు అటెండెంట్ ద్వారా ఆమెకు పంపుతూ.

ఆమె ముఖం పాలిపోయింది. ఆమె చేతులు వణకనారంభించాయి.

జార్జ్ ఆ ఫోటో చూడాలంటూ లేచాడు అతను చూశాక జడ్జిగారూ, పోలీసు అధికారులూ చూశారు.

"ఈ ఫోటోలో ఉన్న వ్యక్తి మీకు తెలుసా?"

"తెలుసు"

"ఆయన పేరేమిటి?"

"దీనబంధు"

"ఆయన మీకు ఎలా తెలుసు?"

"ఆయన... శాంతారామ్‌కు స్నేహితుడు" అన్నది ఆమె.

అంతలో నావైపు ఒకకవరు పట్టుకు వస్తున్న టోనీని చూసి నా కళ్ళుమెరిశాయి. టోనీ గబగబా వచ్చి ఆ కవరు నాకు అందించాడు. ఏమీ జరగనట్టే నేను కవరులోంచి ఫోటోలు తీసి చూశాను.

అవి ఐదు ఫోటోలు. ఆ ప్రింట్లు ఇంకా తడిగానేఉన్నాయి. అయినా ఫెంటాస్టిక్‌గా ఉన్నాయి! వాటిలో మూడు సారా నగ్న చిత్రాలు! హిందూ నాగరికత పుస్తకంలో నేను చూసిన ముఖంలేని నగ్న చిత్రం సారా దన్నమాట! నా ఉత్సాహాన్ని పైకి పొక్కనివ్వకుండా క్రాస్ ఎగ్జామినేషన్ కొనసాగించాను.

"మీరు దీనబంధును కలుసుకున్నారా?"

"కలుసుకున్నాను..."

"మిస్ సారా! మిమ్మల్ని పెళ్ళాడాలనుకున్న శాంతారామ్, ఆయన స్నేహితుడు దీనబంధు కలిసి మీ ఫొటో ఒకదాన్ని చూపి మిమ్మల్ని బ్లాక్ మెయిల్ చేసిన మాట నిజమా అబద్ధమా?" అని అడిగాను.

కోర్టులో ఒక్కక్షణంలో గందరగోళం ఏర్పడింది. అరుపులు, చప్పట్లు, జార్జ్ కేకలు, జడ్జిగారి బల్లచరుపులూ – అన్నీ ఒకేసారి వినిపించాయి. కొన్ని నిమిషాల అలజడి తర్వాత, ప్రేక్షకులను కోర్టు లోంచి పంపేస్తామని జడ్జీగారు చెప్పాక కోర్టు సద్దుమణిగింది. ఈ గొడవ మధ్య నేను నా చేతిలోని ఫొటోలు చూస్తూ నిలబడ్డాను. సారా వెక్కి వెక్కి ఏడవ నారంభించింది.

"నేను.. నేను.. అవన్నీ చెప్పలేను. చెప్పలేను... నేను... నేను... శాంతారామ్‌ను చంపలేదు. దీనబంధు.. అతను... దీనబంధు... చంపాడు.... పొడిచి....కత్తి....రక్తం...." అంటూ ఆమె విరుచుకు పడిపోయింది. ఆమె నోటి నుంచి నురుగు రావడం ప్రారంభించింది. ఆమెకు స్పృహ తప్పినట్టుంది.

పోలీసులు వెంటనే ఆమె వైపునకు పరుగు తీశారు. ప్రేక్షకులు అటూ ఇటూ పరుగెత్తసాగారు. జడ్జిగారు వైద్య సహాయం కోసం కబురు పెట్టారు. కోర్టు అరుపులతో నిండిపోయింది. ఆ అరుపుల మధ్య జార్జ్ కోరిక మీద కోర్టు వాయిదా పడింది.

* * *

అంతా అయిపోయింది. మా క్లయంట్లు ఛాయాదేవి, గోపాల్ అనుభవించిన బాధ తొలిగిపోయింది. సిటీ సెషన్స్ జడ్జి వాళ్ళమీద తెచ్చిన కేసునూ, నేరాలనూ డిస్మిస్ చెయ్యడంతో ఇద్దరినీ విడుదల చేశారు.

ఆసుపత్రిలో సారాకు స్పృహ వచ్చాక ఆమె శాంతారామ్ హత్యగురించి పోలీసులకు పెద్ద వాంగ్మూలం ఇచ్చింది...

సారా, శాంతారాం ప్రేమికులు. పెళ్ళి చేసుకుంటానన్న మిష మీద అతను ఆమెతో బాగా చనువుగా ఉన్నాడు. ఆమె ఎన్నో పగళ్లూ, రాత్రులూ శాంతారామ్‌తో గడిపింది. అటువంటి సందర్భాలలో ఎప్పుడో రహస్యంగా శాంతారామ్ దీనబంధు చేత ఆమె నగ్న చిత్రం తీయించాడు. దీనబంధు ఫొటోలు తియ్యడంతో బాటు బ్లాక్ మెయిల్ చెయ్యడంలోనూ అనుభజ్ఞుడే. ఆ అనుభవంతో అతనూ, అతనికి సహాయంగా శాంతారాం ఎందరో స్త్రీలనూ, పురుషులనూ బెదిరించి డబ్బు గుంజుతూ వచ్చారు. అటువంటివాళ్ళలో ఛాయాదేవి కూడా ఉంది. ఆ లిస్టుకు సారాను కూడా చేర్చారు. ఆమె డబ్బు ఇవ్వలేనంటే ఆమెనే యిచ్చుకోమని బలవంత పెట్టసాగాడట దీనబంధు. అయితే అప్పటికే సారామీద మోహం పెంచుకున్న శాంతారాం—దీనబంధు చర్యలకు అడ్డం చెప్పాడట. సారా తన మీద చూపే ఆసక్తికన్నా గోపాల్ మీద ఎక్కువ ఆసక్తి చూపుతున్నదన్న విషయం శాంతారామ్‌కు తెలియదట. ఒకరోజు– అంటే హత్య జరిగిన రోజు ఆమె అక్కడికి వెళ్లిందట. ఆ రోజు శాంతారామ్, దీనబంధు ఆమె గురించి దెబ్బలాడుకున్నారట. దీనబంధుకు విపరీతమైన కోపం వచ్చి శాంతారామ్‌ను చంపేసి, శవాన్ని కిందినుంచి తీసుకెళ్ళి మంచం మీద పడేశాడట.




ఆమె వాంగ్మూలం ఆధారంగా పోలీసులు దీనబంధు కోసం గాలించడం మొదలు పెట్టారు. అతను అప్పటికే ఇల్లువదిలి పారిపోయాడు. పోలీసులు అతణ్ని విశాఖలో పట్టుకుని శాంతారామ్‌ను హత్య చేసినందుకు అతనిమీద కేసు పెట్టారు.

* * *

ఛాయ, గోపాల్, నిరూప, నేను మా ఆఫీసులో కూచున్నాము. ఆ ఉదయం ఉత్సాహం కల్గించేలావుందిఛాయ, గోపాల్ విడుదలయిన సంతోష సమయాన్ని పురస్కరించుకుని అందరమూ మా ఆఫీసులో సమావేశమయ్యాము.

ఛాయాదేవి దాదాపుగా తన మామూలు స్థితిని చేరుకుంది. మళ్ళీ ఆమె నగల స్టాండులాగా కనిపించింది. ఆనందం ఆమె వంటినిండా కనిపించింది. ఆమెనిర్దోషి అనే అభిప్రాయం నాకు మొదటినుండి ఉన్నా కోర్టులో ఆ విషయాన్ని రుజువు చెయ్యగలిగినందుకు సంతోషపడ్డాను. అయితే అలా రుజువుచెయ్యడానికి నేను రాత్రింబవళ్లు నిద్రకూడా మానుకుని శ్రమపడవలసి వచ్చిందనుకోండి. సాధించిన ఫలితాన్నిబట్టి పడిన శ్రమ వ్యర్థంకాలేదన్న తృప్తి మిగిలింది.

"మిసెస్ రావ్! సారా మూలంగా ఈ హత్య జరుగుతుందనుకోలేదు" అన్నది ఛాయాదేవి.

"ఛాయా! సారా హత్య జరిగినప్పుడు అక్కడ ఉండిఉంటుందనీ,నేనుపుస్తకంలో చూసిన ఫొటో ఆమెదేననీ నాకు మొదటినుండి అనిపిస్తూనే ఉంది. బహుశా ఆ పుస్తకాన్ని అక్కడ ఆమే పడవేసి ఉండాలి. ఆ కింద డైనింగ్‌హాలులో మూడు కప్పులు కనిపించాయి. గొడవ మొదలుకావడానికి ముందు శాంతారామ్, సారా, దీనబంధు కాఫీ తాగిఉంటారనుకుంటాను!"

"నీ ఊహ సరైనదే అనుకుంటాను!" అన్నది నిరూప.

"మిసెస్ రావ్! మీరు నాకు చేసిన సహాయానికి ఎలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో నాకు తెలియడంలేదు. మీరు ఎన్నెన్ని ఇబ్బందులుపడ్డారో ఏమో! సారాగురించీ, దీనబంధుగురించీ కనుక్కోవడానికి మీరు బాగా కష్టపడి ఉంటారని నాకు తెలుసు. నేను అబద్ధాలాడడం వల్ల మీ కష్టాలు ఎక్కువయి ఉంటాయనీ తెలుసు..." అన్నది ఛాయాదేవి క్షమాపణ చెప్పుకుంటున్నట్టు.

ఒకగంటసేపు గడిచాక నేనూ, ఛాయాదేవి మాత్రమే మా ఆఫీస్‌లో కూచున్నాము. గోపాల్ తానూ,ఛాయ బొంబాయి వెళ్ళడానికి ప్లేన్ టికెట్ల గురించి కనుక్కోవడానికి వెళ్ళాడు. వాళ్ళిద్దరూ అక్కడ వారంరోజులు హాయిగా గడిపి రావడానికి వెడుతున్నారు.

"సాగరిగారూ! మీరు మా ప్రాణాలు నిలిపారు.జీవించి ఉన్నంతకాలమూ మిమ్మల్నీ, మీరుచేసిన మేలునూ మరిచిపోలేని ఈ స్నేహితురాలు ఇచ్చే ఈ చిన్న కానుకను దయచేసి తీసుకోండి..." అని ఛాయాదేవి నా చేతికి ఒక పొడవాటి ఎనామెల్ పెట్టెను అందించింది.

ఆమె నావద్దనుంచి సెలవు తీసుకుని వెళ్ళిపోయాక ఆ పెట్టె తెరిచిచూశాను. అందులో తొమ్మిదివేల రూపాయలకు చెక్కు, 'సి' అనే ఇంగ్లీష్ అక్షరం ఆకారములో వజ్రాలు పొదిగిన ఉంగరం ఒకటి ఉన్నాయి. ఆ ఉంగరం నా ఎడమ చేతి ఉంగరంవేలికి సరిగా సరిపోయింది. ★

మధ్యప్రదేశ్‌లోని బస్తర్ జిల్లా ఆదివాసులతో 39171 చదరపు కిలోమీటర్లలో వ్యాపించి ఉంది. బస్తర్‌లోని 'అబూఝ మాడా' ప్రాంతం నివాసులు ఇప్పటికీ నామమాత్రపు వస్త్రాలే ధరిస్తారు. లేదా ఆకులు, జంతుచర్మాలతో తమ శరీరాన్ని దాచుకుంటారు.

దట్టమైన అరణ్యాలు బస్తర్‌లో ఎంత ఎక్కువగా ఉన్నాయో అంత తక్కువగా జనసంఖ్య ఉంది. పట్టణాలు తప్ప మొత్తం జిల్లాలో రెండువేలకంటె ఎక్కువ జనసంఖ్యగల గ్రామాలు 57, వెయ్యికంటె ఎక్కువ జనసంఖ్యగల గ్రామాలు 266, ఐదు వందల కంటె తక్కువ జనసంఖ్యగల గ్రామాలు 2428 ఉన్నాయి. 96 శాతం ప్రజలు గ్రామాలలోనే నివసిస్తారు.

బస్తర్ ప్రజలు వ్యవసాయం పైనే ఎక్కువగా ఆధారపడతారు. అడవిని కాల్చి ఆ బూడిదలో విత్తనాలు చల్లుతారు. దీనివల్ల అడవులు నాశనమవుతున్నాయి.

ఇప్పుడిప్పుడే వీరీ పద్ధతికి స్వస్తి చెబుతున్నారు.

బస్తర్‌లోని ఘోంటుల్ చాలాకాలం నుండి ప్రపంచానికే ఒక ఆకర్షణగా ఉంది. భారతదేశంలోని విభిన్న ప్రాంతాలనుండే కాక ఇంగ్లాండ్, ఫ్రాన్స్, జర్మనీ, అమెరికా నుండి అనేకమంది పర్యాటకులు ఘోంటుల్‌లను చూడటానికి భారతదేశం వస్తారు. గత సంవత్సరం బి.బి.సి వీరిని ఫిల్మ్‌పై చిత్రీకరించిన సందర్భంగా పార్లమెంటులో పెద్ద వివాదం రేకెత్తింది కూడా.

ఇప్పుడిప్పుడే బస్తర్‌జిల్లాలో ఘోంటుల్‌ల సంఖ్య క్రమేణ తగ్గిపోతోంది. వారు బస్తర్ ప్రాచీన సంస్కృతికి సజీవ ఉదాహరణగా నిలిచి ఉన్నారు. ఘోంటుల్ గ్రామం బయట ఒక గుడిసె నిర్మించబడి ఉంటుంది. దానిలో సామాన్యంగా రెండు గదులు, ఒక వసారా ఉంటాయి. చక్కగా పేడతో అలికిన ఈ గదులలో గ్రామంలోని అవివాహిత యువతీ యువకులు రాత్రంతా గడుపుతారు.

7 నుండి 10 సంవత్సరాల వయస్సు గల ప్రతి బాలుడు లేదా బాలికకు ఘోంటుల్‌లో ప్రవేశం లభిస్తుంది. వీరు వివాహం జరిగేవరకు ఇక్కడికి రావాలి. ఎవరయినా సరియైన కారణం లేకుండా హాజరు కాకపోతే శిక్షకు పాత్రులవుతారు. వారి వారి తల్లిదండ్రులుకూడా తమ బాలుణ్ని లేదా బాలికను ఘోంటుల్‌కు పంపనందుకు శిక్షకు గురికావలసివస్తుంది.

ఘోంటుల్ సభ్యులను 'చేలిక్' అని, యువతులను, బాలికలను 'మోటియారి' అని పిలుస్తారు. ఘోంటుల్ సక్రమంగా నిర్వహింపబడటానికి ఒక నాయకుడు ఉంటాడు. ఈ నాయకుని ఆజ్ఞ తిరుగు లేనిది. ఈ నాయకునికి మరికొన్ని అధికారాలు కూడా ఉంటాయి. అతడు తనకు నచ్చిన యువతిని ఎన్నుకొని అనుభవించవచ్చు. అంతేకాదు–ఒకేరాత్రి ఎంతమంది నయినా అనుభవించవచ్చు.

ఘోంటుల్‌లో కొందరు అధికారులు ఉంటారు. చలిమంటలు వెయ్యడం, ఘోంటుల్ శుభ్రపరచడం, సభ్యులు హాజరయినదీ లేనిదీ గమనించడం, వారిని పిలవడం, నృత్య సంగీతాలు ఏర్పాటు చేసే బాధ్యత వీరిపై ఉంటుంది.

కఠినమైన క్రమశిక్షణ ఘోంటుల్ ప్రత్యేకత. ఘోంటుల్‌లో జరిగిన ప్రతి విషయం, క్రియాకలాపాలు, గతివిధులు రహస్యంగా ఉంచబడతాయి. ఘోంటుల్ ప్రతిసభ్యుడు రాత్రి జరిగిన సంగతి మర్చిపోయి గ్రామంలో ప్రవేశిస్తాడు.

రాత్రి మొదటి చరణంలో ఇక్కడ సంరంభం ప్రారంభమవుతుంది. డోలు, మృదంగ శబ్దాలతో యువతీ యువకులు లేళ్లలా గంతులు వేస్తూ ఘోంటుల్‌వేపు కదులుతారు.

ప్రతి సభ్యుడు మొదట నాయకునికి అభివాదం చేస్తాడు. తరువాత నాయకుని ఆదేశానుసారం తన 'కర్తవ్యాన్ని' నిర్వహిస్తాడు. ఘోంటుల్ లోపల లేదా బయట మంట వేయబడుతుంది, చాపలు పరచబడతాయి.

ఆ తరువాత యువతులు యువకుల శిరోజాలు దువ్వుతారు. శరీర మర్దన చేస్తారు. పరస్పరం పరాచికాలు ఆడుకుంటారు. రాత్రి చిక్కబడిన కొద్దీ ఘోంటుల్‌లో యవ్వనం చిందులువేస్తుంది. మృదంగం, డోలు చప్పుళ్ళతో బస్తర్ సౌందర్యం ఇనుమడిస్తుంది. యువతీ యువకులు గుండ్రంగా ఏర్పడి నాట్యం

ప్రారంభిస్తారు. అది అర్ధరాత్రి వరకు కొనసాగుతుంది. తరువాత యువతులు, యువకులు ఘోంటుల్ గదులలో ప్రవేశిస్తారు.

అనుభవమున్న యువతి కొత్తగా ప్రవేశించిన బాలికకు శిక్షణ ఇస్తుంది. సాధారణంగా జంటను నాయకుడే ఎన్నిక చేస్తాడు. అయితే వారి వారి అంగీకారం కూడా తీసుకోబడుతుంది. జంటలు సాధారణంగా మారుతుంటాయి. ఒక్క అన్నా చెల్లెళ్ళకు తప్ప ప్రతీ యువతీ యువకునికి ఘోంటుల్‌లో కలుసుకునే అవకాశం లభిస్తుంది.

ఘోంటుల్‌లో యువతీ యువకుల సంఖ్య సమానంగా లేనప్పటికి ఏ సమస్య ఉత్పన్నం కాదు. యువకుడు లేదా యువతి జంటకోసం మరుసటి రాత్రిదాకా వేచి ఉంటారు.

ఘోంటుల్‌లో అందరూ సమానంగా చూడబడతారు. అక్కడ పేదవాడూ, ధనవంతుడూ అనే భేదం ఉండదు. పశ్చిమ నాగరికతలో సామూహిక లైంగిక సంబంధాల ప్రయోగం ఇటీవలే మొదలయింది. కాని బస్తర్‌లో ఈ వ్యవస్థ ప్రాచీనకాలం నుండే ఉంది.

అయితే ఘోంటుల్‌లో ఏ యువతీ గర్భవతి కావడం హర్షనీయం కాదు. పొరపాటున ఎవరయినా గర్భం ధరిస్తే తనకు నచ్చిన యువకుణ్ని వివాహం చేసుకుంటుంది. దీంతో ఆ యువతికి ఘోంటుల్‌తో సంబంధం తెగిపోతుంది. అలాగే గర్భవతి కాకపోయినా ఎన్నో జంటలు వివాహం చేసుకుంటున్నాయి.

ఘోంటుల్ కేవలం లైంగికసంబంధాల కేంద్రం కాదు. ఇదొక సంస్థ స్వరూపం. ఆదివాసి యువతీ యువకులు తమ ధర్మం, ఆచార సంప్రదాయాలు పాటించే ప్రదేశం. దీనివల్ల వారిలో ఈర్ష్యకు తావు వుండదు. ఈనాడు ఒక యువకునితో లైంగిక సంబంధం పెట్టుకొన్న యువతి కొన్ని రోజులకు మరో యువకుని కౌగిలిలో ఉన్నప్పటికీ ఈర్ష్య కలుగదు.

ఘోంటుల్‌లో బయట వ్యక్తి ప్రవేశానికి అనుమతించరు. అయితే అధికారి అనుమతితో రెండు – మూడు గంటలు అక్కడ ఉండవచ్చు.

ఘోంటుల్ పవిత్ర ప్రేమ మందిరంగా భావించబడుతుంది. అక్కడ అమావాస్య చీకటి రాత్రిలోకూడ ప్రేమజ్యోతి మిలమిల మెరుస్తుంది.

* * *

బీహార్ రాష్ట్రంలోని దర్భాంగా జిల్లాకి 40కిలోమీటర్ల దూరంలో సౌరథ్ అనే గ్రామం ఉంది. ఆ గ్రామవాసులు తమ పిల్లలకు వివాహం చేయటానికి ఒక పద్ధతి అవలంబిస్తారు. మైథిలీ తెగకు చెందిన బ్రాహ్మణులలోసగోత్రవివాహాలునిషిద్ధం. వివాహ సంబంధాలు నిశ్చయించుకో దలచినప్పుడు "సౌరథ్ సభ" ఏర్పాటు చేస్తారు. గ్రామకూడలిలో ఎత్తయిన అరుగు ఉంటుంది. దానిమీద పెళ్ళీడుకి వచ్చిన మగపిల్లలంతా చక్కగా అలంకరించుకుని బంధుమిత్ర పరివారంతో సభ తీర్చికూర్చుంటారు. అచ్చట పెళ్ళిపెద్దగా వ్యవహరించేవారిని "పంజి కరులు" అంటారు. వీళ్ళుగాక కొందరు మధ్యవర్తులుంటారు. వారిని "ఘటక్"లు అంటారు.

వధువుకి తన వివాహ విషయంలో ఎలాంటి స్వాతంత్ర్యం ఉండదు. తల్లిదండ్రులు, పెళ్ళిపెద్దలు ఏ సంబంధం

నిర్ణయిస్తే దాన్ని అంగీకరించవలసిందే! పెళ్ళికుమారుని ఉద్యోగం, జీతం, స్థిర చరాస్తులు, కుటుంబ ప్రతిపత్తి వీటితో సంబంధం లేకుండా వివాహ వయసున్న యువకులంతా సౌరథ్‌సభలో పాల్గొన వచ్చును.

పిల్లవాడు, పిల్ల ఒకే గోత్రానికి చెందిన వారు కాదని పంజికర్ ధృవపత్రం ఇస్తే గాని సంబంధం ఖాయపరుచుకోవటానికి వీలులేదు. అలాంటి ధృవపత్రాన్ని ఇవ్వ టానికి పురోహితులు కొంతసొమ్ము తీసు కుంటారు. సౌరథ్ సభ జరిగినరోజు పంజి కరుడు నాలుగయిదువందల రూపాయలు ఆర్జించగలుగుతాడు. వరుని ఉద్యోగాన్ని, హోదానిబట్టి కట్న కానుకలరేటు పెరుగు తుంది. ఈమధ్య జరిగిన సౌరథ్ సభలో



డాక్టరు పట్టా పొందిన ఒక యువకుడు 25వేల రూపాయల కట్నానికి అమ్ముడు పోయాడు. ఐ. ఎ. యస్. పాసైన యువ కుడు యాభయి వేలకు అమ్ముడు పోయాడు.

వరకట్న నిషేధ చట్టం అమలులో ఉన్నా సౌరథ్‌సభలో కట్నాలు,కానుకలు అన్నీ యధాప్రకారం కొనసాగుతూనే వుంటాయి. ఈ సభలో ప్రముఖులుకూడా పాల్గొంటారు. కేంద్రమంత్రులు, రాష్ట్ర మంత్రులు కూడా తమపిల్లలకు కావలసిన వరులను ఎంపిక చేసుకొంటారు. మగ పిల్లలున్న ప్రముఖులు తమ కుమారులను అలంకరించి సభాస్థలిపై వేలం పాటలో పెడతారు. ఈ ఆచారం గత నాలుగు దశాబ్దాలనుండి కొనసాగుతునే ఉన్నది.

* * *

ఒరిస్సాలోని 'పుల్‌బాని' జిల్లాలో 'ఘమ్‌సార్ ఉదయగిరి' అనే గిరిజన గ్రామముంది.దీని జనాభా 6850. వారిలో ఎక్కువ మంది హరిజనులే. లోకం పోకడ తెలియని అమాయకులు వీరు. గిరిజన స్త్రీలు ఎంతో అందంగా ఉంటారు. ఘమ్‌సార్ ఉదయగిరి సముద్ర మట్టా నికి 2500 అడుగుల ఎత్తున ఉన్నది. అచ్చటి వాతావరణం చల్లగా వుంటుంది. సిమ్లా, ఊటీలకు తీసిపోదు.

వన్యప్రాంతం కావటం వలన కలప వ్యాపారం చేసే కంట్రాక్టర్లు, వన్య సంపదను కొనుగోలు చేసే వర్తకులు, అందుకు సంబంధించిన ప్రభుత్వోద్యో గులు ఆ ప్రాంతాలను సందర్శిస్తూ ఉంటారు.

క్రీ.శ. 1800లో మహారాష్ట్ర పాల కులు ఈ గిరిజన ప్రాంతాన్ని కొల్ల గొట్టారు. సైనికులు గిరిజన స్త్రీల అందా నికి ముగ్ధులై వారిని తమ కామవాంఛకు ఎరచేశారు. గిరిజన ఆచారం ప్రకారం ఒక మారు శీలం చెడిన స్త్రీ తిరిగి వివాహ మాడటానికి వీలులేదు గనుక వారి అందమే వారికి అభిశాపంగా తయారైంది. ఫలితంగా అందం తమ భవిష్యత్తును అంధ కారం చేసేదిగా ఉండగూడదని వారంతా నిశ్చయించుకున్నారు. చంద్రబింబంలా అందంగా వుండే ముఖానికి వికృతంగా కనబడటానికి ముఖం నిండా పచ్చబొట్లు పొడిపించుకోసాగారు. రెండు శతాబ్దాల క్రితం అలా మొదలైన ఈ పచ్చబొట్టు అలవాటు వారికి ఒక ఆచారంగా మారి పోయింది.

1865లో బ్రిటిష్ పాలకులు ఈ ప్రాంతంలో కాలు పెట్టారు. క్రైస్తవ మిషనరీలు మత ప్రచారం చేశారు. వారికి కొంత నాగరికత నేర్పారు.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఆ ప్రాంతంలో తిరిగే ఫారెస్టు కంట్రాక్టర్లు, ప్రభుత్వోద్యోగులు డబ్బుఎరచూపి అమా యక ఆడపిల్లల శీలాన్ని కొల్లగొట్టారు. కొందరు వారితో బ్లూ ఫిల్ములే తయారు చేశారు. ప్రభుత్వోద్యోగులు వారిని నమ్మించి వివాహాలు చేసుకున్నారు. వీరితో వివాహం గిరిజన పద్ధతిలో చేసు కునేవారు. వివాహమాడదలచిన వరుడు పిల్ల తల్లిదండ్రుల అనుమతి పొందాలి. వధువు తండ్రికి కన్యాశుల్కం కింద కొంత సొమ్ము చెల్లించాలి. ఆ డబ్బుతో పిల్ల బంధువులకి విందు జరుపు తారు. వారు దానిని 'సైతిక' అంటారు. సైతిక జరిగాక వివాహం జరుగుతుంది. వివాహ తంతుని 'శప్కా' అంటారు. అది జరిగాక వధూవరులిద్దరూ కలిసి

భార్యాభర్తలుగా నివసిస్తారు.

గిరిజనుల అమాయకతను ఆసరాగా తీసుకుని అలా వివాహం చేసుకున్నవారు ఒకరిద్దరు పిల్లలు పుట్టాక వారిని వదిలేసి వెళ్ళిపోతుండేవారు. ఆ విధంగా భర్తలు వదిలేసిన స్త్రీలు ఘమ్సార్ ఉదయగిరిలో చాలామంది ఉన్నారు. వారిని అలా వంచించినవారు ఆ గ్రామానికి 'ప్రేమ్ నగర్' అని పేరు పెట్టారు. న్యాయ శాస్త్ర రీత్యా భార్యను వదిలేసిన భర్త ఆమెకు భరణం ఇవ్వాల్సి వుంటుంది. వీరికి ఆ చట్టాలేవీ తెలియవు. అందుకే భరణం కోసం ఇంతవరకూ వీరు ఎవరూ కోర్టు కెక్కలేదు. అదీగాక కొండ జాతి వారి పద్ధతిలో జరిగిన పెళ్లికి న్యాయ శాస్త్రరీత్యా విలువ ఉండదని న్యాయవాదుల అభిప్రాయం.

ఈమధ్య ఉదయగిరి గ్రామం సమీపంలోనున్న 'కుంభార్కుపా' గ్రామానికి చెందిన 'శాయిబాలి' అనే వివాహిత ఒక ఎక్సైజు ఇన్స్పెక్టర్‌పై ఇండియన్ పీనల్ కోడ్ ప్రకారం చర్యతీసుకోమని న్యాయస్థానంలో ఫిర్యాదు చేసింది. ఆమెకు ఆ ఇన్స్పెక్టర్ వలన ఒక కుమార్తె కూడా కలిగింది. అతను కొన్నాళ్లు 'శాయిబాలి'తో కాపురం చేశాడు. అంతకు ముందే అతనికి వివాహమయింది. అతనిపై ఇప్పుడు విచారణ జరుగుతున్నది. అంటే గిరిజనులు ఇప్పుడిప్పుడే మేల్కొంటున్నారన్నమాట.

* * *

ఎవరి ఆచారం వారిదనుకున్నా కొన్ని ప్రాంతాలలో మరీ వింతగా ఉంటూ ఉంటాయి. సేలం జిల్లాలోని 'ఎర్కాడ్'కి ఏడుమైళ్ళ దూరంలో ఉన్న 'వెళ్లైకాడై' అనే పల్లెటూరులో జరిగే సంక్రాంతి

పండుగకు ఒక ప్రత్యేకత ఉంది.పండుగ మూడవరోజున 'కుట్టు' అనే ఒక వింత నాట్యాన్ని ఆ గ్రామస్త్రీలు చేస్తారు. ఎటువంటి దుస్తులూ లేకుండా నగ్నంగా, తమదేవత అయిన 'అమ్మాన్'ను శాంత పరచడానికీ, ప్రసన్నం చేసుకోవడానికీ ఎంతో వెర్రిగా, ఆవేశంగా పట్టపగలు... నడిరోడ్డుమీద ఆ ఊరి స్త్రీలు నృత్యం చేస్తారు.

ఈ పండుగరోజు ఉదయం పది గంటలయ్యేసరికి, ఊళ్ళోని మగవారంతా ఊరి పొలిమేరలు దాటి వెళ్ళిపోవాలి. ముసలివాళ్ళూ, మగపిల్లలూ బయటకు వెళ్ళలేని పరిస్థితుల్లో ఉంటే ... వారిని ఒకగదిలో ఉంచేసి తాళంపెట్టేస్తారు. నృత్యం జరుగుతున్న సమయంలో ఊరి పొలిమేరల్లో వృద్ధ మహిళల కాపలా ఉంటుంది! పొరపాటున ఎవరయినా మగవారు ధైర్యంచేసి ఊళ్ళోకి వెళ్దామని ప్రయత్నిస్తే...కాపలా ఉన్నవారు వీరి కళ్ళల్లో బూడిదచల్లేస్తారు! అలా ముఖంమీద బూడిద పడినవారిని ఆ గ్రామంలో చీడపురుగుల్ని చూసినట్లు చూస్తారు! అందువల్ల ఎవరూ అలా వెళ్ళడానికి ప్రయత్నించరు. చుట్టుపక్కల గ్రామాల స్త్రీలు మాత్రం వచ్చి ఈ నాట్యాన్ని చూడవచ్చు! వారికి ఇష్టం అయితే నాట్యంలో పాల్గొనవచ్చు కూడా!

నృత్యం అయిపోగానే సంకేత సూచకంగా పెద్దపెద్ద డ్రమ్ముల్ని వాయిస్తారు! వెంటనే ఊరు పొలిమేర్లలో ఉన్న గ్రామస్థులంతా పరుగు పరుగున వచ్చి కొత్తబట్టలతో కళకళలాడుతున్న తమ స్త్రీలనుండి ప్రసాదాన్ని స్వీకరిస్తారు.

వినడానికి ఈ పండుగ ఎంతో తమాషాగా ఉన్నా...పాపం, ఆ ఊరి మగవారిపాలిట మాత్రం ఈ పండుగ ఒక శాపమేనేమో?

ఛోటా నాగపూర్‌ను ఆనుకొని మధ్య ప్రదేశ్‌లో గల రాయ్‌గఢ్ జిల్లా ఉత్తర ప్రాంతంలో ఎత్తైన సత్‌పుడా పర్వతాల మధ్య 'కోర్బా' అనే ఆదివాసుల సముదాయం నివసిస్తోంది. వారికి ఇప్పటికీ వ్యవసాయం అంటే సరిగ్గా తెలియదు. వారి ఆహార అన్వేషణ ప్రముఖ సాధనం వేట. వేటకోసం కొండలు, కోనలు అధిగమించి ఎంత దూరమైనా పోగలరు వారు.

కోర్బా జాతి ఆదివాసులు 'ముండా' వంశజులుగా పరిగణింపబడేవారు. కాని ప్రస్తుతం వారు తమను ఖుడియారాణి (కులదేవత) అనుయాయాలుగా చెప్పుకుంటున్నారు. మొదటువారు ఒక ప్రదేశం నుండి మరొక ప్రదేశం తిరుగుతూ వ్యవసాయం చేసేవారు. కాని క్రమేణ స్థిరనివాసానికి అలవాటుపడ్డారు. జంతువులను వేటాడటానికి బాణం, విల్లు, బల్లెం తీసికొని అరణ్యంలో ప్రవేశిస్తారు. కొందరు బల్లెంతో జంతువులను వేటాడితే

మరికొందరు బాణంతో చేపలను చంపుతారు.

ఖుడియారాణి వారి ఆరాధ్యదేవత. వారు పూర్వీకుల ప్రేతాత్మలను పూజిస్తారు. వారి నాయకుడు దేవత పూజా కార్యక్రమాలు నిర్వహించడమే కాక మంత్రం, తంత్రం, వైద్యం కూడా చేస్తాడు. అదృశ్యశక్తులు ఆగ్రహించినప్పుడు కుటుంబ సభ్యులు మరణిస్తారని వారు విశ్వసిస్తారు. మృతుణ్ని పూడ్చిపెట్టే ముందు కుటుంబసభ్యులువంతుల ప్రకారం "నువ్విప్పుడు మా కుటుంబ సభ్యుడవు కావు. నీతో మాకిప్పుడు ఎలాంటి సంబంధం లేదు" అని మృతుని చెవిలో మెల్లగా అంటారు. ప్రేతాత్మలు వారిని వెంటాడకుండా ఆ తంతు నిర్వహిస్తారు. తరవాత మృతుణ్ని అరణ్యంలోకి తీసుకొనివెళ్ళి చిక్కని చెట్లుఉన్న ప్రదేశంలో శవాన్ని పాతిపెట్టి వేగి కొమ్మలతో ఆ ప్రదేశాన్ని కప్పివేస్తారు. ఆ ప్రదేశంలో ఒక చిన్న మట్టి పాత్రనుకూడా పెడతారు. తరువాత మృతునితో పాటు వచ్చిన వారందరూ కొంత దూరం వెళ్ళి దాక్కొని అరణ్యం నుండి వచ్చే శబ్దాలను శ్రద్ధగా ఆలకిస్తారు. ఈమధ్య అరణ్యంనుండి పులి గాండ్రించినట్లు శబ్దం వస్తుంది. మృతాత్మ అసంతృప్తితో పులిగామారి ఈ శబ్దాలు చేస్తోందని వారి విశ్వాసం. ఈ సందర్భంగా నాయకుడు పూజ–బలి మొదలగు కార్యక్రమాలు ఏర్పాటు చేయమని కుటుంబ సభ్యులనుఆదేశిస్తాడు.

మృతుణ్ని ఖననంచేసి ఇంటికి వచ్చే ముందు వారు పాతిపెట్టిన స్థలానికి వీపు పెట్టి వరుసలో నిలబడతారు. వరుసలో నిలబడ్డ మొదటివ్యక్తి ఒక రాయిని తన వెనుక నిలబడ్డ వ్యక్తికి ఇస్తాడు. ఆవ్యక్తి తనవెనుక నిలబడ్డ మరో వ్యక్తికి ఇస్తాడు. ఈ విధంగా ఆ రాయి చివరి వ్యక్తికి చేరుతుంది. అతడు ఆ రాయిని ఖననం చేసిన ప్రదేశంపై విసురుతాడు. మృతాత్మ వారిని వెంటాడకుండా ఈ తంతు నిర్వహిస్తారు.

మృతునిపట్ల పదిరోజులు శోకం పాటిస్తారు. ఆమధ్య కేవలం బియ్యంతో చేసిన 'హడియా' అనే సారాయిమాత్రమే సేవిస్తారు. ఎవరూ ఏ పని చేయరు. మరణించిన వ్యక్తి నివసించిన గుడిసె కూలగొడతారు లేదా కాల్చేస్తారు. ప్రేతాత్మల పట్ల వారికి చెప్పరాని భయం. పెద్ద పెద్ద చెట్ల సమీపంలో కూడా వారు తమ గుడిసెలు నిర్మించుకోరు. ఎందుకంటే ఆ చెట్లపైన ప్రేతాత్మలు నివసిస్తాయని వారి భయం.

పండుగలు, ఉత్సవాల సందర్భంగా వారు మొదట క్రూరమైన 'యుద్ధ నృత్యం' చేసేవారు. డోలు శబ్దాల మధ్య గుంపుగా చేరి బల్లెం, విల్లు, బాణం, గొడ్డళ్ళు మొదలగు ఆయుధాలు చేతపూని నాట్యం చేసేవారు. మహిళలు వారి మధ్య నిలబడి గంతులు వేసేవారు. దీని స్థానంలో ఇప్పుడు కర్మా అనే నృత్యం చేస్తున్నారు. ఈ నృత్యం మే–సెప్టెంబర్ మాసాల మధ్య నిర్వహించబడుతుంది. ఒకే గీతం రాత్రంతా పాడుతూ తెల్లవారు జామువరకు నృత్యం చేస్తారు.

ఒక్కోసారి సారాయి మత్తులో చిన్న చిన్న విషయాలకు సైతం పరస్పరం కలహించుకుంటారు. మత్తువదిలిన తరువాత తమలో తాము తగాదా పరిష్కారం చేసుకుంటారు. అవమానింపబడిన వ్యక్తికి అవమానంచేసిన వ్యక్తి సారాయి విందు

 



చేస్తాడు. సారాయికి ఆశపడి తగాదాకు స్వస్తి చెప్పడానికి సిద్ధపడతాడు.

• • •

కేరళ రాష్ట్రంలోని కొడంగలూర్‌లో వేసవికాలంలో అక్కడి దేవాలయంలో దేవీపూజ చాలా ఆర్భాటంగా జరుగుతుంది. మొదట 'తానా...తాననం తారో' అనే పాటతో మొదలయింతర్వాత ఇక మిగిలిన పాటలన్నీ పరమ బూతులతో అతి జుగుప్సాకరంగా మార్మోగిపోతాయి. ఆ ఉత్సవంలో పాల్గొనే యువతీ యువకులీ పాటల్ని పరమ అసహ్యంగా పాడుతూ ఆ దేవీ ఆలయం చుట్టూ ప్రదక్షిణాలు చేస్తారు. ఈ ఉత్సవాన్ని చూడడానికి చుట్టుపక్కలనుండి వేల

సంఖ్యలో ప్రేక్షకులు గుమిగూడుతారు- మరీ ప్రత్యేకించి ఆ బూతు పాటల్ని వినడానికి. కొందరయితే కాసెట్లు, టేపురికార్డర్‌లు తెచ్చుకుని వాటిని రికార్డు కూడా చేసుకుంటారు. అది వాళ్ళకో సరదా!

అక్కడి కథనం ప్రకారం చాలా సంవత్సరాల కిందట అక్కడో బౌద్ధ దేవాలయం ఉండేదిట! అక్కడి పెత్తనం అంతా బౌద్ధ సన్యాసులదే. అయితే హిందువులు కొందరు ఆ సన్యాసులను తరిమేసి దాన్ని హిందూ దేవాలయంగా మార్చాలని ఒక ప్రణాళిక సిద్ధం చేశారు. దాంతో వాళ్లు ప్రార్థనా సమయాల్లో బూతు పాటలు లంకించుకుని, జంతు బలులు కూడా ఆలయప్రాంగణంలో మొదలుపెట్టారు. దాంతో బౌద్ధసన్యాసులు హడలిపోయి దేవాలయాన్ని వదిలి పెట్టి పారిపోయారుట! ఆ 'విజయోత్సవానికి' స్మృతి చిహ్నంగా ప్రతి సంవత్సరం ఒకరోజు ఆ దేవిని బూతు పాటలతో పూజలు చేస్తూఉంటారు.

అదేరోజు అక్కడ 'కావూతెంతల్' అనే పండగను కూడా జరుపుకుంటారు. దానిలో భాగంగా యువతీ యువకులు కత్తులు కొడవళ్లు పుచ్చుకుని ఎగురుతూ, బూతు పాటలు పాడుతూ గుడిచుట్టూ నృత్యాలు చేస్తారు.

• • •

దేశంలోని అత్యధికంగా మంచు కురిసే కొన్ని ప్రాంతాలలో సారాయి తయారు చేసుకోవడానికి ప్రజలకు సంపూర్ణ స్వేచ్ఛ ఉంది.

హిమాచల్ ప్రదేశ్‌లోని కిన్నోర్‌లో సంవత్సరమంతా గడ్డ కట్టించే చలి. జూన్ నుండి సెప్టెంబర్ వరకు ఇచ్చట వాతావరణం వేడిగా ఉంటుంది. అక్టోబర్‌లో చలి ప్రారంభమై మార్చి వరకు ఉంటుంది. ఈ మధ్య కాలంలో హిమపాతం కూడా సంభవిస్తుంది.

కిన్నోర్‌లోని దాదాపు ప్రతిగృహంలో సారాయి బట్టీలు ఉంటాయి. ఈ బట్టీలు అన్ని ఋతువులలో వేడిగానే ఉంటాయి. ప్రభుత్వం ప్రతి సంవత్సరం సారాయి తయారు చేసే కుటుంబాల నుండి 25 రూపాయలు పన్ను వసూలు చేస్తుంది.

ప్రభుత్వ ఫైళ్ళలో సారాయి క్రయ విక్రయాలపై ఆంక్షలు విధించినట్లు ఉన్నప్పటికీ ఇచ్చట మాత్రం బాహాటంగా సారాయి క్రయ విక్రయం జరుగుతుంటుంది. పాఠశాలలోని ఉపాధ్యాయుడు సైతం సాయంకాలం సేవించడానికని విద్యార్థులకు డబ్బులిచ్చి తెప్పించుకుంటాడు. ఇక ప్రభుత్వ కార్యాలయాలలో మద్యం పుచ్చుకోవడం మామూలు విషయం. వారు పని వేళలలో సైతం సారాయి మత్తులో ఉంటారు.

ఇచ్చట ప్రతి కుటుంబంలోని దాదాపు అందరూ-పురుషులు, వృద్ధులు సారాయి పుచ్చుకుంటారు. స్త్రీలు తాగడానికి వీలు లేదు గానీ సారాయి తయారుచేసే ప్రధాన బాధ్యత వీరి పైనే ఉంటుంది.

ఈ జిల్లాలో పండుగలు, ఉత్సవాలు లెక్కకు మించి ఉన్నాయి. జానపద గీతాలు, నృత్యాలు ప్రేక్షకుల్ని విపరీతంగా ఆకట్టుకుంటాయి. సామూహిక నృత్యాలలో ప్రజలు దోసిళ్ళతో పీకల దాకా తాగుతారు. ఆ సమయంలో చుట్టు పక్కల నేలపై సారాయి ఒలికిపోతుంది. చాలామందికి తాగుడు ఎక్కువై ఎక్కడ పడితే అక్కడ పడిపోతారు. వారిని లేపి




గృహాలకు చేర్చాలనే ధ్యాస ఎవరికీ ఉండదు.

ఇలాంటి సమయాలలో పోలీసు విభాగంతో సహా అన్ని విభాగాలవారు తాగిన మత్తులో కనిపిస్తారు. బయటి ప్రాంతాల వారు ఇచ్చటి ఆడపిల్లల పట్ల అనుచితంగా ప్రవర్తించి దెబ్బలు తినటం పరిపాటి. సారాయి నిషాలో మునిగి తేలే వారు అమాయకులైన ఆడపిల్లలను మోసంతో లోబరుచుకునే దృశ్యాలు ఎన్నో కనిపిస్తాయి. ఈ ప్రదేశం సెక్సు సంబంధాలకు నిలయంగా మారుతుంది. తల్లిదండ్రులు ఈ విషయాన్ని అంతగా పట్టించుకోరు.

ఉత్సవాలు సాధారణంగా రాత్రి



సమయంలోనే జరుగుతాయి. స్త్రీ, పురుషులు విచ్చలవిడిగా నృత్యం చేయడమే ఇచ్చటి ఉత్సవాల ప్రధానలక్ష్యం. యువతీ యువకులు ఈ సందర్భంగా సంబంధాలు ఏర్పరచుకుంటారు.

చలికాలంలో నిర్వహింపబడే ఉత్సవాలలో హిమపాతం సంభవించినప్పుడు గృహాలకు తిరిగి వచ్చే వారిలో చాలా మంది సారాయి కైపులో కందకాలలో పడిపోతారు. మంచు వారిని కప్పేస్తుంది. ఒకోసారి మంచు పెకిలించి వారి శవాలను బయటకు తీయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది.

కిన్నోర్‌లో జరిగే పండుగ పబ్బాలకు తాగే నీటికంటే సారాయికే ఎక్కువ విలువ ఉంటుంది. సాధారణంగా ఇక్కడి ప్రజలు పీపాలతో సారాయిని ఆదాన ప్రదానం చేసుకుంటారు. బాలబాలికలు పెద్దలకు సారాయి తీసుకొనివెళ్ళి కానుకగా సమర్పిస్తారు.

ఇక్కడి ఉల్లాస భరితమైన, సంగీత మయ సంస్కృతిని సారాయి చెడు ప్రభావం నుండి తొలగించడానికి ఇప్పుడిప్పుడే కొందరు ఉత్సాహవంతులైన యువకులు చురుకుగా ముందుకు దూకారు.

కిన్నోర్‌లో సీమరేగుపండ్లు అత్యధికంగా పండుతాయి. ద్రాక్ష, మరికొన్ని స్థానిక ధాన్యాల ఉత్పత్తి జరుగుతుంది. సారాయి తయారుచేసేవారు వీటిని పులియబెట్టి సారాయి తయారుచేస్తారు. అంతేగాక ఆ ప్రాంతంలో లభించే ఒక అడవి ఫలంతో కూడా విరివిగా సారా బట్టీలు పెడతారు.

కిన్నోర్ వలె బాహులస్పితి అనే ప్రాంతంలో కూడ దాదాపు ఇదే పరిస్థితి నెలకొని ఉంది. దేశంలోని ఇతర ఆదివాసి ప్రాంతాలలో కూడ ఇదే వాతావరణం కనిపిస్తుంది. సాధారణంగా కుటుంబంలోని అన్నదమ్ములంతా కలిసి ఒకే అమ్మాయిని పెళ్ళి చేసుకుంటారు. భర్తలందరూ ఒకరికొకరు సోదరులై ఉండాలన్నది నియమం. కాని కొన్ని చోట్ల ఎలాంటి బంధుత్వం లేకపోయినా ఒకే స్త్రీని వివాహమాడిన వారున్నారు. వారి ఆచారం ప్రకారం మగవారికి ఎలాంటి సోదరబంధం ఉన్నాసరే ఒకే స్త్రీతో కాపురం చేయవచ్చు. వారు ఒకే రక్తం పంచుకు పుట్టిన సోదరులే కానవసరం లేదు. ఒక కుటుంబంలో ఆరుగురి కంటే ఎక్కువ మంది సోదరులుంటే మిగతావారు మరో స్త్రీని వివాహం చేసుకుంటారు. కాని ఆ ఇద్దరు స్త్రీలపై సోదరులందరికీ సమానమైన హక్కు ఉంటుంది.

సాధారణంగా ఇక్కడ వివాహాలు మూడురకాలుగా జరుగుతాయి. మొదటిది మామూలు పద్ధతి. పెళ్ళికొడుకుల తండ్రికి పెళ్ళికూతురు తండ్రి కొంత రొక్కం కట్నంగా ఇచ్చి కూతుర్ని కోడలుగా స్వీకరించమంటాడు. అప్పుడు వివాహం జరుగుతుంది. రెండోరకం వివాహం అబ్బాయిలు అమ్మాయిని లేవదీసుకుపోవడం. తదనంతరం అమ్మాయి తలిదండ్రుల నుంచి అంగీకారం అడగడం జరుగుతుంది. వారంగీకరించిన యెడల అబ్బాయిల తరఫువాళ్ల బారాత్ (ఊరేగింపు)తో వచ్చి వివాహం జరిపిస్తారు. మూడోరకమైన వివాహాన్ని 'హార్' అని వ్యవహరిస్తారు. వివాహమైన స్త్రీని లేవదీసుకెళ్ళి పెళ్ళి చేసుకోవడాన్ని హార్ అని వ్యవహరిస్తారు. కొండవాసుల్లో ఇది సర్వసాధారణం!

 

1901 నాటి జనాభా లెక్కల ప్రకారం కిన్నౌర్‌లోని 521 మంది స్త్రీలలోనూ ప్రతి స్త్రీకి ఇద్దరు చొప్పున భర్తలున్నారు. 173 మంది స్త్రీలకు ఒక్కొక్కరికి ముగ్గురు చొప్పున, 64 మందికి నలుగురు చొప్పున, 42 మందికి ఐదుగురికంటే ఎక్కువ మంది భర్తలున్నారని తేలింది. ఈ బహుపతిత్వ వ్యవస్థకు కారణాలు అనేకం ఉన్నాయి.

కిన్నౌర్‌లో సారవంతమైన భూమి తక్కువ. అందువల్ల జనాభా పెరిగితే పేదరికం కూడా పెరుగుతుందనే ఉద్దేశంతో ఈ ఆచారాన్ని పూర్వీకులు పెట్టారని చాలా మంది అభిప్రాయం. ఒకే స్త్రీని ఎక్కువ మంది మగవారు పెళ్లాడటం వల్ల జనసంఖ్య అంతగా పెరగదు. ఇక్కడ స్త్రీల సంఖ్య తగినంతగా లేకపోవడం మరో కారణం. వీరు ఏ మతానికి చెందినవారో, వారి పూర్వ చరిత్ర ఏమిటో ఎవరూ ఖచ్చితంగా చెప్పలేక పోతున్నారు. కొందరు వీరి చరిత్రను ప్రాచీన ఆర్య గ్రంథాలతో జోడిస్తే, మరికొందరు వీరిని సుమేరియన్స్ అన్నారు. కొందరు వీరి రూపాన్ని బట్టి మంగోలియన్ మరియు తాతారియన్‌లతో పోల్చారు. ఇంకొందరు వీరిని ఋగ్వేదకాలానికి చెందినవారన్నారు. ఏదేమైనా ఆధునిక ప్రపంచంతో సంబంధాలు పెరగడంతో కిన్నౌర్ ప్రజల్లో ఈ మధ్యనే బహుపతిత్వ ఆచారం తగ్గుముఖం పట్టింది.





పాలబుగ్గలు-పసిడి నవ్వులు!
కడవలోని నవ్వులన్నీ
పెదవి మీద వాలికపోయే...!
సూరజ్ యన్. శర్మ

వెన్నెలంటి ప్రభాత వేళ-
వేడి నీరు మాకు తోడు!



సూరజ్ యస్. శర్మ

# అసలు సంగతి

ఆనంద్ ఆ ఆఫీసులో చేరి ఆర్నెల్లయింది.

చురుకైనవాడు. మాటకారి. ఆ కొద్ది టైములోను ఆ కంపెనీలో పనిచేస్తున్న పదిహేనువందల మందితోను పరిచయం చేసుకున్నాడు. నవ్వుతూ పలకరిస్తాడు. వీలున్నంతవరకు సాయంకూడా చేస్తాడు. బ్రహ్మచారి. 'ఈసురోమని మనుషులుంటే దేశమేగతి బాగుపడునోయ్' అనే తత్వం జీర్ణించిపోయిన పడుచువాడు.

అతని జీతం ఆరువందలే. అయినా ఖరీదైన బట్టలు తొడుగుతాడు. ఎప్పుడూ ట్రిమ్‌గా కనిపిస్తుంటాడు. కూలింగ్ గ్లాసెస్ దగ్గరనుంచి కాలిజోళ్ళ వరకు అన్నీ ఖరీదైనవే. తాను ఉంటున్న గదికి రెండువందలు అద్దె ఇస్తున్నాడు. అతని వరసచూస్తే కనీసం వెయ్యి రూపాయలు సంపాదిస్తుండాలి. కానీ లేదే! పోనీ వెనకాల ఆస్తి ఉందా అంటే అదీలేదు. ఇంకెక్కడయినా పార్టుటైమ్ చేస్తున్నాడేమో అని విచారిస్తే ఆ ఛాయల్లేవు.

కంపెనీమేనేజరు ఆనంద్ వ్యవహారం చూసి తల్లడిల్లిపోతున్నాడు. ఆరువందలు సంపాదిస్తున్న ఆనంద్ తోటి ఉద్యోగులు నెలాఖరు వచ్చేసరికి అప్పుకోసం చెయ్యి జాపడమే. ఆనంద్‌మాత్రం ఒక్కరోజున కూడా డబ్బుకి ఇబ్బంది పడ్డంలేదు.

ఉండబట్టలేక మేనేజర్ ఒకనాడు ఆనంద్‌ని పిలిచి అడిగాడు.

"మిస్టర్ ఆనందూ! నీకొచ్చే జీతానికి, నువ్వు పెట్టే ఖర్చుకి లంగరందడంలేదు. ఇది గవర్నమెంటుద్యోగమా లంచాలకు కక్కుర్తి పడ్డావనుకోవడానికి? అదీలేదు. నీకిటుకేమిటో నాక్కూడా చెప్పు. సంసారం ఈదలేక సతమతమయిపోతున్నాను"



# కథలు

"అలాంటివి మీరగడకూడదు. నే చెప్పకూడదు" అని నవ్వేశాడు ఆనంద్.

"అంత రహస్యమా?"

"రహస్యమేంలేదు. అంతా పబ్లిక్ వ్యవహారమే. మాయలేదు, తంత్రంలేదు. దగాలేదు, మోసంలేదు. నేనెప్పుడూ రాజబాటలోనే నడుస్తాను"

"బాబ్బాబు! అదేదో నా చెవినివెయ్యి. ఎవ్వరికీ చెప్పనులే"

"ఊరంతా తెలిసిన సంగతి మీకు మాత్రం ఎందుకు తెలియకపోవాలి.వినండి. ఒకటో తారీకున మీరు నా జీతం కవరులో పెట్టి ఇస్తారుగదా! దాన్ని అలాగే ఉంచి లాటరీవేస్తాను. టిక్కెట్టుఖరీదు అయిదు రూపాయలు. ఆరొందలు వెంటనే వచ్చేస్తాయి. పోతే అయిదు రూపాయలు పోతాయి. అంతే! మనకంపెనీవాళ్ళందరూ టిక్కెట్లుకొంటారు. వాళ్ళే లాటరీనంబరు తీస్తారు. నంబరువచ్చినవాడు తనజీతంలోపాటు నా పే కవరుకూడా ఇంటికి పట్టుకుపోతాడు. ఇక నా సంగతంటారా? ఒక్కోనెల వెయ్యిదాకా పోగవుతారు. ఒక్కోసారి 1200, 1500 కూడా. అదండీ నా ఆదాయం"

"చూడు ఆనందూ! రేపు ఒకటో తారీకున నాకుకూడా రెండు టిక్కెట్లివ్వు. అదృష్టంచూద్దాం. పోతే పదేగా" అన్నాడు హుషారుగా.

## ఫస్ట్ క్లాస్

రామయ్య సన్నకారు రైతు. చిన్నప్పుడే వ్యవసాయంలో పడెయ్యడంవల్ల అతనికి చదువుకోడానికి అస్కారం లేకపోయింది ప్రభుత్వం నుంచి ఏదయినా ఉత్తరంవస్తే ఎవరి దగ్గరకయినా పట్టుకెళ్ళి చదివించుకోవలసి వస్తోంది.

రామయ్యకు ఒక్కడే కొడుకు. చురుకైన కుర్రాడు. పక్క గ్రామంలో హైస్కూలు ఉంటే అందులో చదివించాడు పదవ తరగతి వరకు. ఇంకా పైకి చదివించాలని రామయ్యకు మనసులో ఉంది. కాని అది తనకు మించిన భారమేమోనని తటపటాయిస్తున్నాడు.



కొడుకుని పట్నం పంపాలి. హాస్టల్లో పెట్టాలి. కొత్త బట్టలు కుట్టించాలి. జీతాలకు, పుస్తకాలకు బాగా డబ్బు ఖర్చవుతుంది. ఇదంతా తలచుకుని కొంచెం వెనకాడాడు.

అతని భార్య గట్టిగా పట్టుపట్టింది- పొలం అమ్మైనాసరే కొడుకుని చదివించాలని. తండ్రి అంతర్యం తెలుసుకుని కొడుకు ఏడుపే మొదలెట్టాడు. మొత్తం మీద సరేనని అయిదొందలు చేతికిచ్చి కొడుకుని పట్నం పంపించాడు కాలేజి చదువుకి. క్వార్టర్లీ పరీక్షలయ్యాక మార్కుల షీటు తీసుకుని కొడుకు ఇంటికొచ్చాడు.

"మీ క్లాసులో నువ్వెన్నోవాడివిరా?"

"రెండవవాణ్ని. నాకంటే ఇంకో అబ్బాయికి ఒక మార్కు ఎక్కువ వచ్చింది"

''ఎందుకొచ్చిన చదువురా..క్లాసులో మొదటివాడుగా రాలేకపోతే ఇంత దూరం నుంచి వెళ్ళడమెందుకు? అంత ఖర్చు దేనికి?'' అన్నాడు రామయ్య.

కొడుకు చిన్నబుచ్చుకున్నాడు. తండ్రి చెప్పింది నిజమే. ఏమయినాసరే క్లాసులో ఫస్ట్ రావాలని దీక్ష పెరిగిందతనిలో.

హాఫ్ ఇయర్లీ పరీక్షలు ముగిశాక కొడుకు ఆనందంగా ఇంటికి తిరిగొచ్చి, తండ్రికి మార్కుల షీటు అందించాడు.

''క్లాసులో ఫస్ట్ నేనే నాన్నా! నా తర్వాతే అందరూ" గర్వంగా చెప్పాడు.

నోట్లో చుట్టని నెమ్మదిగా తిప్పుతూ—

''ఊఁ...బాగానే ఉంది. నాకు తెలియ కడుగుతా – నువ్వు ఫస్ట్ వచ్చే కాలేజి ఆదేం కాలేజీ? అట్టాంటి చెత్త కాలేజిలోనా జేరేది? ఆఁ...'' నసిగాడు రామయ్య.





# కారణం

ఆ పేటలో చూడముచ్చటైన దంపతులెవరని అడిగితే, భిన్నాభిప్రాయం లేకుండా ముకుందరావుని, అతని భార్య సుందరిని పేర్కొంటారు. వాళ్ల అన్యోన్యతని చూసి అసూయపడినవాళ్లు కూడా ఉన్నారు. వాళ్ళ మంచితనంకూడా అంత గొప్పగానూ చెప్పుకుంటారు. ఇద్దరివీ ఎప్పుడు చూసినా నవ్వుమొహాలే. చీకూ చింతాలేని జీవితాలు వాళ్లవి.

అలా వుండగా ముకుందరావు హఠాత్తుగా పెళ్ళాన్ని ఇంట్లోంచి బయటికి గెంటేశాడు. 'ఇక నాకు, నీకు రాంరాం. నీదారి నువ్వు చూసుకో,'మని కరాఖండీగా చెప్పేశాడు. గళ్లుమనిఏడుస్తూ బయటికొచ్చేసరికి, పేటవాళ్లు చూసి, ఆమెను తీసుకెళ్ళి సముదాయించారు. సుందరిని ఇంట్లోంచి తరిమేశాడనేసరికి అమ్మలక్కలందరికీ ఆమె భర్తమీద అపరిమితమైన ఆగ్రహ మొచ్చింది. సాయంత్రం వాళ్ళ మగాళ్లు ఇంటికిరాగానే ప్రతి ఇంటావిడ తన భర్తను నిలేసి, ఏమైనా సరే ముకుందం సంగతి తేల్చాల్సిందేనని పట్టుబట్టింది. అన్యాయంగాసతీసావిత్రిలాంటి ఇల్లాలుని పట్టుకుని అన్యాయం చేసాడా, ముకుందరావు ఆగడం కట్టించాల్సిదేనని ఆడా మగా కలిసి తీర్మానించారు.

ఆరాత్రి హోటల్లో భోంచేసి, ఇంటికి తిరిగొచ్చి విశ్రాంతిగా పడకకుర్చీలో కూర్చుని పేపర్ తిరగేస్తున్నాడు ముకుందరావు. పావుగంటకూడా గడవలేదు. పేటలో వాళ్లు పదిమంది మగ,అరడజనుమంది ఆడ గుంపుగా అతనింటికి వచ్చారు. శ్రీరామ నవమి చందాకోసం వచ్చారేమో అనుకుని వాళ్ళను లోపలికి ఆహ్వానించాడు. కాని

వచ్చినవాళ్లల్లో ఒకరి మొహంకూడా నవ్వుతూ కనపడకపోయేసరికి ముకుంద రావు అసలు సంగతిని ఇట్టే పసిగట్టాడు.

"ఏమండీ! మీరు మీ ఆవిడను ఇంటి లోంచి బయటికి పంపించేశారు. ఏమిటి మీ ఉద్దేశం?" నిగ్గదీశాడొక పెద్దమనిషి.

"విడాకులిద్దామను కుంటున్నాను" తాపీగా జవాబు చెప్పాడు ముకుందరావు.

"విడాకులా? మీరేదో పెద్దమనిషను కొన్నాం ఇన్నాళ్లు. ఇంత బరితెగిస్తా రనుకోలేదు. ఏమిటి ఆవిడలో లోపం? అందంగా లేదా?"

"ఉంది"

"ఆవిడ నడవడిక బావుండలేదా?"

"సీతాదేవి తర్వాత పతివ్రతలలిస్టులో ఆవిడపేరే రాశారు"

"వంట భాగా చెయ్యడంలేదా?"

"నలుడు, భీముడు పాకశాస్త్రంలో ఆవిడముందు దిగదుడుపే"

"మరేమిటయ్యా ఆవిడలో లోటు? ఎందుకు వదిలెయ్యాలి? ఒక్క కారణం చెప్పు" గట్టిగా అడిగింది ఒక పెద్దముత్తయిదువ.

ముకుందరావు అల్లంత దూరంలో వున్న తన చెప్పు ఒకటి తీసుకొచ్చాడు.

"దీన్ని చూడండి. చూడ్డానికి అతి ముచ్చటగావుంది. ఖరీదు వందరూపాయలు. తళతళ మెరుస్తోంది కూడా. కాని అది ఎక్కడ కరుస్తుందో, ఎలా బాధపెడుతుందో తొడుక్కునేవాడికి నాకు తెలుసు. నా భార్య అంతే.! ఇక వెళ్ళిరండి" అంటూ చేతిలో చెప్పను దూరంగా విసిరాడు.

వచ్చినవాళ్లలో ఒక పడుచువాడు 'చెప్పులోని రాయి, చెవిలోని జోరీగా...' అంటూ వేమనపద్యాన్ని బిగ్గరగా వల్లె వేశాడు.

—సమ్మెట రాధారమణి



## మీ చేతుల్లో ఒదిగిపోయే తారామణిహారం
## మీ కన్నుల్లో వెలుగులు చిమ్మే దివ్వెల తోరణం

- చలనచిత్ర పరిశ్రమలోని ప్రతి రంగం గురించి సమగ్రమైన సమాచారాన్ని అందిస్తుంది 'సితార'

- ఆబాలగోపాలాన్ని తన అందచందాలతో ఆకర్షిస్తుంది 'సితార'

- రంగుల ముఖచిత్రాలతో, అభిమాన తారల వర్ణచిత్రాలతో, తాజాతాజా ఖబుర్లతో మిమ్మల్ని మురిపించే మరిపించే అంశాలతో, ఎన్నెన్నో విశేషాలతో వారం వారం వెలువడుతుంది 'సితార'

# సితార

సమగ్ర సినీ వారపత్రిక

రూపాయి మాత్రమే

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా, హైదరాబాదు-500004

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Mon
Eenadu Compound, Hyderabad - 500 004.

